# రంగనాథ - ఏకోజీ రామాయణములు
# తులనాత్మక పరిశీలన
# సిద్ధాంత గ్రంథము




తిరుమల తిరుపతి దేవస్థానం వారి
ఆర్థిక సహాయంతో ముద్రించబడినది.

డా॥ ఎం. పద్మకుమారి, ఎం.ఏ., పిహెచ్.డి.
తెలుగు ఉపన్యాసకులు
పి.వి.పి. ప్రాచ్యకళాశాల, కామారెడ్డి,
నిజామాబాద్ జిల్లా - ఆం.ప్ర.

ప్రథమ ముద్రణ - సెప్టెంబర్ - 1999

ప్రతులు : 1000



ప్రాప్తిస్థానము :
డా॥ ఎం. పద్మకుమారి
ఇ.నెం.1-58, వాటర్ ట్యాంక్ దగ్గర,
కర్మన్‌ఘాట్ (రంగారెడ్డి జిల్లా).
హైదరాబాద్ - 500 963.

నవోదయ బుక్ హౌస్
అర్యసమాజ్ మందిర్ ఎదురుగా,
కాచిగూడ, హైదరాబాద్ - 27.



వెల : రూ. 100/-

ముద్రణ :
కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
విద్యానగర్, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 7618261

# అంకితం

కలియుగ ప్రత్యక్షదైవము
కరుణాకటాక్ష రూపము
అనన్య సామాన్య వైభవోపేతము
పరమపురుషార్థసాధకమునగు
శ్రీ వేంకటేశ్వర దైవతము పాదపద్మములకు
నా ప్రథమ కృతి కుసుమము
భక్తి వినమ్రతలతో అంకితము.



కం॥ అంకితమొనర్తునాకృతి
పంకజనాభునకు విభుకు పద్మాపతికిన్ ।
సంకటహరునకు మ్రొక్కుచు
వేంకటనాథునకు నాదువేడుక మీరన్ ॥

# విషయసూచిక



## ప్రథమ ప్రకరణము



## ద్వితీయ ప్రకరణము



## తృతీయ ప్రకరణము

## చతుర్థ ప్రకరణము

## పంచమ ప్రకరణము



## షష్ఠ ప్రకరణము



## సప్తమ ప్రకరణము

## అష్టమ ప్రకరణము



## నవమ ప్రకరణము



## దశమ ప్రకరణము



## ఏకాదశ ప్రకరణము





Dr. S. Viswanatha Sharma
M.A., Ph.D., (Skt.) & M.A. (Tel.) (Retd)
Dean, Faculty of Oriental Languages,
Osmania University, Hyderabad - 500 007.
AND
Principal
A.K.L.R. Govt. Andhra Oriental College (Eve.)
Nallakunta, Hyderabad - 500 044.



Ph : 7561508 (R)

# ఆశీస్సులు

"విద్యాదదాతి వినయమ్" అన్నట్లు చి॥ శ్రీమతి డా॥ ఎం. పద్మకుమారి విద్యతోపాటు దానికి తగిన చక్కటి వినయాన్ని కూడ అలవరచుకొన్న వ్యక్తి. ఆమె మొదటి నుండియును విద్యాభ్యాసమునందాసక్తి, పట్టుదల, పెద్దలయెడ వినయవిధేయతలు కలిగిన ఉత్తమ విద్యార్థిని. ఆమె నమ్రతతో నమస్కరించి నపుడు "పెద్దలపొడగన్న భృత్యుని కైవడిచేరి నమస్కృతుల్ సేయు వాడు" అను పోతన గారి ప్రహ్లాద చరిత్రలోని పద్యాంశం జ్ఞాపకం వస్తుంది. కావుననే ఆమె అనతికాలంలోనే ఎం.ఏ. (ఎల్) తెలుగు వరకు చదువు పూర్తి చేసి, ఉపన్యాసక పదవి నలంకరించి, అంతటితో తన విద్యావ్యాసంగమునాపక "రంగనాథ-ఏకోజీ రామాయణములు తులనాత్మక పరిశీలన" అను అంశముపై చక్కని విమర్శగావించి, సిద్ధాంత వ్యాసమును సమర్పించి, పిహెచ్.డి పట్టము నందుకొనగలిగినది. అంతేగాక వెనువెంటనే ప్రయత్నించి తన సిద్ధాంత వ్యాసము ముద్రణము కూడా చేయించి సాహితీ లోకానికి అందించినది. గ్రంథ రచనమొక యెత్తు దాని ముద్రణ మరియొక యెత్తు. అది ద్రవ్య వ్యయ ప్రయాసలతో కూడిన పని. అలనాడు పెద్దన "ఊరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే" అన్నాడు. కానీ యీనాడు దాన్ని "ఊరక కృతుల్ ప్రచురించుటయన్న శక్యమే" అని అంటే బాగుండేదేమో? అనిపిస్తుంది. కొద్దికాలములోనే నిర్విరామముగా కృషిసల్పి విద్యారంగమున శ్రీమతి పద్మకుమారిలాగ నింతటి యభివృద్ధి గాంచువారలు చాలా అరుదుగా నుంటారు. ఆమె పురోగతికి కారణములు ఆమెకు విద్య యందుగలశ్రద్ధ గురుభక్తి శుశ్రూషానురక్తి. అందుకే

"అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవినః।
చత్వారితస్య వర్ధంతే ఆయుర్విద్యాయశోబలమ్॥

అని శ్రీమద్రామాయణమున వాల్మీకి మహర్షి వర్ణించినాడు. ఆ సూక్తి పద్మకుమారి యెడ సార్థకమైనది.

ఇక శ్రీమతి పద్మకుమారి తన పిహెచ్.డి పరిశోధనకయి ఎన్నుకున్న విషయము కూడ పరమ పవిత్రమగు "రంగనాథ-ఏకోజీ రామాయణ కథాంశము."

"చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం ।
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్" - అన్నారు. ఆదికవి వాల్మీకి మహర్షి రచించిన ఆదికావ్యమగు శ్రీమద్రామాయణము నందలి ఇతివృత్తమును ఆధారముగా తీసికొని అనేకమంది మహాకవులు అనేక రామాయణముల రచించి కీర్తి ప్రతిష్ఠల నొందినారు. వాల్మీకుల వారి రామాయణ కథనే తీసికొని ఇంత మంది కవులు తమ రామాయణ రచనలను సాగించడము ఎంతవరకు సమంజసమని గ్రంథాదిన శంకించి చంపూ రామాయణ ప్రబంధకర్త యగు భోజమహారాజు ఇలా సమాధానం చెప్పుకున్నారు.

"వాల్మీకి గీతరఘుపుంగవ కీర్తి లేశైః తృప్తింకరోమి కథమప్యధునాబుధానాం
గంగాజలైర్భువిభగీరథయత్న లబ్ధైః కింతర్పణం నవిధధాతి జనఃపితౄణామ్"

వాల్మీకి మహర్షి రచించిన రామాయణమునందలి కథను గ్రహించి ఎంత మంది కవులు ఎన్ని విధాలుగా నెన్ని రామాయణములనైన రచించి తరించవచ్చును. భగీరథుడు తన పితృదేవతలను పునీతుల సేయుటకు నింగి నుండి నేలకు అవతరింపచేసిన గంగానదీజలములతో నెంత మంది తర్పణాలు చేసితమ పితృదేవతలను తృప్తి పరచుకొనటలేదు అంటాడు. అట్లు రామాయణకథాధారముగా రచింపబడిన రామాయణాలలో నన్యతమములు రంగనాథ - ఏకోజీ రామాయణములు.

గోనబుద్ధారెడ్డి రచించిన రంగనాథ ద్విపద రామాయణము ఏకోజీ రచించిన ద్విపద రామాయణము ఈ రెండును మిక్కిలి సామ్యము గలవి. శ్రీమతి పద్మకుమారి వీటి యందు గల పోలికలను, భేదములను వాని యందలి ఔచిత్యములను ఇంకెన్నియో యితర విషయములను తన బుద్ధిమంథానమున మథించి చక్కని తులనాత్మక పరిశీలన గావించి పండితుల మెప్పువడసినది. ఆమె యీకృషి అత్యంత ప్రశంసనీయము. భారతదేశమున రామాయణమునకున్న ప్రఖ్యాతి యేయితర గ్రంథములకు లేదన్నను నతిశయోక్తికాదు. దానికి మూల కారణము శ్రీ మహావిష్ణువు యొక్క సంపూర్ణావతారమగు శ్రీరాముని గుణగణాలను చరిత్రను అది వివరించుటయే

"ప్రబంధానాం ప్రబంధౄణామపి కీర్తి ప్రతిష్టయోః।
మూలం విషయభూతస్యనేతుర్గుణ నిరూపణమ్॥

అని ప్రతాపరుద్రీయమున విద్యానాథకవి వచించియున్నాడు.

శ్రీమతి పద్మకుమారి యీ విమర్శ గ్రంథమున కేవలము తన విషయానికి సంబంధించిన రంగనాథైకోజీరామాయణాల వివరణ యొసంగుటేకాక అనేక మంది మహాకవులు తెలుగున

వివిధ సాహిత్య ప్రక్రియలలో అనగా పద్యగద్య హరికథా యక్షగాన ద్విపదాది రూపములలో రచించిన ఇతర రామాయణాల నెన్నింటినో ఉదాహరణకు భాస్కర రామాయణము, నిర్వచనోత్తర రామాయణము అచ్చతెనుగు రామాయణము అధ్యాత్మ రామాయణము, మొల్ల రామాయణము రామాయణ కల్పవృక్షము మొదలగు వానిని సంగ్రహముగా పరిచయము గావించినారు. ఇది ఆమె ప్రతిభకు తెలుగు సాహిత్య పరిజ్ఞానమునకు నిదర్శనము. రంగనాథ - ఏకోజీ రామాయణముల తులనాత్మక పరిశీలనము కూడ తన గ్రంథమున నామె క్షుణ్ణముగా గావించినది. ఈ రెండు రామాయణాల రచనా కాలములు, నాటి సాంఘిక మత రాజకీయపరిస్థితులు, కథాంశములలోని భేదములు, అవాల్మీకాంశములు వీటిలోని పురాణ కావ్య లక్షణములు, పాత్ర చిత్రణ కల్పనా చాతుర్యము, వర్ణనా వైచిత్ర్యము, ప్రాచీనాంధ్ర సాహిత్యమున వీటికి గల స్థానము మున్నగునెన్నియో విషయాలను శ్రీమతి పద్మకుమారి తులనాత్మకముగా తన సిద్ధాంత గ్రంథమున విడమరిచి ప్రదర్శించుట ఆమెకుగల విమర్శనా పటిమకు గీటురాయి. ఇట్టి గ్రంథ రచనకు తగిన సూచనలనొసంగిన పర్యవేక్షకులగు ఆచార్య ఎన్. గోపాల్, ఉపాధ్యక్షులు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ గారి కృషి కూడా మిక్కిలి శ్లాఘనీయము.

ఈ "రంగనాథ-ఏకోజీ రామాయణముల తులనాత్మక పరిశీలన" అను గ్రంథము సాహితీ పిపాసులకు రామకథా రసికులకును అత్యంతోపయోగకరమయి యావదాంధ్రదేశమున ప్రఖ్యాతి నొందవలెనని గ్రంథ రచయిత్రి చిరంజీవిని శ్రీమతి డా.యం. పద్మకుమారి ఇతోధికాభివృద్ధి గాంచి మునుముందు కూడ తన రచనా వ్యాసంగమును సాగించుచూ ఆయురారోగ్యైశ్వర్యముల నొంది వర్ధిల్లుగావుతమని ఆశీర్వదించుచున్నాను.

శ్లో॥ రంగనాథ కవీంద్రస్య చైకోజీసుకవేస్తథా।
రామాయణే సౌతులయన్ పద్మాగ్రంథో విరాజతామ్॥

డా॥ శివునూరి విశ్వనాథ శర్మ
విశ్రాంత ప్రధానాచార్యులు మరియు
డీన్, ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాద్.

శ్రీ గణేశనిలయము
2.2.1132/4/ఏ
కొత్తనల్లకుంట
హైదరాబాద్ - 44. ఫోన్ : 7561508
తేది : 6-9-1999.

**Principal**
**Osmania University College**
**for Women** (Autonomus)
Osmania University, Koti,
Hyderabad - 500 195. A.P.



Ph : 4045210 (R)
4657813 (O)
4657085 (O)

# ఆశీస్సులు

వాల్మీకి రామాయణం మూలాధారంగా, భాస్కర, మొల్ల, రంగనాథ, ఏకోజీ రామాయణం మొదలైన పెక్కురామాయణాలు మనందరికీ సుపరిచితాలు. ఎన్నిసార్లు చదివినా ప్రతిసారి ఏదో కొత్తదనం కనిపింపచేసి ఆలోచింపచేసే గ్రంథాలు మన పురాణ గ్రంథాలు. తరువాత వచ్చిన రామాయణాల్లో మూల గ్రంథంలో లేని కొన్ని విషయాలు చోటు చేసుకొన్నాయి. దేశకాల పరిస్థితులననుసరించి ఈ మార్పులు, చేర్పులు సహజం. అయితే ఎంతవరకు సమంజసం అనే ప్రశ్న తలెత్తక మానదు. అలాంటి ప్రశ్నలకు దీటైన సమాధానం రాబట్టే ప్రయత్నమే పరిశోధన. రామాయణ మహాభారతాలపై పెక్కు పరిశోధనా గ్రంథాలు వెలువడ్డాయి.

డా. ఎం. పద్మకుమారి పరిశోధనా గ్రంథం రంగనాథ ఏకోజీ రామాయణముల తులనాత్మక పరిశీలన' కూడా ఆ కోవలోనిదే. రచయిత్రి ఈ గ్రంథంలో తానెంచుకున్న రెండు రామాయణాలలో అవాల్మీకాంశాలను ఎత్తిచూపి సమన్వయము చూపించినరీతి గమనార్హం. అలాగే పాత్ర చిత్రణ, కథా సంవిధానం వర్ణనాంశాలు సరళ భాషలో చెప్పిన రీతి అంతగా చదువుకోని వారికి కూడా అర్థమయ్యే విధంగా ఉన్నాయి. రచయిత్రి ఎంచుకున్న పరిశోధనారంగం పురాణేతిహాసాలతో పరిచయమున్న వారెవరికీ కొత్తదికాదు. అయినా "ఏం వ్రాశారో" అనిపించి చదివింపచేసే ఈ గ్రంథాలు అభినందనీయం. పరిశోధనా రంగంపై వున్న ఆసక్తి వీడకుండా మరిన్ని మంచి గ్రంథాలు అందించాలని ఆశీర్వదిస్తూ.....

ఆచార్యా పి. ప్రమదాదేవి
ప్రిన్సిపాల్

ఆచార్య ఎస్వీ రామారావు
డీన్, ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్స్
ఉస్మానియా విశ్వవిద్యాలయం



Tel : Office : 7016186
7018951/249
Res. : 7530728

# శుభాకాంక్షలు

ఆధునిక పరిశోధనారంగంలో తులనాత్మక పరిశీలనకు ప్రత్యేకమైన స్థానం వుంది. విభిన్న భాషా సాహిత్యాలలోని ఏకసూత్రతను, వైవిధ్యాన్ని అవగాహన చేసుకోవడానికి అది ఎంతగానో ఉపకరిస్తుంది. ఒకే భాషలోని భిన్న యుగాల, భిన్న ప్రక్రియల రచనలలోని తారతమ్య పరిశీలనకు కూడా దోహదం చేస్తుంది. ప్రస్తుత సిద్ధాంత వ్యాసం ఈ రెండో కోవలో చేరుతుంది.

13వ శతాబ్ది వాడైన గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణం, 18వ శతాబ్ది వాడైన ఏకోజీ రామాయణంలోని మూలకథకు మార్పు చేర్పుల గురించి వివేచించింది. డా॥ ఎం. పద్మకుమారి పరిశోధనా గ్రంథం. సందర్భానుగుణంగా సాంఘిక పరిస్థితులు, వర్ణనలు మొ॥ అంశాలు ఇందు ప్రస్తావితమైనాయి.

ఏమైనా వేర్వేరు యుగాలకు చెందిన ఇద్దరు ద్విపద రామాయణ కర్తల తులనాత్మక వివేచనకు పూనుకొన్న పరిశోధకురాలికి నా శుభాకాంక్షలు.

హైదరాబాద్,
తేది : 15-9-1999

డా॥ ఎస్వీ. రామారావు

**Prof. N. Gopi**
M.A., Ph.D.
Vice-Chancellor



Lalitha Kala Kshetram
Public Gardens,
Hyderabad - 500 004. (A.P.)

# అభినందన

డా.ఎం. పద్మకుమారి రచించిన 'రంగనాథ-ఏకోజీ రామాయణములు - తులనాత్మక పరిశీలన' నా పర్యవేక్షణలో పిహెచ్.డి పట్టా పొందిన గ్రంథం. తంజావూరాంధ్ర సాహిత్యయుగం పట్ల నాకున్న ప్రత్యేకమైన అభినివేశం వలన నేను ఈ పర్యవేక్షణను స్వీకరించడమైనది. రంగనాథ - ఏకోజీ రామాయణాలు ఒకరకంగా జానపదాంశం వున్న రామాయణాలు. తులనాత్మక పరిశోధన వివిధ భాషల మధ్యేకాక ఒక పురాణేతిహాసం గురించిన వివిధ గ్రంథాల మధ్య, వివిధ ప్రక్రియల మధ్య కూడా వుంటుందనటానికి ఈ గ్రంథం నిదర్శనం.

ఈ గ్రంథ రచన ఆసాంతం గ్రాంధిక భాషలో జరిగింది. డా.పద్మకుమారి ఇప్పటికే ఓరియంటల్ కళాశాలలో తెలుగు అధ్యాపనంలో కృషి చేస్తున్నది. తన బోధనానుభవంతో, నిరంతర అధ్యయన శీలంతో మరింత పదునైన సాహిత్య వ్యాసంగనం చేసి ఉజ్వల భవిష్యత్తును పొందాలని ఆశీర్వదిస్తున్నాను.

మీ
ఎన్. గోపి

ఆచార్య ఎం. కులశేఖరరావు
తెలుగు శాఖాధ్యక్షులు (రిటైర్డ్)
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాద్ - 7



ఇం.నెం. 1-8-702/32/39
పద్మాకాలని
శంకరమఠం వెనుక
నల్లకుంట, హైదరాబాద్ - 44.
ఫోన్ : 7616357

# మంగళాశాసనములు

రంగనాథ రామాయణము ఏకోజీ రామాయణము అనే విషయం మీద వెలువడిన ఈ సిద్ధాంత గ్రంథాన్ని ఆసక్తితో చదివినాను. తెలుగు సాహిత్యంలో గోనబుద్ధారెడ్డి రచన వచ్చిన తరువాత రామకథకు చాల ప్రాచుర్యం వచ్చినది. ద్విపద వంటి సరళగేయ సన్నిహిత ఛందాన్ని ఆ కవి గ్రహించడం ఊర్మిళా నిద్ర, లక్ష్మణరేఖ, పాతాళ హోమం వంటి కథా విశేషాలను కూర్చడం ఈ ప్రచారానికి కారణం కావచ్చు. జానపద రూపాలైన హరికథలు, భాగవతాలు ఈ గాథలకు కారణం కావచ్చు అనేవారున్నారు. కాని బుద్ధారెడ్డి కల్పనా ప్రతిభ కల్గిన వాడని ఈ కథలు ఆయన బుద్ధి జనితాలని, అవే తరువాత జానపదుల్లోకి వెళ్ళిపోయినాయి - అనుకుంటే సముచితంగా ఉంటుందని నా భావం.

ఏకోజీ రామాయణం ద్విపద రామాయణాల్లో అనంతర ప్రబంధ యుగంలో బుద్ధారెడ్డి ప్రభావంతో ఎంత చక్కగా వెలువడిందో మా పద్మకుమారి ఈ గ్రంథంలో వివరించింది. రచయిత మహారాష్ట్రుడైనా తెలుగు భాష అందులోను ద్విపద గానయోగ్యంగా ఉంటుందని ఈ మహారాజు ఈ రామాయణాన్ని రూపకల్పన చేసినాడు. తమిళ దేశంలో మహారాష్ట్ర పండితుడు, రాజు తెలుగు భాషలో ఈ రామాయణాన్ని వ్రాయడం ఒక అపూర్వ సంఘటన. ఇది తెలుగు భాషకు ఒక పతాక. శరభోజ సరస్వతీ మహల్ గ్రంథాలయంలో మహారాష్ట్ర (దేవనాగరి) లిపిలో ఇంకా ఇటువంటి మహారాష్ట్రుల తెలుగు కావ్యాలున్నాయని డా॥ ధనపాల్‌వార్ అంటున్నాడు. ఆ భాషా - ఈ భాషా తెలిసిన వారు ఆ తాళపత్ర సంపుటాల్లో ప్రవేశిస్తే ఎన్ని కావ్య ఖనులు లభిస్తాయో తెలియదు. చిరంజీవిని పద్మకుమారి ఇంకా చిన్నవయస్సులోనే ఉన్నది కాబట్టి ఈ పనికి పూనుకోవలెనని నా కోరిక. ఇటువంటి కృషిలో పద్మకుమారి కృతార్థురాలవుతుందని కూడా నా విశ్వాసము. ఎందుచేత నంటే పరిశోధన అనేది ఒక చోట ఆగేది కాదు. నిరంతర కృషి పరిశోధనకు వూటబావి. అమృతోపమానమైన చల్లని నీరు లభిస్తే, పరిశోధకుల దాహం తీరుతుంది. లోకానికి మేలు సమకూరుతుంది.

చిరంజీవిని పద్మకుమారి వ్రాసిన ఈ పరిశోధన గ్రంథానికి తగిన పరిగణన లభించవలెనని నా ఆకాంక్ష మంగళాశాసనములు.

తేది : 10-9-1999

ఆచార్య ఎం. కులశేఖరరావు

డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి
అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ
కార్యదర్శి, జాతీయ సాహిత్య పరిషత్, ఆం.ప్ర
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైద్రాబాద్ - 7.




Ph : 4657813 (O)
4657085 (O)
7017207 (R)

# పరిశోధన దర్పణం

శ్రీమద్రామాయణం పరిపూర్ణ మానవుణ్ణి నిర్మాణం చేసే ఉత్తమ గ్రంథం; ఆది కావ్యం; వాల్మీకి మహర్షికృతం.

దాని తర్వాత ఎన్ని గ్రంథాలు వచ్చినా దానిని దాటి పోలేదు. అందుకే సాహిత్య ప్రపంచంలో అదే ఈనాటికీ ఉదాహరణ ప్రాయంగా నిలిచింది. దానిని మించిన మరొక కావ్యం వస్తుందనే నమ్మకం లేదు. అది ఎప్పటికీ నిలిచి ఉండే కావ్యం. ఇప్పటికీ ఎప్పటికీ సాహిత్య వికాసానికి దోహదం చేసే కావ్యం.

శ్లో॥ యావత్ స్థాస్యన్తి గిరయః - సరితశ్చమహీతలే,
తావత్ రామాయణ కథా - లోకేషు ప్రచరిష్యతి॥

-ఈ భూమ్మీద ఎంతవరకు గిరులూ - ఝరులూ (నదులు) ఉంటాయో అంతవరకు ఈ రామాయణ కథ లోకంలో జీవించే ఉంటుంది. (నడుస్తూనే ఉంటుంది)

అలాంటికథ ప్రపంచంలోని అన్ని భాషల్లోకి వచ్చింది. ముఖ్యంగా భారతీయ భాషల్లోని సమస్త సాహిత్య ప్రక్రియల్లో అది ప్రచలితమయ్యింది. వందల-వేల-లక్షల పర్యాయములు ఆ కథ ఆడబడింది - పాడబడింది. ఆ కథ అపూర్వంగా ఈ లోకంలో అవతరించి ఆడబడి - పాడబడి ఆదరణీయమయింది. ఆచరణీయమయింది.

వాల్మీకి చేసిన ఈ సృష్టి వల్ల లోకం ఆయనను బ్రహ్మగానే భావించింది. ఆయన కవిబ్రహ్మ. బ్రహ్మ సృష్టీ శాశ్వతమే; వాల్మీకి కవిబ్రహ్మ సృష్టీ శాశ్వతమే.

బ్రహ్మాత్మకంబుగా
బ్రహ్మలోకము నందు
శతకోటి విస్తరంబగుచూ - నమరులకు
నతులొనర్పంగ బట్టగుచూ, నున్నట్టి
రామకథ మానవ క్షేమార్థమై - ధరా
సీమలకు పారింప చింతించి పరమేష్ఠి

తనయొకానొక యంశ
మున తనువు సేకొనుచు
వాల్మీకియై యవతరించీ - భక్త్యమృత
వాహినుల తపము పండించీ, శ్రీరామ
రామ శ్రీరామ యను నామంబు తన నిష్ఠ
గా, మహిత సిద్ధిగా కడువింత ఋషియగుచు

వంకలను వాగులను
వనములను ఘనములను
శ్రీరామ నామంబె వినుచూ - నా నంద
శిథిలితంబుగ హృదయమగుచూ, ప్రతి నిమే
షమ్ము రోమాంచమ్ము సొమ్ముగా మేనునకు
బ్రహ్మస్వరూపుడై భాసిల్లు వాల్మీకి......

- ఈ పై షట్పదులు జనప్రియ రామాయణ కర్త సరస్వతీపుత్ర డాక్టరు పుట్టపర్తి నారాయణాచార్యుల వారివి. అవును బ్రహ్మస్వరూపుడై భాసిల్లు వాల్మీకుల సృష్టి ఇది.

ఇది గీర్వాణంలో వచ్చింది. దేశభాషల్లో ప్రవేశించింది. జనహృదయంలో తిష్ఠవేసుకొంది. గాలిలా - గాలిలోని పరిమళంలా వ్యాపించింది.

అది తెలుగులో పద్యమై గేయమై ప్రవహించింది. జానపదుల వివిధ బాణీల్లో పల్లవించి పుష్పించి ఫలించింది.

ఆ రామకథను తెలుగునాట తిక్కన్న నెత్తికెత్తుకొన్నాడు. అప్పటినుండి ఎందరో తిక్కన్నలు ఈ రామకథామృతాన్ని త్రాగి తలబోసుకొంటున్నారు.

వారిలో గోనబుద్ధారెడ్డి ఒకరు, ఏకోజి మరొకరు. ఇద్దరూ ద్విపదలనే సమాశ్రయించారు. ఈ రెండు పదాలే (పాదాలే) ఇహపరాలని పులకించిపోయారు. ఇదే విధంగా కట్టా వరద రాజు శ్రీరామాయణం, గణపవరపు వేంకటకవి శ్రీరంగమాహాత్మ్యం కూడా ద్విపదల్లోనే వచ్చినై. జానపదుల పాటలుగా పరిగణింపబడే స్త్రీల రామాయణపు పాటల్లో నూటికి తొంబై ద్విపదలే. ద్విపదను కొందరు నిరసించినా దానిని ఇహపర సాధనంగా ఎందరో భావించారు

అలా ద్విపదల్లో గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణాన్ని ఏకోజీ రామాయణాన్ని త్రైపారు వేసి పరిశీలించే పరిశోధించే అవకాశం చిరంజీవి డా॥ ఎం. పద్మకుమారికి లభించింది. ఒక సిద్ధాంత గ్రంథాన్ని సంసిద్ధం చేసి విశ్వవిద్యాలయానికి సమర్పించి "రంగనాథ-ఏకోజీ రామాయణములు తులనాత్మక పరిశీలన" అనే అంశంపై డాక్టరేట్ పట్టా పొందారు.

రంగనాథ రామాయణం అనేక పర్యాయాలు అచ్చయి అది పఠన పాఠనాల్లో నిలిచి ఉన్నది. అంతేగాక దానిపై సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులెందరో వందలాది వ్యాసాలు వ్రాశారు. వైష్ణవ తత్త్వ ప్రతిపాదితమై బహుళ ప్రచారంలో ఉన్న శ్రీరంగనాథ రామాయణంపై డాక్టరేట్.పట్టా నిమిత్తం సాధికారికమైన పరిశోధన చేసి సిద్ధాంత గ్రంథం సంసిద్ధం చేసి పట్టా పొంది బృహద్గ్రంథంగా వెలయించినవారు శ్రీమాన్ డాక్టరు గుండి వేంకటాచార్యులవారు. వారు అధ్యయన అధ్యాపన, పఠన పాఠన పురాణ వైజ్ఞానిక ప్రబోధ ప్రవచనాల రంగంలో చిరకాలంగా ఇందూరు జిల్లాలోని కామారెడ్డిలో ఉన్న కారణంగా వారి సిద్ధాంత గ్రంథం ఆ గ్రామం నుండే ప్రచురితమయింది. విచిత్రం కాదుగానీ ఆశ్చర్యం కలిగించే విషయమే డా॥ ఎం. పద్మకుమారి ఈ పరిశోధన గ్రంథం కూడా కామారెడ్డి నుండే వెలువడుతున్నది. అమ్మాయి అక్కడి ప్రాచ్య విద్యా పరిషత్తు వారి ప్రాచ్య కళాశాలలో తెలుగు ఉపన్యాసకురాలుగా పనిచేస్తున్నది. ఆ కారణంగా ఈ గ్రంథమూ అక్కడి నుండి వెలువడినట్లే. శ్రీమాన్ ఆచార్యుల వారి పరిశోధనకు పూర్వం రంగనాథ రామాయణంపై పరిశోధనాత్మక ప్రసంగ వ్యాసాలు సంసిద్ధం చేయాలన్న ఆలోచన ఇదే ప్రాచ్య కళాశాల ప్రాంగణంలోని చెట్లక్రింద జరిగింది. ఆ ప్రసంగ వ్యాసాలు రూపుదిద్దుకోలేదు గాని పరిశోధన గ్రంథమే వచ్చింది. మళ్ళీ ఈనాడు ఆ రంగనాథుడు (గోనబుద్ధారెడ్డి) ఏకోజీ సహితుడై ఈ ప్రాచ్య కళాశాల ప్రాంగణంలో సంచరిస్తున్నాడు.

ఏకోజీ రామాయణాన్ని ఈమధ్యకాలంలో ఆత్మీయ మిత్రులు డా॥ ఎం. బాగయ్య గారు వెలుగులోనికి తెచ్చారు. తెలంగాణాలో బాగయ్య అనంగానే గుర్తుకు వచ్చే వారు తెలంగాణా యక్షగాన పితామహ, చిఱుతల నాట్య బ్రహ్మ శ్రీ చెర్విరాల భాగయ్యగారే. ఈ పేరు వారు సంస్కృతంలోని "భాగ" శబ్దవాచ్యులైనా, తెలుగు 'బాగు' వారైనా బాగైన పనులెన్నో చేశారు. అందుకే మా బాగయ్య ఏకోజీ రామాయణాన్ని వెలుగులోకి తెచ్చారు. 1993 ఏప్రిల్‌లో రెండు సంపుటాలుగా ఇది వెల్వడింది. ప్రథమ సంపుటంలో బాలకాండ-అయోధ్యకాండ-అరణ్యకాండలు, ద్వితీయ సంపుటంలో కిష్కింధాకాండ - సుందరకాండ - యుద్ధ కాండలు ఉన్నాయి.

గోనబుద్ధారెడ్డిది 1250 ప్రాంతం; ఏకోజీది 1740 ప్రాంతం. బుద్ధారెడ్డిది తెలంగాణాలోని పాలమూరు జిల్లాలో ఉన్న వర్ధమాన పురం. ఏకోజీది తంజావూరు. ఇద్దరూ రాజులే. రాజుల దగ్గరి నుండి పేదల వరకు రామాయణం అందరికీ సమానమే. రాముడు పేదల పెన్నిధి అయిన రాజే. వ్యక్తిగత సుఖాలను దూరం చేసుకొని ప్రజల సుఖాలకే అంకితమైన రాజు, ధర్మప్రభువు.

ఆ ఇతివృత్తాన్ని సృజనాత్మకంగా అందించిన వారు బుద్ధారెడ్డి ఏకోజీలు. దానిని పరిశోధనాత్మకంగా అందిస్తున్నవారు డా॥ ఎం. పద్మకుమారి.

పరిశోధనలు కూడా సూత్రాత్మకంగా, విశ్లేషణాత్మకంగా, వర్ణనాత్మకంగా, సృజన శోధనాత్మకంగా, సమీక్షాత్మకంగా, సమగ్రస్పర్శనాత్మకంగా ఉంటాయి. పిండికొద్ది రొట్టె, శ్రమ కొద్ది ఫలితం.

ఈ గ్రంథం 11 ప్రకరణాలుగా విభక్తమయింది. తెలుగు రామాయణములు - సమీక్ష, తెలుగులో ద్విపద ప్రక్రియ, సాంఘిక మత రాజకీయ పరిస్థితులు, అవాల్మీకింశముల సమన్వయము, సమకాలికాంశముల ప్రతిఫలనము, రంగనాథ రామాయణము రచనా ధ్యేయము, రెండు రామాయణాల్లో పురాణ - కావ్య లక్షణ సమన్వయము, పాత్ర చిత్రణ - తులనాత్మకత, కథా సంవిధానము, వర్ణనావైదగ్ధ్యము, ప్రాచీనాంధ్ర సాహిత్యములో రెండు రామాయణముల స్థానము...

ఇది సమగ్రదృష్టితో చేసిన విభజనే. వస్తువు, రూపం, శిల్పం సమీక్షించడమే ఈ విభజన ప్రధానోద్దేశం. ఈ సమగ్ర పరిశోధనను సమీక్షించాల్సిన అవసరం లేదు. చి॥డా॥ఎం. పద్మకుమారి తన శక్తి మేరకు ఈ పరిశోధన నేపథ్యాన్ని స్పృశించే ముంజేతి కంకణమే ఇది. పరిశోధన దర్పణంలోకి తొంగి చూడడమే జిజ్ఞాసువు చేయవలసినది. చిరంజీవి పద్మకుమారికి అభినందనం. వారి కలం నుండి ఇంకా విమర్శనాత్మక ఉత్తమ గ్రంథాలు రావాలని ఆశిస్తూ శెలవు.

భాగ్యనగర్

1999 సెప్టెంబర్, 6

'శిరోమణి'
డా॥ అయాచితం నటేశ్వరశర్మ
రీడర్, సంస్కృత శాఖ,
ప్రాచ్య విద్యా పరిషత్తు ప్రాచ్య కళాశాల,
కామారెడ్డి - 503 111
ఫోన్ : 21805

తేదీ : 19-9-1999

# అభిరామము

'పుణ్యశ్లోకస్య చరితముదాహరణమర్హతి' అను ప్రాచీనాలంకారికోక్తిననుసరించి పుణ్యశ్లోకుడే గాక, పురుషోత్తముడుగను, మానవోత్తముడుగను, సకల జగత్తున కాదర్శప్రాయుడైన శ్రీరాముని గుణగణములను వర్ణించు వాఙ్మయమనంతముగ నున్నది. ఆదికవి వాల్మీకి మొదలుకొని ఆధునికులైన అపరవాల్మీకులవరకెందరో కవులు తమకు నచ్చిన బాసలో, తమకు నచ్చిన యాసలో, తమకు నచ్చిన శైలిలో, తమకు నచ్చిన ఛందములో అందముగా, స్వచ్ఛందముగా అతిలఘు కావ్యములు మొదలు అత్యంత బృహత్కావ్యముల వరకు ఎన్నో రామగాథలను రచించినారు. గానము చేసినారు. తాదాత్మ్యము చెందినారు. పరతత్త్వములో లీనమైనారు. ఇట్లెందరో కవులెన్ని ప్రక్రియలలో నెన్ని రామాయణములను రచించినను కావ్య పుష్పక విమానములో మరియొక క్రొత్త రామాయణమునకు చోటుండును. ఇట్లే రామాయణమును విన్నను గన్నను నవ్యత్వము దివ్యత్వము సహృదయకోటి కనుభావ్యమానమగుట 'రామ' నామమునకు గల జనరంజకత్వమునకు తార్కాణము. అట్లే ఏ కవియైనను తన కవి జీవితమున కనీసమొక వాక్యము చేతనైనను రాముని స్మరింపనిదే తన పలుకునకు పవిత్రత లేదని భావించుట రామగాథకు గల విశ్వ సమ్మోహకత్వమునకు ప్రత్యక్షోదాహరణము. ఇట్టి భావనతోడనే రామాయణమును తమ నోట పలికించి, పవిత్ర జన్ములైన మహా కవుల శ్రేణిలో నిలిచినవారు గోనబుద్ధారెడ్డి, ఏకోజీ మహారాజులుకాగా, ఆ మహాకవులు రచించిన రామాయణములను తులనాత్మకముగ నధ్యయనము చేసి పుణ్యమును పురుషార్థమును సాధించుకొన్న సహోదరి - డా॥ ఎం. పద్మకుమారి.

'రంగనాథ-ఏకోజీ రామాయణములు తులనాత్మక పరిశీలన' అను అంశముపై ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి 'డాక్టరేటు' పట్టమునకు పాత్రమైన ఈ గ్రంథములోని విశేషాంశములను స్థాలీపులాక న్యాయముగ నుదాహరింతును.

ప్రథమ ప్రకరణములో - తెలుగులో వెలువడిన 'అమూల్య' రామాయణ మహాకావ్యములను పరిచయమొనర్చుచు, వాని ప్రత్యేకతలను వెల్లడించుటయేగాక, ప్రక్రియా క్రమమున, కాలక్రమమున వానిని పేర్కొనుట పరిశోధన ప్రమాణములకు తగినట్లున్నది.

ద్వితీయ ప్రకరణములో - తెలుగులో ద్విపద కవితావిర్భావమును, తత్ప్రాచీనతను పేర్కొనుచు, 'సంస్కృతమే దేశీయచ్ఛందస్సున కాద్యమైన' దను సిద్ధాంతమునొనర్చిరి. అంతేకాక, కాశ్మీరీ, అస్సామీ, ఒరియా వంటి ఇతర భాషలలో సైతము కనబడుచున్న ద్విపదచ్ఛందోచ్ఛాయలను గూర్చి సోదాహరణముగ వివరించిరి. కాళిదాసు 'విక్రమోర్వశీయము' నందు ప్రస్తావింపబడిన ద్విపద చ్ఛందోనామమును, తద్వ్యాఖ్యాన పంక్తులతో నుదాహరించి, సంస్కృతమున ఈ ఛందమునకు గల యునికిని నిరూపించిరి.

తృతీయ ప్రకరణములో - రంగనాథ, ఏకోజీ రామాయణములు రెండును నాటి సామాజిక దుస్థితులను చక్కదిద్దు లక్ష్యముతో గూడ ప్రభవించి, తెలుగు భాషను, సంస్కృతిని కాల ప్రవాహములో చెరిగిపోకుండ కాపాడగలిగినవని చారిత్రక నేపథ్య వివరణ పురస్సరముగ సప్రమాణముగ నిరూపించిరి.

చతుర్థ ప్రకరణములో - రంగనాథుడును, ఏకోజీయును వాల్మీకి రామాయణములో లేని యంశముల నెట్లు స్వీకరించి, నిర్వహించిరో వివరించుటయేగాక, ద్విపద రామాయణములలో సంపూర్ణములైనవి రంగనాథ-ఏకోజీ-వరదరాజ రామాయణములేయని సిద్ధాంతీకరించిరి.

పంచమ ప్రకరణములో - ఈ రెండు రామాయణములలోని సమకాలికాంశములను పేర్కొనుచు, ఆనాటి సాంఘిక దురాచారములను ప్రతిబింబించుచు, వాని నిర్మూలమునకు రామాయణ ఘట్టములను ప్రతీకలుగాజేసి వర్ణించిన సందర్భములను పేర్కొనుట ప్రశంసార్హము.

షష్ఠ ప్రకరణములో - గోనబుద్ధారెడ్డి పితృఋణ విమోచనమునకై రంగనాథ రామాయణమును రచింపగా, ఏకోజీ తన కావ్యమును లోకులు చదివి తరింపవలెనను ధ్యేయముతో రామాయణమును రచించెనని వివరించుచు ఈ యిరువురును ధర్మోద్ధరణదీక్షితులై ఈ పని చేసిరని చక్కగ విశ్లేషించిరి.

సప్తమ ప్రకరణములో - రెండు రామాయణములలోని పురాణ - కావ్య లక్షణములను సమన్వయించుచు, ఇరువురు కవులును కావ్య-పౌరాణికాంశములచే ప్రభావితులై తమ కావ్యములను వెలయించిరని నిరూపించిరి.

అష్టమ ప్రకరణములో - ఈ రెండు కావ్యములలోని పాత్ర చిత్రణలకు పోలికయున్నదని పేర్కొనుచు, రామాద్యుదాత్త పాత్రల పవిత్రత చెడకుండునట్లుగ నిరువురు కవులు వహించిన జాగరూకతను వివరించిరి. గౌరవాస్పదమగు విషయములలో వీరిరువురును స్త్రీ పురుష పాత్రలకు భేదమును ప్రకటింపక, తమ సమదర్శితను చాటుకొనిరని తీర్మానించిరి.

నవమ ప్రకరణమున - కథా సంవిధానమును గూర్చి చర్చించుచు, వస్తువు ప్రాతదే అయినను, నవ్యత్వముట్టిపడునట్లు ఈ యిరువురు కవులొనరించిన ప్రయత్నములనుదాహరించిరి. కావ్యములు మంగళారంభములు, మంగళమధ్యములు, మంగళాంతములు కావలెననెడి ఆర్యోక్తినీ కవి ద్వయము తు.చ. తప్పకనెట్లు పాటించి పాఠకులకు మంగళమును చేకూర్చిరో సోదాహరణముగ చూపిరి.

దశమ ప్రకరణమున - కావ్య సామాన్యములగు నగరార్ణవాది వర్ణనలను ఇరువురు నెంతసామర్థ్యముతో వర్ణించిరో వివరించి, ప్రసన్న కథాకథనము, సహృదయాహ్లాదము వంటి ఉత్తమ ప్రయోజనముల నాశించి వర్ణనలు చేసిరని ప్రకటించిరి.

ఏకాదశప్రకరణములో - ప్రాచీనాంధ్ర సాహిత్యములో రెండు రామాయణములకు గల స్థానమును వివరించుచు, దేశి కవిత్వము దాదాపుగ గేయ కవిత్వమేయని తేల్చిరి. ఇరువురు కవులు సంస్కృతము నెంతగ అభిమానించిరో, దేశిని గూడనంతే ఆప్యాయతతో నాదరించిరని వారి సమభావనను ప్రశంసించిరి. రంగనాథ రామాయణ నామ సార్థక్యమును వివరించుచు, పలువురు రంగనాథుడే కవియై యుండవచ్చుననెడి నమ్మకముతో నుండుట నూహించి, ఇచట రంగనాథ శబ్దము భగవన్నామ స్మరణార్థముద్దేశింపబడిన ముక్తిదమగు నామమేగాని కవి నామముగాదని చెప్పిరి.

ఇట్టి సిద్ధాన్తవ్యాసము అన్వర్థ నామధేయమైనది. ఒక కావ్యమును కూలంకషముగ నధ్యయనము చేయుటే అసిధారావ్రతము వంటిది. కాగా ఇక రెండు కావ్యములను తులనాత్మకముగ చదువుట యన్నచోనపార దీక్షా దక్షతల కుదాహరణమగును. పైపైని చూపులతో చేయు తులనాత్మక పరిశీలనకు, లోతుపాతులను దాకునట్టి చూపులతో జేయు అధ్యయనమునకు తేడా యున్నది. డా॥ పద్మకుమారి ఈ రెండవ కోవకు జెందిన పరిశోధన మొనర్చినదని నా యభిప్రాయము. రంగనాథ రామాయణము ప్రసిద్ధమైనదేగాని, దానితోపాటు అప్రసిద్ధమగు ఏకోజీ రామాయణములోని మాధుర్యమును గూడ లోకమునకందించిన ఘనత డా॥ పద్మకుమారికి చెందుచున్నది. ఈ సిద్ధాంత వ్యాసము వెలుగులోనికి

వచ్చుచున్న శుభసందర్భమున డా॥ పద్మకుమారిని అభినందనపురస్సరముగ నాశీర్వదించుచు, ఇంకను ఇట్టి అమూల్య గ్రంథములను రచించు శక్తియుక్తులను, ఆయురారోగ్య సౌభాగ్యములను ఈమెకు ప్రసాదింపవలెనని రామాయణ కథానాయకుడైన శ్రీరామచంద్రుని ప్రార్థించుచున్నాను.

సుధీవిధేయుడు
డా॥ అయాచితం నటేశ్వరశర్మ

ప్రమాథి-శ్రావణ - కృష్ణ
తృతీయ ఆదివారము

**Dr. M. Bagaiah**
M.A., M.Phil.,Ph.D.,
P.G. Diploma in Linguistics,
Asst. Professor
I/c Head Dept. of Languages,
P.G. College of Science
Dept. of Telugu, Osmania University,
Hyderabad - 500 007. A.P.




Ph : 7641118
H.No. 12-11-833/4/71,
Amber Nagar, Addikmet,
Hyderabad - 500 044.

# ఆశీరభినందనలు

ఆధునిక సాహిత్య పరిశోధనలు పరిమితమైపోయినవి. ప్రాచీన సాహిత్యంపై విశ్లేషించే పండితులు తక్కువమందేయున్నారు. ప్రాచీనమనగానే ఇంకేముంది అన్నిటిపై పరిశోధనలు అయినవేగదా! అంటారు. కాని మరుగుపడిన మాణిక్యాలు మరెన్నో ఉన్నవి. మసిగుడ్డలో గట్టినవిగా కన్పిస్తున్నవి. వాటి ముడివిప్పి ఆణిముత్యాలనేరుకొనే వారు అరుదైపోయారు. పెరుగును చిలికిన వెన్న వెళ్లినట్లుగా తరచి పరీక్షించిన గాని ప్రమాణమైన పరిశోధనలు బయటకు రావు. ఎవరు చేసిన పరిశోధన వారికి గొప్పగా కన్పించవచ్చు. కాని భావిపరిశోధకులకు అందించే ముడి సరుకు - జాలిపట్టి వడగొట్టె నాణ్యత సరకు దొరకడం లేదు. ఉన్న ఒక దానిని (ఆ ప్రాచీన అక్షర జ్ఞానాన్ని) జీర్ణించుకొనే నాథుడున్నాడా? ఓపిక లేదు; ఖర్చువద్దు; శ్రమ వద్దు; ఎక్కువ తిరుగలేను. నాకెవ్వరు సహకరించరు. నా ఒంటిలో ఎప్పుడు బాగుండదు, నేను తిరిగితే కండ్లు తిరుగుతాయి. కావున ఏదో ఒక పిహెచ్.డి. కావాలి? ఏదొ క డిగ్రీ ఉండాలి గదండి! అందుకే పరిశోధన చేయాలని ఉంది.మీ సహాయము కావలి అనే వారున్నారు.

ఇటువంటి పరిశోధకులున్న ఈ నవసమాజ నిర్మాతలకు ప్రాచీన సాహిత్యంపై పటుత్వము సడలిపోయినది. పట్టుమని పది పద్యాలు చూడకుండ - చూచికూడ చదువని వారు పిహెచ్.డి.లు చేయతలపెట్టినారు. అంటే అతిశయోక్తికాదు. అందరు కాదు సుమా! ఇది కొందరికే వర్తిస్తుంది. రామాయణాలంటేనే కొందరికి ఏవగింపు వస్తుందని, నాతో కొందరు వెలిబుచ్చిన విషయం. ఏముంది రామాయణంలో అంటారు. ఏమి లేనిది ప్రపంచానికే మణి దీపమై వెలుగుతుందా రామాయణం. టి.వీ.లో కోట్ల జనం చూచి తరించారు. జాతి మత భేదాలువీడి, ఇది అందరికి జవాబు.

ప్రాచీన సాహిత్యం మీద ఎవరైన పిహెచ్.డి. చేయాలనివస్తే నా వద్దకు పంపుతారు జనులు. ఏఏ ఖనిలో ఎంత ముడి సరుకు దాగుందో ఎవరికి తెలుసు. ప్రాచీన పుస్తక భాండాగారాలలో తరుణ సరస్వతి - పరిణతవాణిగా మారిపోయినది. భాండా గారాలలో నిక్షిప్తమైన (బంధింపబడిన) మాతృ సరస్వతికి చేయూత నిచ్చి సింగారింపులు

చేయించే తనయులీనాడు కరువైనారు. అంటే నేనేదో ఉద్ధరించాను. మీరు ఉద్ధరించండి అనే మాట కాదు సుమా! ఎవరేమి చేశారని కాదు. నేనేమి చేశానని చెప్పకోవాలి. అదే పరిశోధన పరమార్థం. సార్థకం కూడా.

రెండు ద్విపద రామాయణాల తులనాత్మక పరిశోధన ప్రాచీన కావ్య శోధనా పటిమకు నిదర్శనము. ఈ సిద్ధాంత గ్రంథం అన్ని కోణాలలో పరిశోధింపబడినది. రామాయణాల ప్రక్రియలు - వాటి స్థానములు వివరింపబడ్డాయి. ఆయా రచనల కాలం నాటి సామాజిక పరిస్థితులు, రాజకీయ స్థితులు తెలుపబడినవి. పురాతన, ఇతిహాస, కావ్య, చంపూ, గద్య, పద్య, యక్షగాన, జానపద రామాయణాలు సంగ్రహంగా పేర్కొనడం ఈ పరిశోధనలో ఒక ప్రత్యేకత. వీటిపై ఎన్నో పరిశోధనలు వచ్చాయి. గనుక సంగ్రహింపబడ్డాయి. అంటే సమీక్షలుకూడా ఉన్నవి. రామాయణ సారము ప్రజలకు సుఖశాంతులు కలుగించును. మోక్షము నాపాదించు సారమే ప్రధానం. ఇది ప్రాచీనుల మతమైనను మన ధ్యేయం కూడ అంతే.

డా॥ పద్మకుమారి దేశీయ ఛందములో గల ఈ ద్విపద కావ్యాల పరిశోధన పరమ ప్రమాణమైనది. మన దేశంలోని సోదర భాషలలో రామ కథా విశేషాలున్నవి. సంగీత సాహిత్య మేళవింపులున్నవి. వైష్ణవ శైవ మత సైద్ధాంతిక భావజాలమున్నది. పామర జనరంజకమై, పండితామోదము పొందిన రామకథ విశేషములున్నవి. దక్షిణాంధ్ర దేశములో వచ్చిన రచనలు అసంఖ్యాకములు - అమరములు కూడ. వీటిలో ప్రాచీన సంప్రదాయాలు, ప్రామాణిక విశేషాలున్నట్లు పద్మకుమారి పేర్కొన్నారు.

మధుర, తంజావూరు, పుదక్కోట విజయనగర సామ్రాజ్యాలలో కవులకు, పండితులకు ఆదరాభిమానములు మెండు. నృత్య, సంగీత కళాపోషకులకు పుట్టినిల్లు సర్వమత సమాదరణకు, శైవ, వైష్ణవ సిద్ధాంతాల మేళవింపులకు ఖని. ఈ కవుల కాలంనాటి సాంఘిక పరిస్థితులు దైవభక్తి, యోగక్షేమములను, చక్కగా విడమర్చి వ్రాశారు. అవాల్మీకాంశాలు, కవుల సమకాలికాంశాలు, వారి కీర్తి, కావ్యకీర్తి అమంగళక్షతి. పండిత పామర వ్యవహారములు, తదితర అనేకాంశాలు రచయిత్రి పేర్కొనడంలోని వాస్తవికత గుర్తించదగ్గది.

కవుల రచనా ధ్యేయము దేవతల అవతారాలు, కావ్యరచన ద్వారా పఠనముద్వారా పొందే రసానందం ముక్తి సోపానములు. ఇహపరకాంక్షలు చక్కగా సంగ్రహంగా వివరించి చూపిన డా॥పద్మకుమారి కృషి ప్రశంసనీయం.

రాముణ్ణి మహర్షులు, వానరులు, మానవులు,దానవులు దేవతలు కీర్తించారు. లోకాపవాద, భక్తి, భ్రాతృప్రేమ, మాతృ ఆవేదన, దేవ - రాక్షసుల గుణ ప్రభావములు, పతిభక్తి, రామభక్తి, ధీశక్తులు - కరుణ రసములు పోషింపబడినట్లు మనోహరంగా చూపారు.

ద్విపద రామాయణ రచయితలలో ప్రసిద్ధ రాజకవులు ముగ్గురు 1.గోనబుద్ధారెడ్డి 2. కట్టా వరదరాజు 3. ఏకోజీ అనువారు. వీరిలో దక్షిణాంధ్ర సాహిత్య యుగములో వెలసిన రామాయణాలలో ఏకోజీరామాయణమే ప్రసిద్ధము. అంతేగాక ఇందులో తమిళ, మరాఠి, తెలుగు భాషల మాధుర్యతను విపులీకరించి వివరించింది నా చెల్లెమ్మ.

కథా సంవిధానము - మనుష్యవిధి, మానవ వృత్తి, ప్రవృత్తి, కావ్య ఘట్టములు, ఆచారములు, జీవన సరళి, సంభాషణలు సామాన్య జనులకు హత్తుకొనునట్లు వివరించింది.

ఈ రెండు ద్విపద రామాయణాలపై ప్రామాణికముగా, సంగ్రహాంగా, మనోహరంగా వివరించి పరిశోధించిన నా చిన్ని చెల్లమ్మ డా॥ పద్మకుమారిని అభినందించి - ఆశీర్వదిస్తున్నాను.

మీ అన్నయ్య
బాగన్న

డా॥ ఎం. పద్మకుమారి
తెలుగు ఉపన్యాసకురాలు
పి.వి.పి. ప్రాచ్య కళాశాల,
కామారెడ్డి, జిల్లా నిజామాబాద్.

# నివేదన

మా స్వగ్రామం వికారాబాదునకు సమీపముననున్న మొరంగపల్లి. నా తల్లిదండ్రులు మాణెమ్మ బాలయ్యగార్లు నేను చిన్నదానిగా నున్నప్పుడే మా అన్నయ్య పదవతరగతి పాస్ అయిన వెంటనే 1971లో హైదరాబాదుకు వచ్చి ఆంధ్ర ఓరియంటల్ కాలేజీ నల్లకుంటలో చేరి తదుపరి చదువులు చదువుకున్నారు. నేనంటే అన్నయ్యకు చిన్నప్పట్నుంచి ప్రేమ, వాత్సల్యము. ఆ ప్రేమ ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉన్నది. తనంతటి దాన్నిగా నన్ను తీర్చిదిద్దాలనే ఒక దృఢ సంకల్పమే దీనికంతటికి కారణము. డాక్టరేటును చదివించాలని అన్నయ్యకోరిక. అది 1998 మేలో నెరవేరింది. నేను గవర్నర్ గారి చేతులమీదుగా పిహెచ్.డి. పట్టా అందుకుంటున్న క్షణంలో అన్నయ్య కళ్ళవెంబడి వచ్చిన ఆనందబాష్పాలే అందుకు సాక్ష్యం.

ఏదైనా పరీక్ష వ్రాయాలంటే అప్లికేషన్ ఫారం తీసుకురావడం, ఫీజులు కట్టడం, ఫారంను సబ్మిట్ చేయడం వరకు అన్నయ్యవంతు. కడుపులో చల్లకదలకుండా ఇంట్లోకూర్చుని చక్కగా చదివి పరీక్షలు వ్రాయడం నా వంతు.

ప్రతిరోజు స్కూలుకు వెళ్ళేటప్పుడు "మంచిగ చదువుకో" అని, పరీక్షవ్రాయడానికి వెళ్ళేటప్పుడు "ఏది మర్చిపోకుండా అన్నిమంచిగ వ్రాయి" అని దీవించి పంపుతారు. మా అమ్మ ఆశీర్వాదమే నన్నుపరీక్షలన్నింటిని గట్టెక్కించేటట్టు చేసిందని నా నమ్మకం.

మా వదినగారు అన్నయ్యకు తగిన సతీమణి. ఓర్పు, మర్యాద ఆమె ఆభరణములు. నాపెళ్ళైన తర్వాతకూడ పరీక్షలు వచ్చినప్పుడల్లా పుట్టింటికి వచ్చి నెలలకొద్ది వున్నా ఎంతో ఆదరాభిమానాలతో చూసేవారు. అలాగే ఇప్పటికీ నా మీద అవ్యాజమైన ప్రేమ చూపుతారు. నేను నా పిల్లలను వదిలిపెట్టి కాలేజికి వెళ్ళిపోతే వారిని సాకేది మా అమ్మ, మా వదిన ఇద్దరే. ఆమె కూడ ఉద్యోగస్తురాలే అయినా ఎన్నడూ విసుగు కన్పించని సహనమూర్తి. నన్ను చదివించి కన్యాదానము చేసిన కరుణామూర్తులు మా అన్నయ్య, వదినగారు. నేటికీ ఎంతో ప్రేమతో ఆదరిస్తారు. అభిమానిస్తారు. నన్ను తండ్రిలేని లోటు కనబడకుండా పెంచారు మా అన్నయ్య వదిన.

నన్ను చదివించవలెననడి అన్నయ్య పట్టుదలఫలించింది. అనుకొన్నట్టుగానే పిహెచ్.డి.లో సీటు రావడం ఎంతో సంతోషాన్ని కలిగించింది. అనుకున్న ప్రకారం యూనివర్శిటీ వారిచ్చిన గడువులోగా నా థీసిస్‌ను సబ్మిట్ చేయడం పట్టా పొందడం జరిగాయి. ఇంత ప్రాసెస్ వెనుక అడుగడుగునా అన్నయ్యానే వున్నారు. అంతా అన్నయ్యా కృషి, ఆ భగవంతుని కృపా కటాక్షవీక్షణము.

కర్మన్‌ఘాట్ మా అత్తగారి ఊరు. మామగారు చదువుపట్ల ఎంతో శ్రద్ధగలవారు. వారి చిన్నప్పుడు స్కూలుకు వెళ్ళే అవకాశం లేకపోయిందట. చదువుకోవాలనే వారి ఆశను ఎంతోమంది వద్ద వెలిబుచ్చారు. వారిలో కొందరు మా మామగారికి అక్షరాలు, అంకెలు నేర్పించారట. ఆ అక్షరజ్ఞానం నేడు పుస్తకపఠనం, పద్యపఠనం వరకు వచ్చింది. సందర్భానుసారంగా పద్యాన్ని ఉదాహరించి ఎన్నో మంచి మాటలు చెప్పే స్థాయికి ఎదిగారు. చదువు విలువ తెలుసుకొని వారి పిల్లలందరిని మంచి చదువరులుగా తయారు చేశారు. అందరికి మంచి భవిష్యత్తును ప్రసాదించారు. అందరూ నేడు మంచి స్థితిలో వుండగలుగుతున్నారు. మా అత్తగారు మహాసాధ్వి. ఎన్నడూ ఒక్క మాట కూడ అనని మంచి మనిషి. పరీక్షలున్నప్పుడు నేను మా పుట్టింటికి వచ్చి చదువుకొని పరీక్షలు వ్రాసినా ఏనాడూ అభ్యంతరము చెప్పని మంచి మనస్సుగల వ్యక్తి ఆమె.

నా అభివృద్ధికి మూలపురుషుడు, మదభిలాషా కల్పతరువు నా శ్రీవారు. నన్ను చదివించాలనే ప్రగాఢమైన కోరిక వారికున్నది. ఇంటర్మీడియట్‌లో నా వివాహమయ్యింది. తదనంతర చదువులు టి.పి.టి. బి.ఏ.(ఎల్) ఎమ్.ఏ. (ఎల్) ప్రీ పిహెచ్.డి., పిహెచ్.డి వంటి అత్యున్నత చదువులన్నీ వారి ఆధ్వర్యములోనే సాగినవి. అనునిత్యం వారి ప్రోత్సాహం నాలో ఉత్సాహాన్ని పెంచేవి. చదువులోను, ఇంటి పనుల్లోను చేదోడు వాదోడుగా వుంటారు. కోపమంటే ఏమిటో తెలియని శాంతమూర్తి. సహనమే వారి ఉనికి. ఇంటర్‌మీడియట్‌లో వారి జీవితంలో ప్రవేశించిన నన్ను ఒక గొప్ప స్థాయికి చేర్చారు. నేను చదువుకోవడం మర్చిపోయి బాతాఖాని కొడుతూ కూర్చుంటే రెండు చీవాట్లేసి పుస్తకం చేతికిస్తారు. వారి ప్రోత్సాహం వల్లనే నేనీనాడింతటి స్థాయికి ఎదిగాను. చదివించాలనే వారి కోరిక నన్ను ఉద్యోగస్థురాలినిగా తీర్చిదిద్దింది.

నా మరిది సుధాకర్ "నేను పిహెచ్.డి. చేయగలనా సుధా!" అని నేనడిగినప్పుడు, "నీకేంటొదినా కొండంత అండ మీ అన్నయ్య ఉన్నారు. తప్పకుండా పిహెచ్.డి. చేస్తావు," అని ధైర్యం చెప్పేవాడు. ప్రీ పిహెచ్.డి. క్లాసులకు తీసుకెళ్ళి తీసుకొచ్చేవాడు. బస్సుల్లో వెళ్ళింది తక్కువే. పుస్తకాలవసరం పడితే పుట్టింటికి

తీసుకొచ్చి తీసుకెళ్ళేవాడు. నేను ప్రైవేట్ కాలేజీలో ఉద్యోగం చేసేటప్పుడు చాలా సహాయంగా ఉన్నాడు.

ఒక స్త్రీ విద్యావంతురాలు కావాలంటే ఎంతో మంది సహాయమవసరమని అర్థమవుతుంది. ఇంతమంది యిన్నివిధాలుగా సహాయపడి తోడుగా నిలిస్తేనే నేనీ డిగ్రీ పొందగలిగానని నేననుకుంటున్నాను.

మా చిన్నారులు అమ్మాయి చిత్రలేఖ, అబ్బాయి ధరణీధర్. నా చదువు నిరవధికంగా సాగిందంటే మా పిల్లలు ఎంతో బుద్ధిమంతులని అనుకోక తప్పదు. నా చదువుకు ఎన్నడూ అడ్డురాలేదు. కాలేజికి వెళ్ళినా, పరీక్షలకు ప్రిపేర్ అయినా ఎటువంటి అల్లరి చేసేవారు కాదు.

థీసిస్ ఫెయిర్ చేసేటప్పుడు నా మేనల్లుండ్లు శ్రీకాంత్, శ్రీధర్, శ్రీనాథ్‌లు చాల సహాయం చేశారు. వారికి నా ఆశీస్సులు. మద్గురువర్యులు డా॥ శివునూరి విశ్వనాథ శర్మగారు తమ అమూల్యమైన ఆశీస్సులనందించి నన్ను దీవించారు. వారికి పాదాభివందనములు చేయుచున్నాను. బి.ఎ.(ఎల్), ఎమ్.ఎ.(ఎల్)లు వారి శిష్యరికంలోనే సాధించగలిగాను. వారిని నేనెప్పుడు మరువలేను. వారి ఆశీర్వాదములను నేనెప్పుడు కోరుకుంటున్నాను.

నన్ను తన సహోదరిగా ఆదరించి, వారి పర్యవేక్షణలోనే పిహెచ్.డి. పూర్తి చేయించిన మా పెద్దన్నయ్య లాంటి ఆచార్య గోపిసార్ గార్కి వినయ పూర్వక నమస్కారములు తెలియజేసుకుంటున్నాను. వారి ఆదరణ లేకుంటే బహుశా పిహెచ్.డి. ఇంత త్వరగా పూర్తయ్యేదికాదు. వారి ఆశీస్సులనెప్పుడు ఆశిస్తున్నాను.

నా పరిశోధనను అభినందించి, నన్ను ఆశీర్వదించి, శుభాకాంక్షలందించిన ఆచార్య ఎస్.వి. రామారావు గార్కి నాయొక్క నమస్కారములు.

పరిశోధన దర్పణములో చక్కని సమీకరణముతో నన్నాశీర్వదించిన డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి గారి సహృదయతకు నా నమస్సులు.

**కోఠి** ఉమెన్స్‌ను కోటి ఉషస్సులతో నింపిన ఘన యశస్విని, నిరంతర కష్టశీలి **ఆచార్య** పి. ప్రమదాదేవి గారందించిన అమూల్యమైన ఆశీస్సులకు నా కృతజ్ఞతా పూర్వకాభివాదములు.

అనేక పుస్తక రచనలను చేసి, వివిధ వ్యాసాలను రచించి అనేక రేడియో ప్రసంగాలను గావించిన, నిరంతర సాహిత్య కృషీవలురు తమ అమూల్యమైన

అభిరామమును అందించిన డా॥ అయాచితం నటేశ్వరశర్మ అన్నయ్య గారికి నా నమస్కారములు.

సంస్కృతాంధ్రాంగ్ల భాషావేత్తలు, విద్యాకులశేఖరులు ఆచార్య ఎం. కులశేఖర రావు గారు అందించిన మంగళాశాసనములను భక్తితో స్వీకరించి, సదా వారి ఆశీస్సులను ఆకాంక్షించుచు వారికి కృతజ్ఞతాభివాదములను తెలియజేసుకొను చున్నాను.

నా చదువులకు, పరిశోధనకు, హోదాకు ముఖ్యకారకులైన మా అన్నయ్య డా॥ ఎం. బాగన్నగారి పాదపద్మములకు శతకోటి నమస్కారములు. సదా నా యోగక్షేమములను నా అభివృద్ధినే కాంక్షించే అన్నయ్యకు సర్వదా కృతజ్ఞురాలను.

ఈ గ్రంథము అచ్చు రూపము ధరించుటకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము - తిరుపతి, అధికారులును సంపూర్ణ ఆర్థిక సహకారములు అందించినారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ముఖ్యముగా శ్రీ లంక రామకృష్ణగారు తిరుపతి వారికి ధన్యవాదములు. హైదరాబాదు తెలుగు విశ్వవిద్యాలయము వారు పాక్షికముగా ఆర్థిక సహాయము చేసినారు. వారికి నా కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను.

ఈ విధంగా నా ఉన్నతికి ప్రత్యక్షంగాను పరోక్షంగాను తోడ్పడిన మహామహులందరికి నా యొక్క నమస్కారములు.

మనోహరమైన శ్రీరామ మూర్తిని చిత్రించి పుస్తకమనే ఆకృతికి ముఖాలంకరణ చేసిన చిత్రకళా తపస్వి శ్రీ శీలావీర్రాజు గారికి నా అభివాదములు.

చక్కని ముద్రణతో చక్కని పుస్తకమును ముద్రించి యిచ్చిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ జగన్మోహన్‌రెడ్డి గారికిని కృతజ్ఞతలు.

విధేయురాలు

తేది : 20-9-1999 డా॥ ఎం. పద్మకుమారి

# ప్రథమ ప్రకరణము

# తెలుగులో రామాయణములు - సమీక్ష

తెలుగు సాహిత్యములో రామాయణ, భారత, భాగవతముల పేర్లు వినని వారుండరు. వాల్మీకి రామాయణము సంస్కృతము నందు రచింపబడి యుండుటచే పండిత శ్రేష్ఠులకే పరిమితమైనది. కాబట్టి పామర జనులకు, స్త్రీలకు, శిశువులకు రామాయణము కూలంకషముగా తెలియదు. అందుచే ఆనాటి సామాజిక, రాజకీయ పరిస్థితులను బట్టి రామాయణము వివిధ మార్పు చేర్పులకు లోనై భారత దేశమునందేకాక యితర దేశముల్లలోను ప్రచారము పొందినది. రామాయణమును పండిత పామర రంజకముగా రచించిన వారెందరో సామాన్య ప్రజలందరికీ చేరువైనారు. అటువంటి వారిలో గోన బుద్ధారెడ్డి ప్రప్రథములు. ఇతడు రంగనాథ రామాయణమును రచించి అందరి మన్ననలకు పాత్రులైనాడు. రామాయణమగుటచే వైష్ణవులకును, ద్విపదమైనందున శైవులకును సమానాదర యోగ్యమైనది. కర్తృత్వ విషయము నెందరో మహానుభావులు చర్చించి యుండుటచే దానిని విస్మరించుటకు సాహసించుచున్నాను. రంగనాథ రామాయణము తెలుగు రామాయణము లన్నింటికి మూలగ్రంథముగా తోచుచున్నది. తెలుగులో వెలువడిన రామాయణములలో కొన్నింటిని దిఙ్మాత్రముగా సూచింతును.

## వివిధ ప్రక్రియలలో రామాయణములు

1. రఘునాథ రామాయణము : కృష్ణ దేవరాయల తరువాత రఘునాథ నాయకుడు దక్షిణ భారత దేశమును క్రీ.శ. 1614 - 1633 వరకు పరిపాలించినాడు. సాహితీ భోజుడుగా కీర్తింపబడినాడు. రఘునాథ రాయని కాలములో ప్రఖ్యాత కవయిత్రి రామభద్రాంబ రఘునాథాభ్యుదయమును రచించిరి. ఇతడు కృతిభర్త, కృతి కర్త కూడ. సాహిత్య కళా పోషకుడు "శ్రీరామ చంద్ర సాంద్ర కరుణా కటాక్ష లబ్ధ సారస్వత విశేష నిరర్గళ వాగ్వైభవా శేష సాహిత్య పరుడు" గా పేరొందినాడు. ఇతని రామాయణములోని కొన్ని పంక్తులను పరిశీలింతము

"కోదండ దీక్షాది గురుడైన రాముఁ -
డేదైవమని యెంచు నెంచ డన్యులను
ఆ రఘునాథ నాయక శిరోమణి"[1]

అంతేగాక రామాయణానికి "రామో విగ్రహవాన్ ధర్మః" అనగా రూపొందిన ధర్మమే శ్రీరామ చంద్రుడని యర్థము. ఇట్టి శ్రీరాముని కథ యెవరి చేతికి చిక్కినను మనోహరముగా రూపుదిద్దుకున్నది.

ఉదా : 'కౌసల్యా సుతుఁడిచ్చు మానెపుడు ఁ- గల్యాణ సాకల్యమున్"

అని వాల్మీకి రామాయణములోని కథా మాతృకను గ్రహించి, స్వతంత్రముగాను, సర్వోత్తమముగాను కావ్య సృష్ట చేసినారు.

2. శ్రీరామాయణము : ఇది కట్టా వరద రాజు రచించిన రామాయణము. ఇతడు కరికాళ చోళుని వంశమున జన్మించెను. వీరి వంశము మూలపురుషుడు కరికాళుడు. కావేరికి కట్ట కట్టించుటచే వీరు 'కట్టా' వారుగా వ్యవహరింపబడినారట. ఇతని కాలమును క్రీ.శ. 1630 అనియు, కొందరు క్రీ.శ. 1650 అనియు భావించుట గలదు. మొత్తము మీద క్రీ.శ. 17వ శతాబ్దికి చెందిన వాడుగా భావింపవచ్చును. ఇతని రామాయణము యథా వాల్మీకము, స్వతంత్రము, మనోహరమునునైన ద్విపద రచన.

ఈ రామాయణము నందు రావణుని తల్లి కేకసిని ధర్మానువర్తినిగా చిత్రీకరింపబడినది. రావణుని కోడలు సులోచన పతిభక్తి పరాయణురాలు. రావణుని భార్య మండోదరి పరమ పతివ్రత. వీర వనిత. కుంభ కర్ణుడు రామ భక్తుడు. రావణుడు అపార శైవభక్తి పరాయణుడు. అసుర ప్రవృత్తి తోడి సరి సమానమైన దైవభక్తి గలవాడు. తనకు శత్రువైనను శ్రీరాముని పరాక్రమమును మెచ్చుకొన్న వీరుడు.

3. ఉత్తర రామాయణము : ఇది కాచ భూపతి, విఠ్ఠల రాజులను సోదర కవులచే రచింపబడిన ద్విపద రామాయణము, వీరు గోనబుద్ధారెడ్డి పుత్రులు. కాలము 13వ శతాబ్దము. తండ్రి ఆజ్ఞ మేరకు ఉత్తర రామాయణమును రచించినారు. ఇందలి అవాల్మీకాంశములను డా॥ టి. సుశీల గారు పేర్కొనినారు.

---

1. తంజావూరు తెలుగు కవులు - పుట 36

4. ఏకోజీ రామాయణము : తుక్కోజీ తనయుడైన రెండవ ఏకోజీ ఇతడు. ఒక సం॥ కాలము తంజావూరు పాలించెను. ఇతనికి 'బాబా సాహెబు' అని నామాంతరము కలదు. తెలుగు భాష ప్రక్రియలో రామాయణము నాలు కాండములుగా క్రీ.శ. 1737లో రచించినాడు. ఇది రంగనాథ రామాయణమును, మరాఠి రామాయణములనను సరించి వ్రాయబడినది. ఇదియే కాక 'విఘ్నేశ్వర కళ్యాణము' అను యక్షగానమును కూడ రచించి వాసి గాంచెను.

5. శతకంఠ రామాయణము : ఇది ద్విపద రామాయణము. ఇందు డెబ్బది పత్రములు కలవు. అసమగ్రము, కవి, వంశాది విశేషములు లేవు. ప్రారంభమున నిట్లున్నది.

"శ్రీమహితానంద శృంగార కరము - కామితార్థంబులు కడు మోదమ మరి అలమేరు కాంతులు నబ్బుల నడుమ - వెలయుశాక ద్వీప వేదికా స్థలిని" అని యున్నది. శైలి సరళముగా నున్నది.[1]

6. చేడ రాఘవ రెడ్డి రామాయణము : చేడ రాఘవ రెడ్డి (క్రీ.శ. 1780) ఇది శిథిల ప్రతి. హనుమకొండలోను లభ్యమగుట లేదు. [2]

7. తాళ్ళపాక అన్నమాచార్యుల రామాయణము : దీనిని తాళ్ళపాక అన్నమాచార్యులు రచించినట్లు తాళ్ళపాక చిన్నన్న 'అన్నమాచార్య చరిత్ర' యందు తెల్పియున్నాడు.

'ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున నవయుగ' అని చిన్నన్న వ్రాసి యున్నాడు.

8. బాల రామాయణము : దీనిని గణపవరపు వేంకట కవి రచించెను. ఇతడు క్రీ.శ. 1630 - 1680 కాలమునకు చెందినవాడు. ఈ గ్రంథమలభ్యము [3]

9. మైరావణ చరిత్ర : దీనిని కాచన రచించెను. ఇది మంజీర ద్విపద రచన, ప్రాసయతులధికముగా గలవు. ఈ గ్రంథము టి. ఎస్. ఎస్. ఎమ్. ఎల్. నందున్నది.

---

1. ఆంధ్ర సాహిత్య పరిషత్తు - కాకినాడ గ్రం. నెం. 20
2. ప్రాచ్య పుస్తక భాండాగారము - చెన్నపురి - భారతి - 1963
3. అన్నమాచార్య చరిత్ర - తాళ్ళపాక చిన్నన్న - పుట 847

ఇందు రామాయణ కథయే యున్నది. మైరావణుడు రామలక్ష్మణులను గొని పోవునపుడు, హనుమంతుడు వగచుచుండగా అంగదాదులు ఆంజనేయునకు ధైర్యము చెప్పిన సందర్భమున గల ద్విపద పాద శైలియెన్న దగినదిగా నున్నది.

"ఏల వగతువయ్య యితరుని భంగి - వగచుట కార్యమే వాయు తనూజ
నీవిట్లు వగచిన నిందెవ్వరైన - దలపోసి చూచిన .దక్కులున్నారె?"[1] అని ధైర్యవచనములు పల్కినట్లు చెప్పబడినది.

10. మైరావణ చరిత్ర : ఇది అముద్రితము. దీనిని పోలుమంచి బసవన కవి రచించినాడు. తల్లి జన్నమ్మ, తండ్రి మల్లమంత్రి ఈ రామాయణము నందు కవి తనను గూర్చి తనే పేర్కొన్న ద్విపద పాదములు.

"వారి పుత్రుడ బసవనను పుంభావ - శారద నిపుణుడ సత్కవీశ్వరుల
పాదాబ్జ భృంగమై పరిగిన వాడ - మోదాన రఘుకుల ముఖ్యమైనట్టి
శ్రీరామ విభునికి కృతి నంకితముగ - మైరావణ చరిత్ర మహిమ జెప్పెదను"[2]

ఈ కవి క్రీ.శ. 1740 వాడగును. ఇతని పేర గల నింకొక ప్రతిలో గ్రంథముల నెం. 896, 1590లలో తాళ్ళపాక వారే వ్రాసిరేమోనని యున్నది.

11. శ్రీరామ చరిత మానసము : ఇది తులసీదాసు రచించిన హిందీ భాషాంతర్గత మయిన కథ. తెలుగు నందు మంజరీ ద్విపదలో కేశవ తీర్థ స్వామి రచించెను. శ్రీరామ కథను శివుడు పార్వతికి ఉపదేశించినట్లు గలదు. చక్కని శైలి గల్గిన గ్రంథము.

12. పరశు రామాయణము : ఇది మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో డి.నెం. 1111. కాగితపు ప్రతిలో నున్నది. కవి ఉలిచి భావజ్ఞుడు. ఇందలి కథ పరశు రాముడు కార్తవీర్యుని ఓడించుట శ్రీరాముడు పరశురాముని విల్లును విరుచుట, పరశురాముడు శ్రీరాముని పొగడుటయు గలదు. గాన యోగ్యమై యున్నది. అసమగ్రము. అముద్రితము.

---

1. ద్విపద రామాయణ భారతి - జె.వి. సుబ్బారాయుడు - 1981 పుట 208
2. ఆంధ్ర సాహిత్య పరిషత్ - గ్ర. నెం. 2610

13. భాస్కర రామాయణము : హుళక్కిభాస్కరుడు, మల్లికార్జునుడు, కుమార రుద్ర దేవుడు రచించిరి. క్రీ.శ. 14వ శతాబ్ది. గ్రంథ రచన వాల్మీకమనుసరించియే గలదు.

14. ఎఱ్ఱన రామాయణము : ఎఱ్ఱాప్రెగ్గడ (క్రీ.శ. 1280 - 1364) రచించెను. సర్వలక్షణ సారము నందు 91 పద్యములు కన్పించుచున్నవి. నేడు అలభ్యము.

15. రామాయణము : కొరవి సత్యనారాయణ క్రీ.శ. 1320 - 1345లో తెలుగు పద్య కావ్యముగా రచించినట్లు గలదు. ఈ విషయమును కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక (1-49)లో తెల్పినారు. ఇతనికి 'ఆంధ్ర కవితా పితామహుడ'ను బిరుదు కూడ గలదు. అలభ్య గ్రంథము.

16. అచ్చ తెనుగు రామాయణము : కూచిమంచి తిమ్మకవి రచించినాడు. కాలము క్రీ.శ. 18వ శతాబ్దము. 'కవి సార్వభౌమ' బిరుదాంకితుడు.

17. దశరథరాజనందన చరిత్ర : ఇది మొట్టమొదటి నిరోష్ఠ్య రామాయణము. దీని కర్త మరింగంటి సింగరాచార్యులు. కాలము క్రీ.శ. 18వ శతాబ్దము.

18. శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము : కవి వావిల కొలను సుబ్బారావు. కాలము క్రీ.శ. 1863 - 1939. యథా వాల్మీకానువాదము సులభ శైలి.

19. మొల్ల రామాయణము : కవయిత్రి మొల్ల కాలము క్రీ.శ. 16వ శతాబ్ది. మృదు మధురమైన శైలి. రమ్యమైన స్త్రీ - పురుష పాత్రల పోషణ కల్గివున్న సంగ్రహ రచన.

20. రామాభ్యుదయము : అయ్యల రాజు రామభద్రుడు రచించినాడు.

21. గోపీనాథ రామాయణము : కర్త గోపీనాథకవి. ఇతని కాలము క్రీ.శ. 1820 - 1870.

22. శ్రీ కృష్ణ రామాయణము : దీని కర్త శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. కాలము క్రీ.శ. 1866 - 1960.

23. రామాయణము : దీనిని జనమంచి శేషాద్రి శర్మ రచించెను. కాలము క్రీ.శ. 1882 - 1950.

24. రామాయణము : శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు రచించిన గ్రంథము. అసంపూర్ణము.

25. శ్రీమద్రామాయణ కల్ప వృక్షము : దీనిని విశ్వనాథ సత్యనారాయణ గారు రచించినారు. ఈ గ్రంథమునకే జ్ఞానపీఠ అవార్డు వచ్చినది. ఇతనికి 'కవి సామ్రాట్' అను బిరుదు కలదు.

26. నిర్వచనోత్తర రామాయణము : దీనిని తిక్కన రచించెను. కాలము క్రీ.శ. 1260. ఇది ప్రథమాంధ్రోత్తర రామాయణము. స్వయం సంపూర్ణ రామాయణము.

27. ఉత్తర రామాయణము : కంకంటి పాపరాజు రచన కాలము క్రీ.శ. 1575 - 1632 ఇందులో ఉత్తర కాండ కథ కలదు.

28. నిర్వచనోత్తర రామాయణము : తిక్కన విడిచి పెట్టిన భాగమును గ్రహించి జయంతి రామభట్టు పూర్తి చేసెను. ఏకాశ్వాస గ్రంథము.

29. అధ్యాత్మ రామాయణము : దీనిని సంస్కృతములో విశ్వామిత్రుడు రచింపగా తెలుగులో అనేక మంది రచించినారు. దీనిని పద్య కావ్యముగా రచించినవారిలో కొందరు

1. కాణాద పెద్దన సోమయాజి - క్రీ.శ. 1725 - 1800

2. కోటం రాజు నాగయామాత్యుడు - క్రీ.శ. 1860

3. కంచర్ల శరభ కవి.

4. మోతుకూచి పండరి నాథకవి

5. అల్లమ రాజు రామకృష్ణ కవి.

6. ముడుంబై వేంకట కృష్ణమాచార్యులు

7. పరశురామపంతుల రామమూర్తి

8. రూపక శ్రీరామ కవి.

---

**ఆంధ్ర వాఙ్మయము - రామాయణములు - డా॥ కె. మలయవాసిని గారి గ్రంథము ఆధారము. పుట. 8 నుండి 20 వరకు**

30. అధ్యాత్మ రామాయణమును ద్విపదలో రచించిన వారు మామిడమ్మ సుభద్రమ్మ కాలము క్రీ.శ. 1900. ఇది బహుళ ప్రచారము పొందిన రచన.

31. అధ్యాత్మ రామాయణము : కవి కాళహస్తి సుబ్రహ్మణ్యకవి. ఆరు కాండములను కీర్తన రూపములో వ్రాసి యున్నారు.

32. జ్ఞాన వాసిష్ఠ రామాయణము : సంస్కృతములో వాల్మీకి రచించినట్లు చెప్పుదురు. వేదాంత ప్రతిపాదకము, తత్త్వ బోధక గ్రంథము. విశ్వామిత్రుని కోరికపై వశిష్ఠుడు శ్రీరామునకు తత్త్వ బోధ చేసినట్లు చెప్పబడినది. దీనిని యోగ వాసిష్ఠము, జ్ఞాన వాసిష్ఠము, వసిష్ఠ శ్రీరామచంద్ర సంవాదము అనియు వ్యవహారము గలదు.

33. జ్ఞాన వాసిష్ఠ రామాయణము : మడికి సింగన రచియించెను.

34. వసిష్ఠ రామాయణము : తరిగొండ వెంగమాంబ క్రీ.శ. 1840 నందు ద్విపద కావ్యముగా రచించినది. జ్ఞాన వాసిష్ఠము ననుసరించి వ్రాసిన గ్రంథము. ఇవిగాక రామాయణమని పేరు లేకుండా రామాయణ సంబంధ గ్రంథములసంఖ్యాకముగ వెలువడినవి.

**ద్విపద రామాయణములు :**

1. రంగనాథ రామాయణం : ఇది తెలుగు రామాయణములన్నింటిలోను మొదటి గ్రంథము.

2. శ్రీరామాయణం : దీనిని కట్టా వరదరాజు రచించెను. ఇది ద్విపద వాఙ్మయ శాఖా పరిణామవికాసమునకు మచ్చు తునక. ప్రత్యేక విశిష్టతను ఆపాదించుకొన్న గ్రంథము. ద్విపదకవులలో నితడు ధీటైన వాడు. కవికి కలలో వేంకటేశ్వరుడు కన్పించి తన పేర రామాయణము రచింపుమనగా, యథా వాల్మీకముగా ద్విపదలో వ్రాయుమని నిర్దేశించినట్లు చెప్పుకొన్నాడు.

> "ద్విపద గావింపుము తేట తెల్లముగ - నిపుణత శ్రీరాముని కథా క్రమంబు
> వాలాయమిది యథా వాల్మీకముగను - ........................................"

యథా వాల్మీకము నందును కొన్ని అవాల్మీకాంశములున్నవి. దశరధుడు తన ముగ్గురు భార్యలకిచ్చిన పాయస పాత్రను పళ్ళెరముగ మార్చెను.

'చట్టును వెండి యంచుల మర్చు పసిడి - మిట్ట పళ్ళెరమున మెఱయు పాయసము'
(బాలకాండ - 1665 - 1666)

పళ్ళెరమునకు సుమిత్ర చేయి చాపినట్లుగల పాదము -

"చేయి చాపంగ నిచ్చెను సుమిత్రకును" (బాలకాండ - 1630)

శ్రీ రామాయణమున వరదరాజు మేలుకొలుపు పాటపాడినాడు. అనాడు ఈ మేలుకొలుపులు, పవళింపు సేవలు బహుళ ప్రచారములో నున్నవి.

**పవళింపు - జోలపాట**

" ..............................పవళింపు డబ్జ - నయనముల్ ముగిడించి నా సమీపమున
చూడు మల్లపుడె పక్షులు గూళ్ళు చేరె - నీడద్రుమంబుల నిద్రింపవయ్య !
కొమ్మలు వ్రేల నాకులు మణిగించె - నెమ్మియై దరువులు నిదురింపవయ్య !
.....................................- పావన రఘురామ ! బడలికల్దీర
నీవును తమ్ముండు నిదురింపరయ్య ! - అని జోల పాడి నిదురింప జేసిన ధన్యజీవి వరదరాజు.

సీతాకల్యాణ సమయమున కవి పేర్కొనిన విధానము మనోహరముగా నున్నది. మధుపర్క మొసగుట, కన్యాదానము, సూత్ర ధారణము, తలంబ్రాలు, నాగవెల్లి, వసంతము, సీతకు సారెలు కూడా పెట్టించినవాడు కట్టా వరదరాజు.

దశరథుని కోప విషయమున వరదరాజు కైకను నిందింప చేసిన ఘట్టము.

'సుందరి ! యొక రాక్షసుండు మీ తల్లి - బొందునప్పుడు నీవు బుట్టితివిగాన
నిజము కైకయ విభునికి బుట్టనీవు - ..............................' (అయోధ్య 1517 - 1519)

అరణ్యవాస సమయమున 'మీతో నేను వచ్చెదను. నాకు అనుమతించుమని అన్నకు చెప్పమని' వదినెతో లక్ష్మణుడు పల్కినాడు. "నను బ్రోవమని చెప్పమ్మా జననీ జానకమ్మా" అని కంచర్ల గోపన్న శైలిని తలపింపచేసినాడు. సీత అరణ్యవాసమున నుండగా "ఒకసారి అయోధ్యను చూసి వత్తమని" కోరినది. ఇచట స్త్రీ హృదయము వర్ణితము.

"మనవారి నింకొక్క మఱి చూడనాకు - మనసయ్యె పురికేగి మఱలుద మిటకు"
(అరణ్య - 4934 - 4935)

యుద్ధ రంగమున నారదాగమనము, శ్రీ రంగశాయి పూజలు అవాల్మీకములు. ఇవి వరదరాజు ప్రతిభకు తార్కాణములుగా నిలిచినాయి. తెలుగు నుడికార ప్రతిభను పరిశీలింతము.

"నిద్దురమాని కంటికి తెప్పగాను - పొద్దున రేయును పగలు నేమరక
................................ - కట్టిన ధట్టిలు కట్టినయట్లు"(బాల - 2575 - 2580)

3. ఏకోజీ రామాయణము : దీనిని ముందుగానే వివరించితిని.

4. గోపీనాథ రామాయణము : కాలనేమిని హనుమంతుడు చంపుట మూలము నందు లేదు. హనుమంతుడు సంజీవనికై పోయినపుడు దప్పిక తీర్చుకొనుటకై సరస్సులో చేతులు ముంచిన సందర్భములో మొసలి బాధించుట, దానిని చంపగా అది అప్సరసగా మారుట ఏ రామాయణములోను లేదు. మండోదరి రావణునకు సీతను శ్రీరాముని చెంతకు చేర్చుమని హితబోధ చేసినది. ఆ మాటలు నిత్య సత్యములు.

క॥ చిచ్చొడి గట్టిన వానికి
వచ్చునె మేలకట రాజవర్యుని దేవిం
దెచ్చిన యప్పుడె నీవని
జచ్చితివని దలచితిని నిశాచరనాథా! - అని పల్కినది.

(యుద్ధ 2571 - 2772)

5. యధాశ్లోక తాత్పర్య నిరూపణ రామాయణము : 'కవిషష్ఠము' చే రచింపబడినది. ఇది గద్వాల సంస్థానాధీశుడు సోమ భూపాలుని ఆస్థానములోని ఆరుగురు కవులచే రచింపబడినది. మొదటి నాలుగు కాండములు ఒక సంపుటముగను చివరి రెండు కాండలు రెండవ సంపుటముగను గలవు. ఉత్తర కాండము లేదు. అర్థ తాత్పర్య సహితముగా వ్రాయబడినది. అనువాద కావ్యము.

6. ఆంధ్ర వాల్మీకి రామాయణము : దీనిని వావిల కొలను సుబ్బారావు రచించెను. 'మానిషాద' శ్లోకమునకు రెండర్థములను చెప్పినారు.

బోయపరముగ : తెలియుమా + నిషాదుండ + ప్రతిష్ఠ + నీకున్ + అప్రాప్తంబగు అను పదవిరుపు. అవతారపరముగ : తెలియు + మానిషాదుండ + ప్రతిష్ఠ + నీక + ప్రాప్తంబగు అని మరొక పదవిరుపు. 'మానిషాదుండ' అనగా శ్రీనివాసుడనియు, 'ప్రతిష్ఠ నీక ప్రాప్తంబగు' అనుటలో కీర్తి ప్రతిష్ఠ నీకే ప్రాప్తించుననియు అర్థము వచ్చినది. ఆంధ్రీకరణములో రెండర్థములు వచ్చు రామాయణము లెవ్వరును వ్రాయలేదు.

7. ఆంధ్ర శ్రీ రామాయణము : దీనిని జనమంచి శేషాద్రి శర్మ రచించెను. యధా వాల్మీకముగ పదవిరుపులతో కూడిన పద్యార్థములున్నవి.

8. సంగ్రహ రామాయణము : చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారు సంగ్రహముగా రచించినారు. యుద్ధ కాండము వరకు కలదు.

మ॥ ఇదియే జానకియైన పక్షమున హా! యీదైత్యునంతఃపురిన్
నిదురంబోవునె, యన్నముందినునె, పానీయంబులంద్రావునే,
సదలంకారములం ధరించునె, మెయిన్ [illegible]ములంగోరునే,
మది శ్రీరాముని బాసి, యీతలపున[illegible]భావంబు నన్గప్పుదే

(సుందర కాం[illegible])

9. శ్రీ కృష్ణ రామాయణము : దీనిని [illegible] శాస్త్రి రచించెను. (1948 వేంకట్రామ అండ్ కో [illegible]రించింది)ఇందు అవతార ఘట్టములు కలవు. సీత [illegible] పట్ల పుత్ర వాత్సల్యమును చూపినట్లు గలదు. రావణుడు తన పూర్వ జన్మల నెరిగినవాడై జన్మ సాయుజ్యము[illegible] కాంక్షించినట్లు తెలిపిన పద్యములు రెండు గలవు.

తే॥ ఎన్ని యెన్నియొ వారము లేగు[illegible]చె
బెదరు వడునట్టు లేవియో వదరు గాని
యొక్కనాడును దుష్టత్వమొంది కాని
పనికి జతనింపడయ్యె నీ పక్షిగళుడు

క॥ నను మాతృ భావముంగొని
కనుగొనెనే కాని తప్పుగతి కేనాడున్
మనముం జేసి యెఱంగడు
ఘనుడాతండందుగాని ఖలుడన నయ్యేన్

(ఉత్తరకాండ - ప్ర. ఆ. పుట. 394 - 395)

రావణుడు సీతపైని గల మాతృభావనను మండోదరికి చెప్పిన తీరు గమనింతము.

మ॥ చెఱబట్టెం జనకాత్మజాతనని కొంచెంబేనియుంగానకి
త్రైఅగుల్ పల్కుచునుంద్రు లోకు లెదనింతే దోష మూహింపనే
నెఱగంజాలుదు నన్నుఁగన్న తల్లియై యే వేళ నే బిడ్డ నై
యెఱగం బోవుదు గాని యొండు గతిగా నే బో నెఱంగజుమీ!

క॥ ఎఱిగియె చేసితి నింతము
నెఱుగదు జనకాత్మజాత సుందిర యనినే
నెఱుగుదు రాముడు హరియని
యెఱుగదు నా చావు నిక్కమేయని గరితా !(యుద్ధ - తృ - 311)

రామాయణ కవులు ధర్మహాని కలిగింపని మహానుభావులు. సీతపై దుష్ట చేయి పడినచో ధర్మము నేల గూలుననియు, లోకము కల్లోలమగునని తెలిసిన ఆత్మ జ్ఞానులు. కవి సార్వభౌముల మదిలోని భావాలు కూడ ఆత్మజ్ఞానము కలిగించే అమృత తుల్యములు. సీత కొఱకే రావణుని పాత్రనిట్లు చిత్రీకరించినే కవిసార్వభౌముని విశాల దృష్టిని, విజ్ఞాన దృష్టిని ప్రపంచము ప్రశంసించి తీరును.

చ॥ సనక సనందనాది ముని చంద్రుల శాపము కారణంబుగా
వనట బడంగనై యిటసుపర్వ తపోవన పర్వ జన్మమున్
గొననయి క్రూర భావమునకుం గుదురై త్రిజగజ్జనైహ్యామై
కనదగు వర్తనిన్ మెలగగానయి యుండివిధి ప్రసంగతన్

క॥ హరివరము కలదు వైర
స్ఫురణంబున మూడు జన్మములు చనునంతన్
దొరకును సాయుజ్యంబని
చిరకాలంబయ్యె నెట్లు చేయగ నగునో (బా - తృ - ఆ - 138)

ఆ॥హరికి వేడి పుట్టినట్టి కార్యంబులు
చేసి కినుక వెంచి శీఘ్రకాల
మంద చావు కొఱకు మందు సంపాదించి
విడిచి పెట్ట వలయు నొడలు వడిగ (బా - తృ - ఆ - 139)

రావణుడు ముక్తిని గోరి, రఘువంశమున జన్మించిన రాముని చేతిలో మరణము గలదని గ్రహించుట పూర్వ జ్ఞానము. అట్టి విషయమును కవి యిచట గ్రహింపచేసెను. రావణుని గుణ శీలములను తెల్పిన తీరు : సీతాదేవి పలికిన వచనముల వలన రావణుని చరిత్ర స్పష్టమగును. సీత రావణుని పట్ల పుత్ర భావము తెలియపర్చిన సందర్భము.

సీ॥" ఋషి వేషమున వచ్చియే మూర్ఛమునిగెన్
తఱి నన్ను ముట్టక ధరఁబెకల్చి
కొనిపోయె నొదల గొనె గాని దారిలో
నే యింత తప్పును జేయడయ్యె
దన యింటిలోఁ బెట్టుకొనిన దప్పగునని
యుపవనంబున యందు నునిచిమనిచె"

ప్రాచీన సాహితీ గౌరవమును కాపాడిన ఘనత శ్రీపాద కృష్ణమూర్తి గారికే దక్కినది. సీతాదేవి సౌందర్యమును వర్ణించు నపుడు

తే॥"జానుగుల శ్రీల్ పిఱుందల దానడుమన
ళానుదుట గ్రార పొక్కిటిలోన బొట్టు
ఘ్రాణమున, నొత్తు కేలదీర్ఘముల దోప
రమణి బుధు లెంత్తురక్షర బ్రహ్మమనుచు"

10. శ్రీమత్ రామాయణ కల్పవృక్షము : సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు రచించిరి. గొప్ప సాహితీ విలువలు కలిగివున్న ఉద్గ్రంథము.

"అచ్చమైన యమృతమమరులు త్రావినా
రోయి ! దానికే నసూయ పడను
పరమ మౌనియైన వల్మీకి కృత రామ
సత్కథా సుధారసంబుఁదావి"

అని రామాయణ రచన భాగ్యమును అమృతముతో పోల్చి అమరులైనారు.

"కవి ప్రతిభలోన నుండును । గావ్యగతశ
తాంశముల యందు దొంబది యైన పాళ్లు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథా ధృతిని మించి"

కావ్యగత శతాంశముల యందు తొంబది పాళ్ళుండునని నిరూపించినారు. శాంత, కైక కథలందు క్రొత్తదనమును నింపినారు. రాముని కీర్తికి కైకనే కారణమని చెప్పినారు.

11. మానికొండ రామాయణము : మానికొండ సత్యనారాయణ రచించినారు. ఇతడు 1921 - 43 కాలము నందు జైలు జీవితమును అనుభవిస్తున్న సమయమునందు రామాయణమును రచించినాడు. ఛందో వ్యాకరణాదులను తుంగలో ద్రొక్కి చేసిన రచన. బాష, భావములతో నిండి దేశీయ ఛ్ఛందములోని ఆటవెలది, తేటగీతి, ద్విపదల యందు సాగిన యీ రచన వాల్మీకి ననుసరించినది కాదు, అనుసరణము కాదు.

12. గోవింద రామాయణము : ఆత్మకూరి గోవిందాచార్యులు ఉత్తర కాండముతో కలిపి వ్రాసిరి. ఈ రామాయణము నందలి కథా వస్తువు, వస్తు పరిపాకము, సూటి గీతి కవిత, కథా పరమార్థమునకు, తొడిమవలె యున్నదని వేటూరి ప్రభాకరశాస్త్రి గారి అభిప్రాయము.

ఉత్తరకాండము తరువాత బాలకాండము వ్రాసినారు.

"జానకిని రాఘవుడు వీడు పరిచినాడు - భక్త తతికంట తడిపెట్ట వ్రాసినాడు
జానకి రాఘవుడ గూడ చరిత నేడు - భక్తితతి సంతసింపంగ వ్రాయువాడ"

వినూత్న భావన, హృదయ స్పందన కల్గిన పద్యములను వ్రాసిరి. ఈ రామాయణములోని ఆశ్వాసములు లీలాకృపాశ్వాసము, అవతారాశ్వాసము, శరణాగతాశ్వాసములుగా నున్నవి.

13. శ్రీమద్యోగానందాంధ్ర రామాయణము : కర్త యోగానందకవి. ఆరు కాండములుగా రచించెను. ఇతనికి కొక్కొండ వేంకట రత్నము గారు 'నూతన పోతన' అని బిరుదు నిచ్చినారు. సీతారాముల, హనుమంతుల వారి సంభాషణలు చెప్పుట కంటె స్వయముగా చదివి ఆనందింపదగినవి. నాటక శైలిలోను, తెలుగు నుడికారముతోను సాగిన రచన. యథా వాల్మీకమైన స్వతంత్ర భావములు వెలిబుచ్చినారు.

తోకకు చుట్టిన కోకలను యెత్తుడని చెప్పిన సందర్భమున హనుమంతుని మనోభావన గమనింతము.

ఆ.వె. సీత కట్టుకొన్న చేలంబునుందెచ్చి
చుట్టబెట్టుదమని చూచునంత
నంతరంగమందు హనుమంతుడూహించి
సంగ్రహంబొనర్చె సరగ దోక

14. జగన్నాథ రామాయణము : కర్త తంగిరాల జగన్నాధుడు, ఇది ఆనంద, ఆశ్చర్య, బోధాయన, భరద్వాజ, అధ్యాత్మ, అగస్త్యాది రామాయణములలోని కథను గ్రహించి వ్రాసిన రామాయణము.

15. సీతారామాయణము : కర్త తూము సీతారామదాసు. ఇతడు భద్రాచల నివాసి. గణాంకాధికారిగా పనిచేసి విశ్రాంతుడైన తరువాత ఈ గ్రంథమును రచించెను. ఉత్తరకాండ కూడ గలదు.

" వక్రగతిని బొంది వర్ధిలు మాత్రాన
చెఱకు మాధుర్యంబు తఱిగి పోదె" - అని చెప్పియున్నారు. మండోదరి తన భర్తకు చావు నిక్కమని చెప్పిన విధమును పరిశీలింతము.

తే॥ ``సంగరంబున నీకింకఁజావు నిజము
నాకు నీ తోడనను గమనంబు సేయ
రాదు ముదిమియు మరణంబు లేదటంచు
మున్ను వరమిచ్చె మా తండ్రి ముని విరోధి'' (యుద్ధ - 0593)

పీఠిక యందు ఆంజనేయున్ని స్తుతించిన పద్యము

సీ॥ రామనామాంకిత రత్న ముద్రికనిచ్చి
జనకజ ప్రాణ మేఘనుడు నిలిపె
మైథిలి వరశిరోమణి మర్పించి
కడిమి నెవ్వాడ రాఘవుని బ్రోచె
బ్రతికించెనెవ్వాడు పరమ దివ్యౌషధీ
దానంబుచే సుమిత్రాతనూజా
బూని యెవ్వాడ రాముని రాక యెఱిగించి
భరత శత్రఘ్నుల బ్రతుక జేసె''

``సమరమున మూర్ఛ నొందిన సకల కపుల
బ్రాణంబు లొసంగియే మహాబలుడు మనిచె
నట్టి పరమోపకారి జితాఖిలారి
నద్భుత విహారి సామీరి నభినుతింతు''

ఈ రామాయణమునందలి వర్ణనలు సహజ సుందరముగా గలవు.

## వచన రామాయణములు :

రాజులు ఏదైన విశేషావసరమున భూములను, గ్రామములను దానము చేసి, ఆ విషయమును ప్రకటించుటకై, శిలా, తామ్ర శాసనములను వ్రాయించుచుండిరి. ఈ శాసనములందు దానమిచ్చిన వాని గురించి, ప్రతి గ్రహీతను గురించి, దాన వస్తువును గురించిన విశేషములు కన్పించును. రేనాటి చోళులు, చాళుక్యులు, వైదుంబులు, బాణరాజులు, తమ శాసనములను తెలుగు భాషలో రచించుటను బట్టి ఆనాటి

విశేషములు భాషా పరిస్థితులు తెలియుచున్నవి. క్రీ.శ. 6,7 శతాబ్దములలోని రేనాటి చోళులు శాసనములన్ని కేవలము తెలుగు వచనములుగానే యున్నవి.[1]

అంతేగాక పద్య కావ్యములు చదువుటకు, పాడుటకు కష్టతరమైనందున వచన వాఙ్మయము బయలు దేరినది. ఇది దేశీయ వాఙ్మయము. ఈ వరుసలో చేరినవే. వచన రామాయణములు. రాముని నామ స్మరణచే ముక్తిని కోరు కవులు, రాజులు. సులభతరమైన వచన రామాణములను అధికముగా వ్రాయసాగిరి. ఇట్లు వచన రామాయణములను వ్రాసిన వారిలో కొందరు

1. తుపాకుల అనంత భూపాలుడు, 2. శ్యామ రాయకవి, 3. సింగరాజు దత్తాత్రేయుడు, 4. గోపీనాథ కవి విచిత్ర రామాయణము (ఇది ఓఢ్ర భాషనందు కలదు), 5. సిద్ధేశ్వర కవి రచించిన విచిత్ర రామాయణము అనువాద గ్రంథము, 6. పైడిపాటి రామయ్య : రంగనాథ రామాయణమును వచనముగా ఆంధ్రీకరించెను. 7. శ్రీనివాస శిరోమణి వచన రామాయణమును శిష్ట వ్యావహారికము నందు రచించినారు. 8. దీపాల పిచ్చయ్యశాస్త్రి : శ్రీరాముల వనవాసమును వ్రాసినారు. 9. మామిడిపూడి రామకృష్ణయ్య - శ్రీ మద్వాల్మీకి రామాయణ కథామృతము. 10. నూతలపాటి పేరరాజు: ఆనంద తులసి రామాయణమును రచించిరి. 11. ముంగర శంకర రాజు : రామ చరితమానస్ తెలుగు నందు రచించిరి. 12. దొడ్డ వేంకట రామరెడ్డి : దొడ్డ రామాయణమును రచించిరి. ఇవి వచన రచనలో రామకథా వస్తుకములగు కావ్యములు.

రామాయణ భారత కావ్యములు వచనమున రచించిన తరువాత పామర జనులు పఠించి గ్రహించుటకు సులభతరమైనవి. ప్రాచీనుల అభిప్రాయము ప్రకారము వచన కావ్యమునకు ముందుగానే పద్య కావ్యములు వెలువడినవి. ఈ అభిప్రాయమునే రోమీయ గ్రంథకర్త 'సెవికా' (క్రీ.పూ. 61 నుండి 30 వరకు) ఇట్లు చెప్పినాడు. వచనములో చెప్పిన జనులు ఎక్కువ జాగ్రత్తతో వినరు కనుక పద్యములో నాకట్టుకొనిరి. 1. పద్యములలో సంధానము కొరకు వచనములను (గద్యములను) రచించిరి. అవి భారత, రామాయణములలో ప్రవేశించినవి, క్రీ.శ. 6,7 శతాబ్దములలో రేనాటి చోళుల

---

1. ఆంధ్ర వచన వాఙ్మయము - ఉత్పత్తి వికాసములు - పుట 29. ఆచార్య యం. కులశేఖరరావు

శాసనములలో వచనమే యున్నది. 2. శ్రీ కృష్ణమాచార్యులు సింహగిరి వచనములు. తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు శ్రీ వేంకటేశ్వర వచనములు వ్రాసిరి. వచన రూపముననే విన్నపములు, శఠకోప విన్నపములు వెలువడినవి. శఠకోప విన్నపములకు మూలము ద్రావిడము కావచ్చును. భవానీ మనోహర వచనములు, వచన చరిత్రల ప్రతాప చరిత్ర, సిద్ధేశ్వర చరిత్రము, రాయ వాచకములు వెలసినవి. ఇక క్షేత్ర మాహాత్మ్యములలో శ్రీరంగ మహాత్మ్యము, వైశాఖ మాహాత్మ్యము, ధేను మాహాత్మ్యము, హాలాస్య మాహాత్మ్యము. కాశీ మహిమార్థ దర్పణము, గజారణ్య మాహాత్మ్యము, వేంకటాచల మాహాత్మ్యములు వచ్చినవి.

## భారత సంబంధములు

సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు జైమిని భారతమును వచన కావ్యముగనే రచించెను. ఇది విజయ రంగ చొక్కనాథుని కాలమున (క్రీ.శ. 1704 - 31 మధ్య కాలమున) దక్షిణాంధ్ర దేశమున వెలువడిన ప్రముఖమైన గ్రంథము. సభా పర్వమును కళువె వీరరాజు వచనముగా రచించెను. ఇది జైమిని భారతము తరువాత వెలువడినది. క్రీ.శ. 1652 - 1704 ప్రాంతమున చిన్న దేవరాయలు మైసూరు సింహాసనము నధిష్ఠించిన కాలములో రచింపబడినది. ఇతడు ఆదిపర్వము, భీష్మ పర్వములను గూడ వచనమున వ్రాసెను. తుపాకుల అనంత భూపాలుడు అను శాసన పర్వమును వచనమున వ్రాసెను. శాంతి పర్వము (నారాయణీయము) కథ, కృష్ణార్జున సంవాదము, గయోపాఖ్యాన కథ, ఆది పర్వము, కథ భారతమునకు సంబంధించిన వచన కావ్యములు.

## రామాయణ సంబంధములు

దక్షిణ దేశమున శ్యామరాయకవి రచించిన రామాయణము బహుళ ప్రాచుర్యమును పొందినది. ఉత్తర రామాయణ సంగ్రహము కర్త పేరు లేదు. సుందర కాండము, విష్ణు పురాణములు తుపాకుల అనంత భూపాలుడు రచించెను. మార్కండేయ కథ కలదు. కర్త పేరు లేదు.

---

1. ఆంధ్ర వచన వాఙ్మయము - ఉత్పత్తి వికాసములు - ఆచార్య ఎం. కులశేఖరరావు - పుట - 29

## భాగవత సంబంధములు

పుష్పగిరి తిమ్మన సమీర కుమార విషయము రచించెను. (క్రీ.శ. 1700ల ప్రాంతము)

రంభ కథ కర్త పేరు లేదు. బ్రహ్మాండ వచనములు - మాచనామాత్యుడు (క్రీ.శ. 1750) రచించినాడు.

ఇట్లు భారత, రామాయణ, భాగవత సంబంధ వచనములు వికాస దశను పొందినవి.

## ప్రబంధ రామాయణములు

ప్రబంధమను మాట అష్టాదశ వర్ణనాత్మకమై, కావ్య నిర్వచనమునకు పర్యాయ పదమై విలసిల్లినది. ముఖ్యముగా శ్రీ కృష్ణదేవరాయల కాలములో ప్రబంధములు వెలసినవి. ఈ కాలమునకు ప్రబంధ యుగము, స్వర్ణయుగమని పేరు. 14వ శతాబ్ది చివరి పాదము, 15వ శతాబ్ది ప్రథమ పాదము ప్రబంధములకు ప్రసిద్ధి చెందినది. కృష్ణదేవరాయల కాలములోనే రచింపబడిన కొన్ని ప్రబంధములను పేర్కొందును.

1. రామాభ్యుదయము : అయ్యలరాజు రామభద్రుడు శ్రీ కృష్ణ దేవరాయల భువన విజయము అష్టదిగ్గజములలోని వాడు. రామకథా వస్తువును ప్రబంధమొనర్చెను. 8 అశ్వాసములు గల ప్రబంధము. ఉత్తర కాండ లేదు. అరణ్యావాసముకు పోవునపుడు సీతకు ఆ విషయము తెలియదు. రథము కొంత దూరము పోయిన పిదప రామునితో యిట్లు ప్రశ్నించుచున్నది.

మ॥ "మనయూరెయ్యది? యెంతదవ్వుల మనమీ మార్గంబునం బోవుటల్
మనమచ్చోటికిఁబోయి రావలయు? నేలం లేదు తేరిచ్చటన్?
మన తోటల్వలెంబువ్వుటొవచులు సమ్యక్చంద్ర కాంతస్థలుల్
గనరావిప్పుడదేమి? నావిభుడు శోకం బాత్మలో నాగుచున్" (పంచ - 37)

రావణాపహృతయగు సీత కాలి యందె జారిపడినటుల వర్ణించిన తీరు సహజముగ తోచును.

---

1. ఆంధ్ర వాఙ్మయము - రామాయణములు - డా. కె. మలయవాసిని గారు - పుట. 280

"పోవునెడఁద్రోవనప్పుడప్పుడు మీపట్టి
యడుగుందామర పసిండి యందె వడియెఁ
ధరణి కులకర్త్రి వచ్చెనో ధరణితనయ
వార్త రఘుభర్తకెఱిగింప వలసియనగ" (5 - 205) [1]

ఈ భావన ఆ వాల్మీకము. శ్రీరాముడు సముద్రునిపై అలిగియున్నపుడు కడలియే రాముని వద్దకు వచ్చినట్లున్న వాల్మీకి కథను కొంత మార్చి సముద్రుడు తన భార్య లయిన గంగా, తుంగభద్రా సమేతుడై వచ్చినట్లున్నది. భార్యావద్వయముతోనున్న సముద్రుని రూపమును మనకనుల ముందు చిత్రించినాడు.

క॥ "ఆ తోయధి తన ఱొమ్మున
నాతలి కీతలికి వెడలినమ్ములతో గం
గా తుంగభద్రల పయిం
జేతులు వైచుకొని రాము జేరగ వచ్చెన్" [2]

రాయబారమున అంగదుడు "నీవు సీతనిచ్చినచో రాముడు నీకయోధ్య నీయగలడు. లంకా దేశమును ముందే విభీషణునికిచ్చి యున్నాడు. కావున లంకా రాజ్యము పై ఆశ వదులుమని చెప్పిన పద్యము.

తే॥ ఇంక ( నైనను జానకినిచ్చి శరణు
జొచ్చితేని యయోధ్య నీకిచ్చు విభుడు
నాడెలంక విభీషణునకు నొసంగి
నాడు నేడింకనీకది వేడరాదు[3]

వీరి పద్యములు శ్లేషతో కూడి. చమత్కృతితో నిండి ప్రౌఢమైనవి.
శ్లేష చమతీకృతులకు నిదర్శనములై నిలిచిన పద్యరత్నములు

క॥ వేదాదుల నెడఁబాయడు
వేదాదుల మరగినవాడు వీడౌరా!

దశరథుని మరణ విషయమును గమనింతము.

1. ఆంధ్ర వాఙ్మయము - రామాయణము - డా॥ కె. మలయవాసిని - పుట - 281
2. ఆంధ్ర వాఙ్మయము - రామాయణము - డా॥ కె. మలయవాసిని - పుట - 281
1. ఆంధ్ర వాఙ్మయము - రామాయణము - డా॥ కె. మలయవాసిని - పుట - 282

క॥ నందనవనవాసము తన
డెందముగుందింపగా డొడింబడదానున్
నందనవనవాసము విభుఁ
డొందరఘూత్తముని బాసియుండం గలడే? అని వర్ణింపబడినది.

1. నందనవనవాసము - పుత్రుడగు శ్రీరాముని అరణ్యవాసము

2. నందనవనవాసము - దశరథుడు మరణించి స్వర్గము చేరినట్లును శ్లేష చెప్పవచ్చును.

సీతారాముల కల్యాణమును మనోహరముగా వర్ణించినాడు.

"ముత్తియంబులు దోయిళ్ళ ముంచిముంచి
కొంచువారల హర్షాతి ముంచిముంచి
మించి తన చేయి మీదుగా వించి మించి
విభుడు తలంబ్రాలు వోసె నవ్వెలదిమీద"

సీతపై హర్షాతిశయమున ముత్యాల తలంబ్రాలు ముంచి ముంచి పోసినాడన్నారు. వనవాసము సీతకు దుర్భరమని భావించి నడక సులభమగుటకై దండకారణ్యము నందలి బాటలోని రాళ్ళను తీసి ప్రక్కకు పడవేసినాడట. అప్పుడు సీతాదేవి మనసులోని మాట స్త్రీ సహజ లక్షణమును కవి చమత్కరించినాడు. ఆ రాళ్ళన్నియు స్త్రీలై శతంబులై నిలుచువారేమో? నని సంశయించెను. ఆ భావమునకు శ్రీరాముడు చిరునవ్వు నవ్వి ఆవలికేగెనట. రామముద్రికను చూచిన సీత 'చిటికెన వ్రేలిగోరునకు నేమాయె' నని ప్రశ్నించినది. వీరి రచనల్లో జాతీయములు, లోకోక్తులు కోకొల్లలుగా కొలువై యున్నవి.

2. ఉత్తర రామాయణము : కంకంటి పాపరాజు రచించినారు. జానకీజానీ కథల్ రచింపకున్న వాని వివేకమేటికి? అని ప్రశ్నించుకొనినాడు. ఆంజనేయుడు ఆకాశమున, సూర్యునితో గూడి తిరుగుచు విద్యనేర్చెనట.

తే॥ కుడిచి చల్లని నీడల గూరుచుండి
గురువు చెప్పినఁజదువరే ధర వడుగులు

---

1. ఆంధ్ర వాఙ్మయము - రామాయణము - డా॥ కె. మలయవాసిని గారి గ్రంథమాధారము - పుట - 284 నుండి 285 వరకు

నిరశనుండయి పఱచుచు సింగి గఱకు
టెంబడకు సహించి వదినె నీతడు ఘనుడు [1] - (5-141)

రావణుని శివపూజను గూర్చి :



క॥ కలదని గాత్రమొ కించుక
వలదని పద్మాసనము శివనాధునిపై
బెదరని తలపును. జలనము
గదురని చూడ్కులును బంక్తి కంఠునికె తగున్

సీతారాముల కల్యాణ ముహూర్తమున కౌశిక ముని అరుంధతిని జూపిన సందర్భము రమణీయ కల్పనయే.

తే॥ చూపి ధ్రువునూరకయ వసిష్ఠుండు నిలువ
నగుచుఁగౌసికుని యరుంధతిని జూపె
మీ పురోహితురాలు సుమ్మీపురంధ్రి
దయగటాక్షించును ధరణి సుతను [2]

## రామాయణములు - నాటకములు

1. సంస్కృతమున మురారి పండితుడు 'అనర్ఘ రాఘవ నాటకమును తెలుగులో బిజ్జ భూపాలుడు, 17వ శతాబ్దముతో రచించెను.

2. రామభద్ర దీక్షితుల 'జానకీ పరిణయ' సంస్కృతి నాటకమును సంగీపురము వేంకట శేషకవి క్రీ.శ. 1960లో ప్రబంధీకరించినారు. ఈ రామాయణము 'శేష రామాయణము'గా ప్రసిద్ధి నొందినది. మచ్చునకొక పద్యము.

ఆ.వె. ధనువు విరిగినంత దశకం
విఱిగె, జనకు శంక విఱిగె, సీత
భయము విఱిగి, రాము బనివెట్టి పనిచిన
కుశిక తనయ గుండె కుదుట బడియె

1, 2. ఆంధ్ర వాఙ్మయము - రామాయణము - డా॥ కె. మలయవాసిని - పుట - 293

**చంపూ రామాయణములు :**

భోజుని చంపూరామాయణము నెందఱో అనువాదము చేసిరి. వారు ఋగ్వేద కవి వేంకటాచలపతి, చిత్రకవి రామాచార్యులు, పూసపాటు రంగనాయకులు, అల్లమరాజు రంగశాయి, పొన్నూరు కృష్ణమూర్తి, నిడుమర్తి దుర్గ ప్రసాదరావు మరియు జయంతి రామయ్య పంతులు.

అధ్యాత్మ రామాయణము : రేపాక శ్రీరామకవి. ఇది మలయాళ ప్రజలకు అభిమాన గ్రంథము. కాణాదము పెద్దన సోమయాజి యను గద్వాల సంస్థానకవి అధ్యాత్మ రామాయణమును రచించెను. కోటంరాజు సింహయామాత్యుడు క్రీ.శ. 1860లో రచించెను. (క్రీ.శ. 1916లో ప్రచురించినారు) బులుసు వేంకటేశ్వరులు, జగదేవరాయలు, పరశురామపంతుల లింగమూర్తియు వ్రాసినారు.

ఆనంద రామాయణమును తెనిగించినవారు కొండ లక్ష్మణ శాస్త్రి చంపూ కావ్యముగ, ఆకుల పూర్ణానంద గుప్త నిర్వచనముగ తెనిగించిరి. ఇది అముద్రితము.

బాల రామాయణము : వాల్మీకి రామాయణమున నారదుడు చెప్పిన సంగ్రహ రామాయణమే బాల రామాయణము. శబ్దమంజరిలో చివరగలది బాలరామాయణము. దీనిని శబ్ద శాస్త్రజ్ఞుడగు రామానుజకవి రచించెను. సంకలన కర్త శ్రీ నడిమింటి సర్వమంగళ శాస్త్రికి సమకాలికుడు. ఇదియేకాక ఎన్నో బాలరామాయణములు గలవు.

కొత్తపల్లి రాజలింగకవి, జయంతి రామయ్య పంతులు, కాంచపల్లి కనకాంబ, ముళ్ళపూడి బ్రహ్మానందము, శృంగారకవి వేంకట రామయ్య రచించారు. సంస్కృతములో సేతుబంధ కావ్యము శ్రీ మేడిపల్లి వేంకట రమణాచార్యులు (క్రీ.శ. 1965) రచించినారు.

విచిత్ర రామాయణము : నరసింహ దేవర కవి. ఇది అనువాద పద్ధతిలో వ్రాయబడినది.

నిర్వచన రామాయణము : వేల్పూరి వేంకట కవి. భాషాంతరీకరణము. ప్రబంధ శైలి. దీనినే రామచంద్రోపాఖ్యానము అని కూడా వ్యవహరింతురు. ఈ రామాయణము నందు శ్రీరాముని 'నీవు పగలు పుట్టినావు. రాత్రి పుట్టదగిన వాడవు. దుష్టుల సంహరించుటకు ఇది నీకు న్యాయమా!' అని కవి ప్రశ్నించినాడు.

రామచంద్రోపాఖ్యానము : వారణాసి వేంకటేశ్వరుడు, మిక్కిలి మల్లికార్జునుడు కూడ వ్రాసిరి. దేవణూరి కొండయార్యుడొక రామచంద్రోపాఖ్యానము వ్రాసెను. ఇది ప్రబంధ ఫక్కీలో, సంధాన విధానముతో సాగినది.

జానకీ రమణ విలాసము : దూర్వాసుల జగన్నాథ మార్తాండ కవి. శృంగార గీత ప్రబంధమును వ్రాసెను. తన కావ్యము శృంగార.గీతమే. ఇది 1884లో రచింపబడినది.

జానకీ రాఘవము : బేదపూడి కృష్ణయ్య అముద్రితము. సీతారాముల కళ్యాణ గాథ. అలభ్యము. అముద్రితము. మద్రాసు ఓ.ఎమ్.యల్. నందు గలదు.

జానకీ పరిణయము : కూచిమంచి జగ్గకవి. ఇది దొరక లేదు. రామసుబ్బారాయకవి. వేంకట నారాయణ కవులు. సీతా కల్యాణమును రచించిరి.

ఓరుగంటి సోమశేఖర కవి రామాయణము ప్రబంధ రీతి. అలభ్యము.

సీతారామ విలాసము : మంత్రి ప్రెగడ సూర్య ప్రకాశరాయ కవి.

దాశరథీ విలాసము : కొత్తపల్లి లచ్చయ్య

రామ విలాసము : ఏనుగు లక్ష్మణ కవి

పట్టాభిరామ విలాసము : పండితారాధ్యుల నాగలింగకవి.

శ్రీరామ చరిత్ర : నండూరి చారుమంత్రి

రఘురామ విజయము : భావన కవి

కకుస్థ విజయము : మట్ల అనంత భూపాలుడు

శృంగార రాఘవము - చెఱకుమూడి కృష్ణ కవి. అసమగ్రము

రామలీలా విలాసము : పోడూరి వెంకట రాజు

ఇవి అంత విశేషమైనవి కాకపోయినను ప్రత్యేకముగా తెలుపబడినవి.

రామాయణము : శ్రీ ఆకుండి వేంకట రమణ

రామాయణము : శ్రీ చింతపూడి సన్యాసి రావు

రామాయణము : శ్రీ మూలా పేరన్న

రామాయణము : శ్రీ ఉపమాక నారాయణమూర్తి

వీరు కంద పద్యములలో వ్రాసినారు.

శ్రీ ఉపమాక నారాయణమూర్తి రచించిన కందమాలికలున్నవి.ఆత్మానంద మాలికా రామాయణములో మత్తేభ విక్రీడితమున 'న' కార ప్రాసము. చమత్కార పద్యము.

మ॥ ఇది మత్స్యావ్య కుమారి, శూర్పణఖ యట్లేనాడు వర్తింపదా
పద(జేగూర్పదు, పత్నీ సీతను హరింపన్ సోదరుంబంధింపదా
ప్పిద మౌపల్కుల, మీ పదంబులనె సేవించు జరించున్ మిమున్
వదలంబోవదు వీనిగైకొనుము దేవా ! రామచంద్ర ప్రభో!

ఇవియే గాక ఇంక ఆటవెలదులలో రగడలో, కందములలో, రామాయణములు రచించిన వారున్నారు.

నవ రామాయణము - ప్రతి పద్యము మనోహరము

పూజా రామాయణము - టి. శ్రీనివాస భట్టాచార్యుడు

పారమార్థిక రామాయణము - దీక్షిత దాసు

ఆశ్చర్య రామాయణము - లక్కావఝ్ఝల వేంకటశాస్త్రి

అద్భుత రామాయణము - 1. మడుంచి కృష్ణయ్య, 2. విద్యానంద సరస్వతి

సాంఖ్య రామాయణము - చెన్ను కృష్ణయ్య

సంక్షేప రామాయణము - కె. వేంకట రమణ కవి

శృంగార రామాయణము - వరాహగిరి సూర్యనారాయణ

సీస మాలిక శ్రీమద్రామాయణము - చెఱకుపల్లి నరసింహ సిద్ధాంతి

మధుర రామాయణము - బెహరా లక్ష్మీ నరసింహ కవి

నిర్వచన భారత గర్భ రామాయణము - గురజాల శ్రీ రామకృష్ణయ్య

బంధుర వృత్తి నిర్వచన రామాయణ సంగ్రహము - పిన్నమరాజు బలరామకవి

సూక్ష్మ రామాయణము - రెంట వేంకట కృష్ణయ్య

సంక్షేప రామాయణము - కె.వి. రామానుజశర్మ

లక్ష్మ సంగ్రహ సీస మాలికము - ఆంధ్ర రామాయణ సంగ్రహము - వింజమూరి లచ్చిరావు.

ఆత్మ రామాయణము - గురుమూర్తి

పట్టాభిరామాయణము - శఠగోపాచారి

బాల రామాయణము - ములకుంట్ల పున్నయ్యశాస్త్రి

గాయత్రీ రామాయణము - బహుజనపల్లి సీతారామాచార్యులు

అభినవ రామాయణము - నూనె సుబ్బమాంబ

పాటల రామాయణము - పార్వతి వర్ధనమ్మ

మహారామాయణార్థము - కే. ఆర్. శర్మ

రామాయణ కథా కందార్థములు - తుర్లపాటి అన్నపూర్ణ

రఘురామ చరిత్రము - కృష్ణగిరి - కృష్ణకవి

సౌభ్రాతృ రాఘవము - పూతల పట్టు శ్రీరాములు రెడ్డి

రామకథా సుధార్ణవము - తుమరాడ పాపకవి

రామకథా సుధాలహరి - చామర్తి సుందర శేషగిరి రావు

రామాయణ సారార్థము - ములుకుంట్ల నరసింహావధాని

చిలకమర్తి వారి రామాయణము - చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారు

శ్రీరామ రామాయణము - పళ్ళె పూర్ణ ప్రజ్ఞా చార్యులు

శతకంఠ రామాయణము - అనేకమంది వ్రాసినారు.

## ద్వ్యర్థి రామాయణములు

ఆంధ్ర సారస్వతములోని పలు ప్రక్రియలలో ద్వ్యర్థి కావ్య ప్రక్రియ యొకటి. ఈ రచన ద్వంద్వార్థ సంఘటనమును బట్టి 'ద్వ్యర్థి కావ్యములుగా పేర్గాంచినవి. ద్వ్యర్థి

కావ్యములే గాకుండా త్ర్యర్థి. చతుర్థి ప్రక్రియలు కూడా గలవు. ఈ ప్రక్రియ కాద్యమూలము సంస్కృత సారస్వతము. రామకథకు సంబంధించిన ద్వ్యర్థి కావ్యములు.

రాఘవ పాండవీయము - కవిరాజ సూరి - క్రీ.శ. 1100 - 13 వర్గలు 668 శ్లోకములు

యాదవ రాఘవము - వేంకటాధ్వరి

రామకృష్ణ విలోమ కావ్యము - దైవజ్ఞ సూర్య సూరి

రాఘవ నైషధీయము - హరదత్తు సూరి, 2 సర్గలు, 148 శ్లోకములు

రాఘవ పాండవీయము - నైఘంటిక ధనుంజయుడు (క్రీ.శ. 1000-18 సర్గలు, 1100 శ్లోకములు)

రాఘవ పాండవ యాదవీయము - చిదంబర సుమతి - 3 సర్గలు 115 శ్లోకములు.

ద్విసంధానము - ఆచార్య దండి

యాదవ రాఘవీయము - నరహరి కవి (మైసూరు ఒ.యం.ఎల్. లోనిది)

రామ చరితము - సంధ్యాకరనంది

రాఘవ పాండవీయము - శ్రుతి కీర్తి త్రైవిధ్యుడు

యాదవ రాఘవ పాండవీయము - అనంతాచార్యులు

రాఘవ యాదవ పాండవీయము - రాజ చూడామణి

రాఘవ పాండవీయ ద్విసంధానము - ఆచార్య దండి (అలభ్యము)

ద్వ్యర్థి కావ్య ఒరవడి సంస్కృత సారస్వతము కంటె తెలుగు సారస్వతముననే ఎక్కువగా నున్నది.

రాఘవ పాండవీయము - వేములవాడ భీమకవి

రాఘవ పాండవీయము - పింగళి సూరన రమ్యమైన కథ

పింగళి సూరన రాఘవ పాండవీయములోని ఒక పద్యము.

శా॥ రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండుందద్గతి గావ్య మెల్లనగునే నాహో యనం జేయదే
పాండిత్యంబున నందునుంతెనుగు కబ్బం బద్భుతంబంద్రుద
క్షుండెన్నాడిల రామ భారత కథల్ జోడింప భాషాకృతిన్?

తెలుగు ద్వ్యర్థి కావ్యములు ఇరువది వరకున్నవి. వీనిలో ముప్పావు (3/4) వంతు రామకథ గలవేయున్నవి.

హరిశ్చంద్రనలోపాఖ్యానము - రామ రాజ భూషణుడు

నైషధపారిజాతము - కృష్ణాద్వరి

కృష్ణార్జున చరిత్ర - మంత్రి ప్రెగ్గడ సూర్య ప్రకాశ కవి

యాదవ భారతీయము - చెన్న కృష్ణకవి

శివ రామాభ్యుదయము - నోడూరి పెద రామన్న

లంకావిజయము - పిండిప్రోలు లక్ష్మన్న (రావణ దుమ్మీయము)

ధరాత్మజా పరిణయము - లంక మృత్యుంజయుడు

అచలాత్మజా పరిణయము - బుక్కపట్టణము వేంకటార్యుడు

రామకృష్ణ విజయము - మణింగంటి సింగరాచార్యుడు

**త్ర్యర్థి కావ్యములు**

రాఘవ వాసుదేవీయము - చిత్రకవి సింగరాచార్యులు

రాఘవ యాదవ పాండవీయము - నెల్లూరి వీర రాఘవ కవి

యాదవ రాఘవ పాండవీయము - అయ్యగారి వీరభద్రయ్య

రాఘవ యాదవ పాండవీయము - ఎలకూచి బాలసరస్వతి

కథా ద్వయ సంగ్రహార్థము

## చతుర్థి కావ్యములు

నల యాదవ రాఘవ పాండవీయము - గుణుగులూరి వేంకట కృష్ణయ్య శుద్ధాంధ్ర నిరోష్ఠ్య రామాయణములు (అచ్చతెనుగు)

యయాతి చరిత్ర - పొన్నగంటి తెలగన్న

రామాయణము - ఆడిదము బాలభాస్కరకవి

అచ్చతెనుగు రామాయణము - కూచిమంచి తిమ్మకవి

శుద్ధాంధ్రోత్తర రామాయణము - కందుకూరి రుద్రకవి (నిర్ఢోష్ట రచన)

సీతా కల్యాణము - పిడుపర్తి బసవన్న

జానకీ కల్యాణము - పోడూరి రామకవి

సీతా కళ్యాణము - మరింగంటి సింగరాచార్యుడు

దశరథ రాజ నందన చరిత - సింగరాచార్యుడు

అచ్చాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య దాశరథి చరిత్ర - అచ్చిరాజు హనుమంతరాయ శర్మ

అచ్చతెనుగు రామాయణము నందు కూచిమంచి తిమ్మకవికి, సోమయాజికి భగవంతుడు కలలో కన్పించిన విషయమును తెల్పిన పద్యము.

క॥ కావున మా కప్పనముగ
గావింపుము చాల్పుకుత్తుకల తొలి జేజే
జేవ దలిర్పనడించిన
యావెరవరి కతయు బూని యచ్చ తెనుగువన్ - (పీటిక పుట 17)

రచనతీరు ఏవిధముగా నుండవలయునో తెలియపర్చిన సందర్భమున

తే॥ ఒనర (బేరులు బిరుదులు తెలుగు సేయ
బోలదని మున్ను పెద్దలు పూని త్రోవ
యిడిరి గావున గూరుపు మిదియునట్లు
తెనుగు తెఱగెల్ల నేర్పడ దిమ్మ ప్రగడ - (పీటిక - పుట 18)

కూచిమంచి తిమ్మకవి పలువిధములుగా తీర్చిదిద్దెను. వాల్మీకి రామాయణము లోనిది. ఆంజనేయుడు లంకకు రాకమునుపే రావణుడు తెలిసికొనిన విషయమిది. దీనిని కవి ఈ విధంగా చెప్పినాడు.

తే॥ కోతులను గొండముచ్చుల గూడబెట్టు
కొని పుడమిఁజేడు మాతోడ మొనయంగలదే
వట్టి యడియాసలన్నియు గట్టిపెట్టి
పైదలిరొయింక మేల్పట్టు బట్టుకొనుము - (సుందర - 43)

సీతా సౌందర్యమును 'పాలము మన్ని దొరపట్టి' అని ప్రబంధ వర్ణన గావించినాడు. సూర్యాస్తమయములో తిమ్మకవి.

తే॥ రిక్క రాయడు దమి మీఱ రేవెలంది
బెండ్లి యగునని కడ యను పేరటాలు
మొనసియైరేని నీటికై ముంచు పసిడి
కుండ యన బ్రొద్దుమున్నీటగ్రుంకెనంత - అయోధ్య. 12

దశరథుడు రాముని గూర్చి శోకించు ఘట్టమునందు ఈ విధముగ తెల్పియున్నాడు.

క॥ అప్పా! విప్పారెడు నగ
వొప్పారంగ జూచి పలుకకున్నాడ వదే
చొప్పా తప్పా బంగరు
కుప్పా యిప్పాటనిత కొఱకొఱ మెప్పా! - అయోధ్య - 91

బంగారు కుప్పా అచ్చతెనుగలోని అచ్చతెనుగు పదము

క॥ ఉడుకా విడ కున్నది మది
పడుకా మిడుకంగ నుఱక పఱవం జను నే
కొడుకా నడుకానల కిటు
దుడుకా నా పాలిపుడుకు దొడుకానీకున్ - (అయోధ్య - 92)

సీత ఆవేదనలోని అచ్చతెనుగు పదమును పరిశీలింతము

ఆ॥ కడల ఱేడులార! జడదారులార మె
కంబులార! గ్రుడ్డుకాన్పులార !
చెట్టులార! తోడబుట్టువులార పె
న్గట్టులార! నన్ను గావరయ్య - (అరణ్య - 65) [1]

సీతాదేవి నిండు చూలాలయియుండి, అడవిపాలయి, తన ఆవేదనను దిక్పాలురకు, మునీశ్వరులకు, మృగములకు, పక్షులకు, చెట్టు చేమలకు మీరే నా తోబుట్టువులని, నన్ను కాపాడవలయునని మనవి చేసుకొన్నది. ఇంత చక్కని మాటలతో సంబోధింపచేసిన కూచిమంచి తిమ్మన మాటలు తేటతెలుగు మాటలుగ భావింపబడినవి.

ఆధునిక కవులలో శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు శుద్ధాంధ్రోత్తర. రామాయణములో ఉత్తర రామ కథ - గీత పద్యముతో నారంభించినాడు.

అచ్చతెనుగు రామాయణములో తిమ్మకవి సార్వభౌముడు ప్రయోగించిన అచ్చతెనుగు పదములు ఇతర ఏ గ్రంథములోను కనిపించవు. దానవ మానవుల పశుపక్ష్యాదుల వర్ణనలతో మనోహరమైన పదజాలముతో, శబ్దార్థాలంకారాలతో ప్రాసవడిలో పండిత పామర జనరంజకముగా రచించెను.

గీ॥ రక్కసుల ఱేని తలపెల్లజిక్కు జేసి
పుడమి కూతును గైకొనె వెడలియట్లు
గాలి కొమరుండు లోనుగా గలుగు వారు
దమ్ముడును దోడ జనుదేర నెమ్మిమీర (ప్ర.ఆ)

అని ప్రబోధించు లక్షణము గల పద్యములున్నవి. ఇది అముద్రితము.

## యక్షగానములు :

యక్షగానము దేశీయ ప్రక్రియ యక్షగానము నందు గేయానుకూలముగా దరువులు. ఏలలు, మొదలగునవి గలవు. ఇవి ప్రదర్శన యోగ్యమైనవి. నాటకములకు

---

1. అచ్చతెనుగు రామాయణము - కూచిమంచి తిమ్మకవి

బదులుగా యక్షగానములు నాడుచుండిరి. కీ.శ. 17,18 శతాబ్దములలో యక్షగాన రచన విరివిగా సాగినది. దక్షిణదేశమున. తంజావూరిలో, నాయక, మహారాష్ట్ర రాజుల పరిపాలనలో యక్షగానరచన అపారముగా అభివృద్ధి చెందినది.

దక్షిణాంధ్ర వాఙ్మయ ప్రారంభకుడు తంజావూరి రఘునాథ నాయకుడు ఇతని కాలములో అనేక యక్షగానములు వెలువడినవి. జక్కుల రామాయణము : వేల్పూరి వేంకటకవి క్రీ.శ.1780 - 1853 రామలీల, ముమ్మడి దేవుల తిరుమలకవి క్రీ.శ. 19వ శతాబ్దికి చెందిన వాడు గీత రఘునందనము

శీర్నాడు వేంకట రామకవి క్రీ.శ. 1840 రామాయణము

నల్లమిల్లి బసివిరెడ్డి, శ్రీమద్రామ వరరామాయణము.

ఓగిరాల పాపయ్య, రామనాటకము

వెంకటాచార్యకవి, సమగ్రరామ నాటకము

శేషాచలకవి. ధర్మపురి రామాయణము

రాపాకశ్రీరామకవి. అధ్యాత్మరామాయణము.

## హరికథలు, బుర్రకథలు, రామాయణ గేయేతి వృత్తములు

హరికథ వేదకాలము నాటిది. అప్పటికే బీజరూపమున నుండి రామాయణ రచనా కాలము నాటికి కుశలవులు రామాయణ గానము చేసిన సందర్భము దాని స్వరూప స్వభావములో సమకూర్చుకున్నది. హరి కథను యక్షగాన సమానవాచిగా ప్రసిద్ధ హరికథా ఉపన్యాసములు బాగేపల్లి అనంత రామాచార్యులు వాడిరి. ఆదిభట్ల నారాయణదాసు గారు హరికథను యక్షగాన ప్రబంధ సరళిగా పేర్కొన్నారు

సీ॥ ఘన శంఖమోయనఁగందంబు పూరించి
మేలుగా శ్రుతిలోన మేళవించి
నియమము తప్పక నయ ఘనంబుల బెక్కు
రాగభేదంబుల రక్తి సల్పి

బంతులెగర్చిన పగిది గాలజ్ఞతన్
జాతి మూర్ఛన లొప్ప స్వరముఁబాడి
చక్కని నృత్యమున్ సర్వరసానుకూ
లంబుగ నధినయనంబుఁజేసి

గీ॥ స్వకృత మృదుయక్షగాన ప్రబంధ సరణి
వివిధ దేశంబులం చిన్న పెద్దలుగల
బలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమాన మేల [1]

అను పేర్కొనుట వలన హరికథా విధానము తెలిపినది. హరికథా ప్రక్రియలోని రామాయణములను గమనింతము. తెలుగులో తొలి హరికథకు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి. బాలాజీ దాసు - కుశలవ విజయము, సంపూర్ణ రామాయణము, నదీరా సంపూర్ణ రామాయణము, శ్రీరామ జననము, సీతాకల్యాణము, పాదుకా పట్టాభిషేకము, సుగ్రీవ విజయము, లంకా దహనము, రావణ సంహారము, లవకుశ అను బుర్రకథలు ప్రశస్తము. తాళ్లూరి నారాయణకవి - మోక్షగుండ రామాయణము ఆదిభట్ల నారాయణ దాసు - హరికథా పితామహుడుగా బిరుదాంకితుడు యధార్థ రామాయణము, జానకీ శపథము అను పేర శతకంఠ రావణవధ గలదు.

## జానపద వాఙ్మయము

జానపద వాఙ్మయమనగా పల్లెజనులు పాడుకొన్న మౌఖిక పదముల సాహిత్యము. ఇది అక్షర జ్ఞానము లేని జ్ఞానపదులు అల్లినవి. నోరు నోరున, ఊరు ఊరున చేరి దేశీయ పదములతో శుద్ధమైన వాఙ్మయముగా చెప్పవచ్చును. రామాయణమును తీరిక వేళల యందు పల్లె జనులు సంఘటితమై ఆడేవారు, పాడేవారు. వీరి జానపద వాఙ్మయములో రామాయణము కల్పితమైనది. కొన్ని పాత్ర చిత్రణలు, చేష్టలు, గుణ గణములు, రూపు రేఖలు, ఆచారములు, భాష అన్ని జానపదుల స్వంతమే. ఇతరుల నుండి చేర్చుకొన్నది స్వల్పము. జానపద రామాయణములను కొన్నింటిని ఇక్కడ పేర్కొందును.

1. ఆంధ్ర వాఙ్మయము - రామాయణము - డా॥ కె. మలయవాసిని - పుట - 401 - 402

శారద రామాయణము, ధర్మపురి రామాయణము, మోక్షగుండ రామాయణము, గుత్తెన దేవీ రామాయణము అధ్యాత్మిక రామాయణము, సంక్షేప రామాయణము, చిట్టి రామాయణము, కూచికొండ రామాయణము. ఇవి జానపద రామాయణములు. ఇవిగాక కొన్ని ఘట్టములను వర్ణించు రామాయణమ్ములు కలవు. జానపద రామాయణములతో అతి ప్రాచుర్యమును పొందినది. శతకంఠ రామాయణము, మైరావణ చరిత్రము, సీతా విజయము, శతకంఠ రామాయణములో సీతాదేవి శతకంఠ రావణుని సంహరించిన కథ అద్భుతమైనది.

శతకంఠ రామాయణమును లింగన కవి ద్విపదలో మూడు కాండలుగా రచించినాడు. దీనికి శతముఖ రామాయణమని, సీతా విజయమని పేరున్నది. వల్లూరి హనుమంత కవి సీతా విజయమును ద్విపద కావ్యమును రచించినట్లు నాగ్న జిత్త పరిణయములో గలదు. అది అలభ్యము.

శతకంఠ రామాయణము : 'భవిష్యోత్తర పర్వము'ను అనుసరించి వ్రాయబడినది. రావణాసురుని వధతో శ్రీ రాముని త్రేతాయుగ వీర పురుషునిగా వర్ణించిరి. ఈ ద్విపద కవులు శ్రీ రాముని వీరాధిక్య చిత్రణకై శతకంఠ సహస్ర కంఠ రావణులను సృష్టించిరి. సంహారము మాత్రము శ్రీరాముడే చేసినాడు. ఈ గ్రంథములోనొక విశేషమున్నది. రామునితోపాటు సీతాదేవి కూడా యుద్ధమునకు బయలు దేరినదట. సీత వీరనారిగా కల్పించబడి యున్నది. శ్రీ కృష్ణునకు సత్యభామ నరకాసుర వధలో సహాయపడినట్లు సీత పాత్రను పోషించి యుండవచ్చును.

మరొక శతకంఠ రామాయణము మర్దనకవి (క్రీ.శ. 17వ శతాబ్ది) లింగనకవి, గంగన కవి అనువారలు పద్య ప్రబంధముగా రచించినట్లున్నది.

మైరావణ చరిత్ర : వాల్మీకి రామాయణములో లేదు. ఆనంద రామాయణము నందు మైరావణచరిత్ర గలదు. ఈ మైరావణ చరిత్రను మాడయకవి క్రీ.శ. 16 వ శతాబ్దములో రచించినాడు. ఈ ద్విపద మైరావణ చరిత్ర బహుళ ప్రచారమును పొందినది. ఇంకను కాచనకవి చంద్రగిరి చిన్నయ్య, కైలాసలక్ష్మి నరసింహకవి, పాతూరి తిరుపతి కవి, బసవప్పకవి మొదలగువారు ద్విపదలో రచించినారు. వీటన్నింటి యందు కాచన కవి గ్రంథము సాటియైనది. ఇది మంజరీ ద్విపదలో గలదు.

తోలుబొమ్మలాట వారు పాడుటకు అనువుగానున్నది. స్త్రీల రామాయణపు పాటలతో 42వ పాట నందు "శాంత గోవింద నామములు" సీతాదేవి లంకలో పద్మమునందు జన్మించినట్లు వర్ణింపబడినది. ఈమె బాల్య క్రీడలలో శివధనస్సును కదిలించినట్లున్నది. రావణుని చంపిన రామునకు బ్రహ్మ హత్యా పాపము చుట్టుకున్నట్లును అవాల్మీకాంశములున్నవి.

శూర్పణఖ విషయమున సీతా పరిత్యాగమును జానపద కవులు కల్పించుకున్న విధము అవాల్మీకమైయున్న ఘట్టములు అన్నయగు రావణాసురుడు మరణించినను, శూర్పణఖ రామునిపై వ్యామోహము వీడలేదట. తనకు అడ్డుగానున్న సీతను తొలగించుకొనుటకు శూర్పణఖ భిక్షగత్తెగా మారి అయోధ్యకు వచ్చి వేటకు బయలుదేరు శ్రీరాముని దర్శించుకొనును. సీత బొమ్మను గీసి, తన కిమ్మని రావణుని కోరును. ఇట్లెన్నో సన్నివేశములు కల్పింపబడినవి.

రామదాసు కీర్తనలు, త్యాగరాజ కృతులు, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి (క్రీ.శ. 1730). అధ్యాత్మ రామాయణ కీర్తనలు, తూము నరసింహదాసు భజన కీర్తనలు, పరాంకుశ దాసు కీర్తనలు, ప్రయాగ రంగ శర్మ (క్రీ.శ. 1849 నుండి 1927 ) కీర్తనలు మొదలగునవి. రామకథ విశేషమును వెలువరించినవి. ఈ విధముగా రామాయణమును కావ్యములుగా, ప్రబంధములుగ, ద్విపదలుగ, ద్వ్యర్థి. త్ర్యర్థి, అచ్చతెలుగు, నిరోష్ఠ్య. యక్షగాన, సలక్షణ, వచన, శతక, జానపద, ఖండ కావ్యములుగ వివిధ రీతులుగ రచించి కీర్తించినారు.

ఇట్లు వివిధములైన రామాయణములను కొన్ని విస్తరముగను, కొన్ని క్లుప్తముగను, మరి కొన్ని నామమాత్రముగను సమీక్షించితిని.

# ద్వితీయ ప్రకరణము

# తెలుగులో ద్విపద ప్రక్రియ

తెలుగు వాఙ్మయము నందు కవిత్వము పలువిధములుగా వెలువడినది. గేయము, పద్యము, గద్యము, చంపూ, ద్విపద మొదలగునవి. కవిత్వము మొదట గేయ రూపముగ ఆ తదుపరి పద్య గద్యాత్మకముగ వృద్ధి పొందినది. ప్రాచీన మానవుడు భావావేశమునకు లోనైనప్పుడు సహజముగా చిందులుద్రొక్కుచు, రాగము తీయుచు, ఆడిన ఆట, పాడిన పాటలే కాలక్రమేణ కళలుగా రూపొందినవి. ఈ ఆటపాటల్లో మూడు విభిన్న కళాంశములు దాగి వున్నవి. 1. అడుగు వేయుట, 2. రాగము తీయుట, 3. మాటలాడుట ఇవి శాస్త్రీయ భాషయందువరుసగా నృత్యము, గీతము, శబ్దములుగా స్థిరపడినవి. "గీతిగతమైన యేలయని, నిబద్ధత కలదో అదే పద్యగతమైన ఛందస్సు" అని నిర్వచనము.[1]

**ద్విపద కవిత్వము :**

తెలుగు వాఙ్మయము నందు పద్య కవిత్వమునకు వృత్తములనియు, జాతులనియు ద్వివిధములు. జాతి ఛందస్సు నందు జాత్యుపజాతుల భేదములతో మరల రెండు విధములు. షడ్విధ కందములు, ఉత్సాహము, తరువోజ, అక్కర, ద్విపద, త్రిపద, చతుష్పద, పంచపద, షట్పద, రగడ, కళిక, ఉత్కళిక అనునవి జాతులుగను, సీసము, గీతము, ఆటవెలదులనునవి ఉపజాతులుగను లాక్షణికులు పేర్కొనిరి. ద్విపద అనునది జాతి ఛందములోని భేదమని తెలియుచున్నది. ఇచట అప్పకవి పేర్కొనిన విధము పరిశీలింపదగినది.

"కందభేదము లాఱుగాక యుత్సాహము
తరువోజ మధ్య మాక్కఱలు నైదు
దీపించు మంజరీ ద్విపద త్రిపద చతు
ష్పద పంచపద షట్పద విధములు

---

1. గౌతమ వ్యాసములు - పింగళి లక్ష్మీకాంతం గారు - పుట 112 - 1964

తొమ్మిది విధములతో నొప్పు రగడలు
  కళికలు నుత్కళికలును గూడ

జాతులు నవవిధ గీతంబులును సీస
  సప్తకంబును నుపజాతులయ్యె
ననుచు నన్నయ భట్టు భీమనయు పెద్ద
సచిపుడును మూర్తి తాత యజ్వయు ననంత
మంత్రియును తిమ్మరాజు నిమ్మాడ్కిచెప్పి
రందముగ వారు చేసిన ఛందములను[1]

అనంతుని ఛందోదర్పణములో ద్విపదను గూర్చి :

"ఇంద్రులు మువ్వురు నిను డొక్కరుండు
సాంద్రమై యొక్కొక్క చరణంబు (గొలువ
నలరు బ్రహ్మోవరుఁడంచు దీరోత్త
ములు విస్తరింతురు ముదముతో ద్విపద"[2]

ద్విపద పాదమునందు మూడింద్రగణములు, ఒక సూర్య గణము వుండును. ప్రాస నియతి గలదు. మూడవ గణము గణాధ్యక్షరము యతిస్థానము. రెండు పాదములు గలది కావుననే ద్విపద యయినది. ఇచట 'తన యొక్కొక్క పాదమును ముగ్గరింద్రులు నొక్క సూర్యుడును సేవించుచుండగా విష్ణు మూర్తి ప్రకాశించు చుండును.' అని యర్థము.

"ఇంద్ర గణములు మూడు ఇనగణంబొకటి పాద పాదము నందు

ఒపుగు చుండు" ననెడి కవి జనాశ్రయ కర్త విధానము కూడ సరియైనది.

పై పద్యముల నాధారముగా గ్రహించినచో నన్నయ కంటె ముందే దేశీ కవిత గలదని ఋజువగుచున్నది. ఈ భిన్న వృత్తములు నన్నయ మున్నగు కవిజన సమ్మతములే గదా! కవులు వారి వారి సందర్భానుసారముగ తమ కావ్యములలో ఆయా ఛందములను

---

1. అప్పకవీయము - అప్పకవి - 4వ ఆశ్వా - 447. వ పద్యము
2. ఛందోదర్పణము - అనంతుడు 3వ ఆశ్వా - పుట. - 228

ప్రయోగించిరి. నన్నయ తరువోజ, మధ్యాక్కర, ఉత్సాహము, కందములను వ్రాసెను. ఆయన రచనలో ద్విపద, వచనములు మాత్రము కానరావు. ఇక కవిత్వమున దేశీయతనే ముఖ్యముగ తీసుకొన్నచో తిక్కన తన భారత రచన యందు, నన్నయ మార్గమున ననుసరించెను. కావున కవిత్రయము నాటికి సంస్కృతములోని అనుష్టుప్పు ఛందమువలె తెలుగులో ద్విపద ప్రాచుర్యము వహించి యున్నదని చెప్పవచ్చును. ద్విపదలు నన్నయ కంటె ముందు లేవన్నచో లక్ష్య లక్షణములలో లక్ష్యములే ముందు పుట్టినవని, లక్షణములు తరువాత పుట్టిన వని లాక్షిణికులకు విదితమే.

తెలుగు సాహిత్యము నందు ద్విపదకు రెండు పాదములే యుండును. సంస్కృతము నందు (అనుష్టుప్ఛందము నందు) మాత్రము నాలుగు పాదములుండును. వైదిక, సంస్కృతములలో మూడు పాదములు గల ఛందస్సు యున్నట్లు తెలియును. సంస్కృత వాఙ్మయమున నాలుగు పాదములున్నవి. సంస్కృతమే దేశీయ ఛందస్సునకు ఆద్యమైనది. అప్పకవి చౌపద (చతుష్పద) పద్యమును గమనింతము.

"జలజాసన మిశ్రమ సంయుతమై
లలిషోడశ మిత లఘువుల తోడన్
గలసి చతుష్పద గతులను ధరలోన్
చెలువగు చౌపద....." [1] అన్నాడు అప్పకవి.[1]

త్రిపద, పంచపద, షట్పద ఛందములను బట్టి అవి తమతమ ప్రత్యేకతను నిల్పుకొన్నవి. దీనిని బట్టి దేశీయ ఛందములపై పాదనియతి నిర్దిష్టముగ లేదని భావింపదగును. ద్విపదలను గురించి నిడుదవోలు వారి అభిప్రాయము ప్రకారము ద్విపద వాఙ్మయమును మూడు ఘట్టములుగా విభజింపవచ్చును. [2] అవి 1. శివకవి యుగము, 2. కృష్ణరాయల యుగము, 3. దక్షిణాంధ్ర యుగము.

దక్షిణాంధ్ర యుగమున ద్విపద రచనకు శ్రీకారము చుట్టినవాడు రఘునాథ నాయకుడు. 'నలచరిత్ర' యను అతని ద్విపద కావ్యము మనకు తెలిసినదే. విజయ రాఘవ నాయకుడు రచించిన 'పాదుకా సహస్రము' నేటికిని లభ్యముగాకుండుటయే

---

1. అప్పకవీయము - అప్పకవి - 4వ ఆశ్వా. పుట - 471
2. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - నిడుదవోలు వేంకట్రావు 1978 పుట 89

మన దురదృష్టము. మహారాష్ట్ర రాజగు ఏకోజి రామాయణము, పరమానందయతి. అనుభవ దర్పణము, శివజ్ఞాన మంజరి రెండు ద్విపద కావ్యములు లభ్య కావ్యములు.[1]

పద్యమునకు నాలుగు పాదములు మించినచో దానికి 'మాలిక' యను పదమును చేర్చి చెప్పుట కలదు. ద్విపద, రగడ మున్నగు వాని యందెన్ని పాదములున్నను ద్విపద రగడ యని పేర్కొనుటయే గాక ద్విపదమాలిక, రగడమాలిక యని అందురు. అయితే ద్విపదలో బేసి సంఖ్యలుండరాదు. (పాదసంఖ్య) సరి సంఖ్యలోనే ఉండవలెను. అప్రయోజన పదోపయోగముండుటకు వేలులేదు. మొదటి పాదములోని అర్థ గాంభీర్యత రెండవ పాదముపై ఆధారపడి నిండుదనమును చేకూర్చును.

మధుర కవితా శాఖకు చెందిన ఈ దేశీయమగు ఛందస్సు కొన్ని మార్పులతో తరువోజ, గీతము, సీసము మొదలగు ఛందములుగా మారినదనవచ్చును. గేయాంశము గల్గి తెలుగు కవితలోని దేశీ చ్ఛందములకెల్ల తల్లి వంటిదని చెప్పవచ్చును. దేశీయకవితలలోని తొంబది శాతము రచనలు ద్విపదలు. ఇవి స్థానిక భేదములై పాఠక లోకమున స్థిరపడినవి. స్త్రీల పాటలలోను, సుద్దులలోను, పామర రచనలలోను ద్విపద బహుళముగా నున్నది. మంజరీ ద్విపదను కూడా చూడవచ్చును. [2]

ద్విపద లఘు బుద్ధులగు వారి దృష్టిలో నిరసనముకు (దావలమైనను ద్విపదయ లఘుపతియగు పాల్కురికి సోమన చేతిలో నైహికాముష్మిక రూపక ద్విపద హేతువై విరాజిల్లినది. [3] సహజసత్యముతో స్వతంత్రాభ్యనురక్తితో సాగిన ద్విపద రచన యందీతడు ప్రకటించిన నవీన గుణముల సంఖ్యాకములు అనిర్వచనీయములు. శ్రుతిస్మృతి ప్రమాణములు లెక్కకు మిక్కిలిగ(గుప్పించుట యందేమి, గహనములగును పని షద్రహస్యముల దేట తెనుగుగ జొప్పించుట యందేమి, పలు విధములగు పరమత సిద్ధాంతము(ప్రదర్శించి ఖండించుట యందేమి, ఏకధాటిగ ఝరి వేగమున సంస్కృత సమాసఘటిత పద జాలములను ప్రవహింపచేయుట యందేమి, లలితములైన అలతి యలతి తునియలుగ విడివడి, తేనియ తేటలై వెలువడు జాను తెనుంగు నుడుల జాలువార్చి, చదువరుల హృదుల కరగించుట యందేమి ఇదియది యననేల,

1. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - నిడుదవోలు వేంకట్రావు - 1978 పుట 89
2. బసవ పురాణము - పాల్కురికి సోమనాధుడు - పీఠిక - పుట. 86, 87
3. బసవ పురాణము - పాల్కురికి సోమనాధుడు - పీఠిక - పుట. 88, 91

దేని యందును గూడ నడ్డొక్కింతయు లేక సర్వవిధముల నాతనికి 'వశంవదమై' ద్విపదయే బహురూపకములగు వివిధ సంధానములందొక్కరీతిగ నుపకరింప నేర్చెను. [1]

శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు, ఆంధ్రపత్రిక పదియవ సంవత్సరాది సంచికలో 'ద్విపద కవిత్వము'ను వ్యాసమున బసవపురాణము, పండితారాధ్య చరిత్రములనుద్దేశించి వ్రాసిన ఈ వాక్యములు గమనింపదగినవి.

'ఈ రెండు గ్రంథములనెక్కడ జూచిన నక్కడ నవరసములు పొంగి పొరలిపోవు నంతటి రసోదంచితములుగ ద్విపదలలో గూర్పబడినవి. పాల్కురికి సోమనాథుడు తన రచనలో సౌందర్యమాధుర్యములు, భక్తిరసపరవశములు భావమునే ప్రధానముగ గొని, శ్లేషయమకాలంకారములకై తడువులాడక, జాతీయతను గణించి దేశీచ్ఛందమయిన ద్విపదలో ప్రధాన కృతులు వెలయించి యందు తీరు తీయములు గల తెలుగు పలుకుబళ్ళను మేలుగ జాలువార్చుట యిందుకు ప్రధాన కారణములు. [2]

ద్విపద పాదమునందలి నాలుగు గణముల మొత్తము పదునైదు మాత్రలకు తక్కువ గాకయు పదునెనిమిది మాత్రలకు మించకయు నుండును. ఈ లక్షణమును మనసున నుంచుకొని మన దేశీయమైన గేయములను కొన్నింటని పరిశీలించిన అవి మంజరీ ద్విపదలుగనే గోచరించును.

ఉదాహరణమున ఈ క్రింది పంక్తులను పరిశీలింపుము :

"మాటమా - టకుగొల్ల - గొల్లడని - యేపు
ముదముగా - నీ భూమి - మోసెను - గొల్ల
వేడుక - వ్రేపల్లె - వెలదుల - గూడి
కొల్లలా - డినవాడు - గొల్లడు - కాడ"

'రెడ్డొచ్చె - రెడ్డొచ్చె - రెడ్డొచ్చె - నమ్మ
వీరభ - ద్రారెడ్డి - విచ్చేసె - నమ్మ
ప్రొద్దున్నె - పూలెడ్డి - పారకూడి - పించు

1. బసవ పురాణము - పాల్కురికి సోమనాథుడు - పీఠిక - పుట. 87
2. బసవ పురాణము - పాల్కురికి సోమనాథుడు - పీఠిక - పుటలు. 88 మరియు 91

నిలువెల్ల - నడివీధి - నీరుజ - ల్లించు
సంధుగొందు - లలోన - సాన్పువో - యించు
చౌకట్ల - పసుపుకుం -కమలపూ - యించు"

"దంపుదం - పనియేరు - అది యెంత - దంపు
ధాన్యరా - శుల మీద - చెయ్యేసి - నట్లు
వంటవం - టనియేరు - అదియెంత - వంట
వదినతో - మరదళ్ళు - వాదాడి - నట్లు
సువ్వన్న - చుక్కళ్ళు - రాజమా - మిళ్ళు
నాచేతి - రోకళ్లు - నల్లరో - కళ్లు
చేయించు - అన్నయ్య - చేవరో - కళ్ళు
వేయించు - అన్నయ్య - వెండిపా - న్నుల్లు"[1]

అని పాడెడు పాటలలో దేశీయకవిత యొక్క మాధుర్యము అధికముగా ద్విపదలలోనే కన్పించుచున్నది. నన్నయ కంటె ముందున్న దేశియకవితలు చేరినవి. మరియు అందందు ప్రాస యతిగానగును. మచ్చునకొక ఉదాహరణమును పరిశీలింతము.

1. "అత్తింటి కోడలు ఉత్తమురాలు
   చేట జొన్నలు పోసి చేనిద్రపోను"

2. "చక్కనన్నగారి ముక్కుపై చెమట
   చేరడేసి ముత్యాలు చెదరినట్లుండు"

3. "చలికి వెఱచినట్లు పులికి నేవెఱవ
   ఆలికి వెఱచినట్లు అమ్మకే వెఱవ"

4. "కొడుకులంగనని వాళ్ళ కడుపేమి కడుపు
   కులముద్ధరింపని కొడుకేమి కొడుకు"

---

1. బసవ పురాణము - పీఠిక - పుట - 87, ప్రభాకర శాస్త్రి మరియు ద్విపద రామాయణ భారతి - పుట - 134, 135

అని ప్రాచీన మతము ననుసరించియే సోమనాథుడు ద్విపదలయందు రగడలయందు కూడ ప్రాసయతిని ప్రవేశపెట్టినాడు. చక్రపాణి రంగనాథుడు రామాయణము నందు, గౌరవ నవనాథ చరిత్ర యందును ప్రాసయతి నుపయోగించినారు. చక్రపాణి రంగనాథుని రామాయణములోగల ప్రాసయతి ప్రసిద్ధ 'నయన రగడ'గా ప్రాచుర్యము పొందినది. ఉదాహరణ :

"పురివైరి నంధకాసుర వైరిఁబొడగంటి
రంగొందు పాతాళ గంగ నేఁబడగంటి
అంగికమ్ముగ నాడు భృంగేశుఁబొడగంటి" [1]

నన్నయ భారతములో ద్విపదలు లేవు. తరువోజ (రెండు ద్విపద పాదములు ఏక పాదముగా గలవి) లు కొన్ని గలవు.కర్ణాటక కవుల వర్గ ప్రసాదిక సంప్రదాయములు పూర్ణముగ నంగీకరింపనిచో మల్లికార్జున పండితారాధ్యుడు తన శివ తత్త్వ సారమున నిట్లు నిరూపించి యుండునా?

క. " లోకముల ఁజోద్యముగాదె య
ధర్మంబును ధర్మమయ్యె ఁదత్త్వాతీతా"

క. " సర్వజ్ఞభక్తి విరహితుఁ
డెవ్వడు నుత్కృష్టజాతుఁడేటికి ఁ గొఱయే"

అను పద్యపాదముల యందలి 'ధర్మంబు' 'సర్వజ్ఞ' వంటి పదముల్లోని రేఫ సంయుక్తాక్షరములానాటి లిపిలో 'ధమ్మన్ంబు' 'సవన్జ్ఞ' యను విధమున లిఖింపబడెననియు, అందుచే వలపల గిలక ప్రాసయను పేరుతో నిట్టి ప్రాసములు లాక్షణిక సమ్మతములేయని శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు వ్రాసి యున్నారు.

ద్విపదను గూర్చి తాళ్లపాక చిన తిరుమలాచార్యుడు (చిన్నన్న) ఈ విధముగా చెప్పి యున్నాడు.

---

1. తిరుమల - తిరుపతి దేవస్థాన ప్రాచ్య పరిశోధన సంస్థ వారి పత్రిక - వాల్యూమ్ 8, 1947 - పార్టు - 1

"ద్విపదల ద్విపద సంధిల నేక శబ్ద
మష్టపు రెంటను గూర్చినది యయుక్తంబు"

"మఱియు సంస్కృతపు సమాన రూపమున
నెఱయు నెన్నిటినైన నిర్మింపదగును"[1]

అని ద్విపదలన్నియు సంస్కృత సమాస రూపమున నున్నచో నెన్నిటినైన కలవ వచ్చునని నిర్దేశించినాడు. ఈ లక్షణములన్నియు పాల్కురికి సోమనాథునకు అర్వాచీనమైనవే. సోమనాథుని ప్రాచీనత, ద్విపద రచనలోని ప్రత్యేకత ద్విపద యొక్క ప్రాచీన స్వరూపము స్పష్టమగును. మంజరీ ద్విపదల రూపములోనున్న పదములు గేయములు మరువలేక మాటలే ప్రమాణములయినవీ క్రింది పదములు.

"శివువిల్లు విరచిన శ్రీరాముడేమి
ఎవ్వరో నీపతి యెరగించవమ్మ
అనగానే నా పతియౌను రాఘవులు
జగదీశులై వారు చెలగొచ్చినారు"

"కైకమ్మ వంటిది కలద యీ భవిని
ఆయమ్మ భాగ్యంబు లమరక యున్న" [2]

అను పాటలను సోమన పామరజనుల నుండి గ్రహింపలేదని చెప్పవచ్చును. కావున రెండు పాదములలోనున్న మంజరులే ద్విపద పుట్టుకకు కారణమైనదని అనవచ్చును.

ద్విపదను గూర్చి విన్నకోట పెద్దన :

"శక్రత్రయంబును సవిత్రుండు పాద
విక్రీడితులు మృధు ద్విపదికి నెపుడు
వళియు ప్రాసంబును వలయు దీనికిని
వలదు ప్రాసంబంద్రు వరుస మంజరికి [3]

1. అష్టమహిషి కల్యాణము - తాళ్లపాక చిన్నన్న - పుట. 6
2. పండితారాధ్య చరిత్రము - వాద ప్రకరణము
3. కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన - 8 - 61

అనుటచే ద్విపదయను పదమే సాహిత్యమునకు ప్రమాణమైనది.

"అష్టకోదశకః సప్తకో విద్యాం సావితి సాభురికే
సనోవాజేషు పాదౌదౌః జాగతౌద్విపదోచ్యతే"[1]

"క్వచిదష్టాక్షర పాదద్వయ వత్యపి ద్విపదా గాయత్రేద్భృశ్యతేయధా"[2]

ప్రాకృత ఛందమునందు ద్విపద, ద్విపదీ భంగాదులున్నట్లు హేమచంద్రుని ఛందోనుశాసన గ్రంథమున వివరింపబడినవి. దీని వలన ద్విపదీ - ద్విపద నామములు అతి ప్రాచీనమైనవని తెలియుచున్నది. రెండు పాదములుగల ఛందమును ద్విపదయని ప్రాచీనులనిరి. తెలుగులో ద్విపద - ద్విపదీ యనియు అనిరి. తమిళ భాషలో 'కురల్' అనగా రెండు పాదములు గల చిన్న పద్యము[1] మలయాళము నందు 'ఈరడ' అను పద్యము నందు రెండు పాదములున్నవి. కన్నడాంధ్రములందలి ద్విపద, త్రిపద, చౌపద, షట్పది అను దేశీయ ఛంధస్సులు పాద సంఖ్యను బట్టియే వచ్చినవి. [3]కన్నడ సాహిత్యము నందు దువయి, దువలిగ, దువది అను పేరులతో ద్విపదలున్నవి. దువయి పాదమునకు 26 లేక 28 మాత్రలుండును. ఉత్తర భారత సాహిత్యములోను రెండు పాదముల పద్యములున్నవి. ప్రతి పాదమున 28 మాత్రలుండును.

కాశ్మీర సాహిత్యమున 'బహర్ - ఇ - హజాజ్' అను రెండు పాదముల పద్యము గలదు. ప్రతి పాదమునందు 14 మాత్రలుండును.[4] ఈ ఛందము పాడుటకు అనువైనది. పర్షియా దేశమందలి 'హజాజ్' ఛందము పాడుటకనువైనది. పర్షియా దేశమునందలి 'హజాజ్' ఛందమునకును బహర్ - ఇ - హజాజ్ ఛందమునకును ఈ సన్నిహిత సంబంధము గలదు.[5]

అస్సామీ సాహిత్యమున రెండు విధములయిన ద్విపదలున్నవి. 'పయరా' త్రిపది అని పేర్లు కలిగిన ఈ ఛందములు రెండు పాదములు కలిగినట్టివే. దీనిలో 'పయరా'

---

1. పటలః - 16 సూ - 17, 23 పింగళి ఛంధము - 16లో నున్నది
1. ఋగ్వేద సంహిత 7-2-16-3
3. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష - జి.నాగయ్య 160 - పుట, 161 పుట
4. మాత్రా ఛందస్సులు - వ్యాస సంగ్రహము - డా॥ చిలుకూరి నారాయణరావు
5. The Kashmiri Ramayana, Edited by A. Grienson - Pub. by Asiatic Society of Bengal

ఛందమున పాదమునకు 14 అక్షరములును, త్రిపది యందు 26 అక్షరములును యుండును.

"Assamese metres are widely of two kinds Payara and tripadi, both these are in the shape of complets - payara. Generally with 14 syllables to the line and tripadi with 8+8+10 - this (Tripadi) being called "Chasi" Metre". [1]

ఒరియా సాహిత్యములో 'దండి' వృత్తము రెండు పాదములు గలిగిన పద్యము

It is a complete the only characteristic of both metre is the similarity of last consonanty (with vowel) of this padas. There is no hard and fast rule regarding the number of letters (Akshara) in each line it voices from 12 to 24.[2]

ఈ దండి వృత్తము కూడా పాడదగినట్టిదే.

బెంగాలీ భాషలో 'పయరా' త్రిపది ఛందములున్నవి. పయరా ఛందమునకు 'పాంచాలి' అను పేరు కలదు. పాంచాలి యనగా బొమ్మ యని అర్థము. తోలు బొమ్మలాటల వారు పాడెడి పాటలే పాంచాలీ ఛందమునకు మూలమని చూపిరి. [3]

తెలుగు ద్విపదలోని మూడింద్ర గణములు, ఒక సూర్య గణము. అన్ని భాషల లోని రెండు పాదముల పద్యములలో ఒకే విధముగా లేవు. కావున ద్విపద తెలుగువారి స్వంతమని చెప్పుట కంటె ద్విపదకు తెలుగు లాక్షణికులు చెప్పిన లక్షణములు తెలుగు వారి స్వంతమనుట సమంజసమని తెలియుచున్నది. చిన్నన్న ద్విపద కెదుగును అనునట్లే తాళ్లపాక చిన్నన్న 'అష్టమహిషీ కల్యాణము'న ద్విపద విరాట్ఛందోప తీర్ణమని వ్యక్తపరిచెను.

---

1. Extract from the letter of Sri Maheswara Sastry (Professor of Assamese Language and Literature ) University of Gauhati Dt. 12-8-1976 to J.V. Subbarayudu

**ద్విపద రామాయణ భారతి - పుట - 147, జె.వి. సుబ్బారాయుడు - తెనాలి**

2. Extract from Dr. K.V. Misra's letter (Prof. of Oriya Berahampur University) dt 31-1-76 to J.V. Subbarayudu

3. The Bangali ramayana Dr. C. Sen.

"తెలుగున గూర్చిన ద్విపద యంత్రమున
నొనర క్రియాంత సముచ్చయాంతముల - దనరు నకార మంత్యము గూడెనేని
వినుతింప నుత్తర ద్విపదాది యందు - గొనకొన్న స్వరముతో గూడగా దనుచు
నొనరింప సుకవీంద్రులు ద్దండ మంద్రు - ...............................
అరసున్న నొన గూర్పననువైన హల్లు - గరిమనీ ద్విపదాది గను పట్టెనేని
తొలి విభక్తికి దగతుది విభక్త్యంత - ములు నకారములును .... బింబాస్య
యానకారము చెల్లు నరసున్నలగుచు - నానీల కచభృంగ నలమేలు మంగ
యను లక్షణంబుల నను బొంద సుకవి - జన సుప్రయోగైక శరణమై నిఖిల
జగదేక సుత విరాట్ఛందోప తీర్ధ - మగుచునే ద్విపద విఖ్యాతి చెలంగ"[1]

ద్విపద సంస్కృత, ప్రాకృత జన్యమైనది. భారతీయ వాఙ్మయములన్నింటికి వైదిక వాఙ్మయమే మూలము. అట్లే ఛందమునకును వేదమునందలి అక్షర వృత్తములే కాలక్రమమున ప్రాచీన సంస్కృతము నందలి గురులఘు సమ్మేళనమున నేర్పడిన వర్ణవృత్తములై యుప్పతిల్లినవి. ఈ రెండింటి యందును కానరాని 'స్వర మాధుర్యము' ను సాధించుటకే తరువాతి కాలమున ప్రాకృతము నందలి మాత్రావృత్తము లేర్పడినవి.[2] ఈ మాత్రావృత్తములకు చెందినవే గాథా (ఆర్యా) మాత్రాసమక, వైతాళీయ, జాతీయ వృత్తములు ఇవి క్రమముగా ద్విపదీ, సమ చతుష్పదీ. అర్ధ సమచతుష్పదీ. వృత్త వర్గములకు చెందినవి. ఆ తరువాత నీ ఛందోవర్గము లొక్కొక్కటియు మఱియెన్నో జాతుల పుట్టుకకు కారణములైనవి. పై గాథా వృత్తమే పద్యా, విపులా, చపలా భేదములతో విస్తరిల్లినది. దీని నుండియే గీతి (గీతికా) సంధ్యా వర్ణము లెన్నియో కలిగెను

కాళిదాసు మహాకవి విక్రమోర్వశీయము నందు

(...శతి సహజన్యా చిత్ర లేఖా చ)

...లేఖా (ప్రవేశానన్తరం ద్విపది కయాది శోవలోక్య)

---

1. అష్టమహిషీ కళ్యాణము - పుట - 6 - తాళ్ళపాక చిన్నన్న.
2. తాళ్ళపాక చిన్నన్న సాహిత్యము - పరిశీలనము - డా॥ వేటూరి ఆనందమూర్తి - పుట 14
3. తాళ్ళపాక చిన్నన్న సాహిత్యము - పరిశీలనము - డా॥ వేటూరి ఆనందమూర్తి - పుట - 148

దీనిని గూర్చి వ్యాఖ్యాత అభిప్రాయమిట్లున్నది

"ద్విపదికయాదిశోవలోక్యేతి ద్విపది కాఖ్యగీతి విశేషేణ దిగవలోకనం విధాయాగ్రి మాంగాధాం పఠతీత్యర్థ! - దిశోవలోక్యద్విపదికాఖ్య గీత్యావదతీత్యర్థేవా"!

దేశీచ్ఛందమునకు తెలుగులో ద్విపదయే పునాది యని చెప్పవచ్చును. ఈ ద్విపద నుండియే సీసము, ఆటవెలది, తేటగీతి మొదలగు పద్యములుద్భవించినవి. ద్విపద ప్రాస నియమమును గల్గియుండవలెనను నియమము లాక్షణికు లేర్పరచిరి.

ఉదాహరణ : గోపికా వల్లభాగోవింద నిన్ను
గోపాల మాధవాగురు దేవ గొలుతు [1]

ఒక్కొక్క జాత్యుపజాతి వృత్తములను వ్రాయు సంప్రదాయము పద్యకావ్యము లందు గలదు. ఇట్టి సంప్రదాయము తెనుగున లేదు. గ్రంథమంతటిని ద్విపదయందే వ్రాయు సంప్రదాయమున్నది. దీనినే అప్పకవి

"కృతిదగ నీ రెంటిచే నొప్ప ద్విపద
మతి లేక చెప్పిన మేలంద్రు కవులు" అని ఆనాటి సంప్రదాయమునే చెప్పియున్నాడు. అంతేగాక ఇంకొక పద్యము.

తే॥ సౌమ్యగురు కవుల్ నిను బ్రీతి సరసిజాక్ష
భోగి భాగసనుండని పొలుచుటరుదె
సౌమ్యగురు కవుల్ నిను బ్రీతి సరసిజాక్ష
భోగి భాగాసనుండని పొగడ ద్విపద [2]

వైదిక వాఙ్మయమున ద్విపదా గాయత్రీ, ద్విపదా జగతీ, ద్విపదా శత బృహతీ, ద్విపదా త్రిష్టుప్, ద్విపదా విరాట్ అను ఛందములు కన్పించుచున్నవి.

'ద్విపదికా, ద్విపదీ', 'స్వార్థేక, హ్రస్వః, గీతిభేదే, 'శుద్ధా ద్విపదకా గీతి
ర్లంభలేత్య భీధియతే - భరతః, ద్విపదీః ఋగ్భిన్నే ద్విపద భక్తగీతి

---

1. ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర - డా॥ టి. సుశీల పుట - 1
2. అప్పకవీయము - అప్పకవి - 4 - 562 పద్యం

భాగే మాత్రావృత్త భౌదేచ, అదా షట్కలమే తతే. తనుపంచ చ
చతుష్కలమ్ గుర్వంతం ద్విపద భవతీహ వించత్యష్టకలందలమ్ గాయత్ర్య[1]
స్యైక పదీ - చతుష్టద్య పదసి సహపద్యసే శతపథబ్రాహ్మణము ( 14-8-1510)

విక్రమోర్వశీయమున కాళిదాసు సూచించిన "చిత్రలేఖా ప్రవేశానన్తరం ద్విపదికయాది దోవలోక్య" అను దానిని పేర్కొని ద్విపదికకు లక్షణమును వ్యాఖ్యాత భరతముని ప్రోక్తముగ నుడివినాడు. భరతముని వ్యాఖ్యానముగా చెప్పబడు శ్లోకమొకటి :-

"శుద్ధా ఖండాచ మాత్రా సంపూర్ణేతి చతుర్విధా - ద్విపదీకరణాఖ్యేన తాలేన పరిగీయతే
............................................................ - జ్ఞేయాశుద్ధైవ సంపూర్ణ గురుణాంతేదికేనతు'

ఈ జంభలికయే ద్విపదికగా రూపాంతరము నొంది జంభలమైనదేమో!

బాణభట్టు : 'కాదంబరి' పూర్వ భాగములో 'ద్విపది' యొక్క పఠన విశేషముచే పేర్కొనబడినది.

భావ ప్రకాశము : ఇందు 'కావ్యమను నుపరూపకము, సభగ్నతాళద్విపదీ ఖండ మాత్రా పరిష్కృతమ'నియు, కల్పవల్లి' యను నుపరూపకము ద్విపదీ ఖండ గేయాధ్యమనియు గలదు.

కన్నడ సాహిత్యము నందు 'సాంగత్య' మనునది ద్విపద యుక్తము. సాంగత్య ఎరడె పాదగళు

'రతిగీత 'చెలువుభా' రతి గీత సవన్నె

ప్రతిలక్ష్మి 'సొబగురూ' పివళు'[2]

ఇందు ద్విపదకన్న ఒక మాత్ర ఎక్కువగా నున్నది.

---

1 వాచస్పత్య నిఘంటువు

2. 'కన్నడ కైపిడి' అను గ్రంథమున తెనుగు ద్విపద లక్షణము చెప్పబడినది. తెలుగినల్లి ద్విపద - పుట - 180

"హసి దుబం 'నసరింగ' శినదీయ బేకు
శిశుగలగె 'హలెణ్ణె' గళనదసి బేకు
ఎరడు ద్విపద కూడినదే చౌపది

లక్షణము : ఎసెద చౌపదగెపదునెయి మాత్రెగళు
నసి నెమలి యెంట కొలు పసరి సులిరలు .

తెలుగు ద్విపద మళయాళ భాషయందలి 'కల్యాణి'తో సరిపోలుతున్నది

'మల్లెపురప్పెట్ట పిన్నాలె సీత
కళ్యాణి నీదేవి శ్రీరామ రామ'

'తాతంభట్టు' చింతామణి యను లక్షణ గ్రంథమున లక్ష్మీకల్యాణము నందు 'రేకులు' అనబడు నీరజోదరు రాణి 'నీలవేణికిని' అని ద్విపద పాదములు గలవు. ఈ లక్ష్మీ కల్యాణము ఒక యక్షగానముగా కానవచ్చును. ఈ రేకులు అనునవి ద్విపద పాదములుగా గ్రహింపవచ్చును! రగఢ భేదము రేకులు పెక్కుల మరునని అన్నారు.[1] లక్ష్మీ సార సంగ్రహమున ద్విపదకు రగడకు కూడ బాంధవ్యమున్నదని పేర్కొన్నారు.[2]

కన్నడములోని 'లలిత' తెలుగు ద్విపదకు సమానముగా నున్నది.

కన్నడ 'లలిత' అల్లమా మరదల్లి మల్లికా లత యొల్లి
యెళె యసుగె మరవల్లి జళరుహా కరవల్లి'

ఆచార్య యస్వీ జోగారావు గారు ఏలలు, సుద్దులు అన్నియు రగడ భేదములే అవే ద్విపద భేదములు అని పేర్కొన్నారు.[3]

సువ్వాల ద్విపదః ఇవి దంపుళ్ల పాటలు దీని లక్ష్యమిట్లున్నది

గౌరీ కళ్యాణము : ఇద్దరు స్త్రీలు పెండ్లిలో పాడుకొనుపాట. జక్కన విక్రమార్క చరిత్ర ( 4 - 130 - 179 )

అనంతుని భోజరాజీయము 4 - 87 కాకమాని మూర్తి

1. తంజావూరు సరస్వతీ మహలు కేటలాగు నెం. 779
2. లక్షణ సార సంగ్రహము - కూచిమంచి తిమ్మకవి
3. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - ఆచార్య ఎస్. పి. జోగారావు గారు - పుట - 260

4. పాంచాలీ పరిణయము 4 - 22 మాదయ్యగారి మల్లన రాజశేఖర చరిత్ర యందు దీని ప్రసక్తి గలదు. ఇది యక్షగానమైనను ద్విపద రూపములో నున్నది.

ఉదా : శ్రీ రుక్మిణీ లోల చిర సుగుణ జాల
కారుణ్య మయ శీల కల్యాణ చేత [1]

లక్ష్మీ కల్యాణము : వేంకట నాథుని పంచతంత్రములో గల ద్విపదను (4360) పరిశీలింతము.

ఉదా ॥ శృంగార మమరంగ చెలువ మన్నారు
చెంగమ్మ పెండ్లికి చెలువలార రారె
నిత్య కల్యాణంబు పచ్చతోరణము
హెచ్చైన కడలి రాజంట నే ప్రొద్దు [2] (4-360)

ఆటవెలదికి, సీసమునకు పొత్తున్నది. సీసమునకు తేటగీతికి పొత్తున్నది. ఆటవెలదికి, తేటగీతికి పొత్తున్నది తేటగీతికి ద్విపదకు పోలిక గలదు. ఈ విషయము నిచట గ్రహింతము.

ఆటవెలదికి సీసమునకు గల పోలిక :

ఆటవెలది : గ్రుడ్డి వయితిని నీవు కుంటి దానను నేను
నగరికెట్లు మనము నడవ గలము

సీసము : గ్రుడ్డి వయితివి నీవు కుంటి దానను నేను
నగరికెట్లు మనము నడవ గలము

సీసమునకు తేటగీతికి గల సంబంధము :

సీసము : చెలియ కంటివె నీవు సిరులొలు,కు సుమబాల
భాగవంతుండైన, భర్త బడయు

తేటగీతి : చెలియు, కంటివె, నీవు, సిరులొలు,కుసుమ
బాల, భాగ్యవంతుండైన, భర్త, బడయు

---

1. మాతృభూతన - పారిజాతాపహరణము
2. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - ఆచార్య, ఎస్వీ జోగారావు గారు

ఆటవెలదికి తేటగీతికి గల పోలిక :

ఆటవెలది : అఖిల సుకవి కృతుల యందు నలరుచుండు

తేటగీతి : అఖిల సుకవి కృతుల యందు నలరు చుండు

ఆటవెలది : విజయ, పాండవులకు, వినుము జ,యమగును

తేటగీతి : విజయ, పాండవు,లకు విను,ము జయ,మగును

తేగటతికి ద్విపదకు గల పోలిక :

తే.గీ. బాలచంద్రుని, బద్ధ భా,వం బె,ఱింగి

ద్విపద బాలచంద్రుని బద్ధ భావం బెఱింగి

ద్విపద భాసిల్లుతున్నది. ద్విపదకును, సీసమునకు నొక్క భేదము కన్పట్టుచున్నది. ద్విపద యందు ప్రాసనియతి యుండగా, సీసమునకు ప్రాసనియమము లేదు.

చతుర్విధ కవిత్వము నందలి ఆశు, మధుర, చిత్ర, విస్తర భేదములలోని మధుర కవిత్వమే ద్విపద యయినది.[1] మధుర, కవిత్వమే మాధుర్యగుణమని చెప్పిన పెద్దన పద్యము.

"పటు బంధంబులు మృదుల
స్ఫుట విన్యస్తాక్షరములు బూరిత రస సం
ఘటిత పదార్థంబులు నె
చ్చటనగు మాధుర్యమనగ జనునది కృతులన్" [2]

మధుర కవితాశాఖకు చెందిన ద్విపద దేశీయ ఛందస్సులోనే యున్నది. ద్విపద ఛందస్సును కావ్యోపయోగ ఛందస్సుగా తీర్చి దిద్దిన మహానుభావుడు పాల్కూరికి సోమనాథుడు. ఈ ఛందస్సు నందు ఉద్గ్రంథములను రచించి గేయ రూప ఛందస్సునకు సాహిత్య గౌరవము నాపాదించిన యశశ్శాలి సోమన్న. భాష, వస్తువు, ఛందస్సు మూడింటి యందును. తనకంటె పూర్వము నున్న సంప్రదాయమును త్రోసిపుచ్చి విప్లవమును సాధించిన వీరుడు సోమనాథుడు.

1. వార్త కవి రాఘవయ్య
2. కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన - పుట - 464

పాల్కురికి సోమన శైవమత ప్రచారార్థమై రచించిన బసవపురాణము పండితారాధ్య చరిత్రలు సామాన్య జనులందరిని అలరించినవి. ఈ ద్విపద రచన గేయ భావమును గల్గియుండి కావ్యమంతయు ఒకే ద్విపదయందే సాగినది. సామాన్య ప్రజలు పాడుకొనుటకు సులభముగా నుండి మన్నన పొందినది. ఈ ద్విపదను గురించి కర్త యిట్లు నుడివి యున్నాడు.

"ఉరుతర గద్య పద్యోక్తుల కంటె - సరసమై పరగిన జాను తెనుంగు
చర్చింపగా సర్వ సామాన్యమగుట - గూర్చెద ద్విపదలు గోర్కి దైవార"
"ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ - పూరిత సంస్కృత భూయిష్ట రచన
మానుగా సర్వ సామాన్యంబు గామి - జాను తెనుగు విశేషము ప్రసన్నతకు"

ద్విపదను నాటి కాలమున చులకన చేసిరను భావమున ద్విపదను సమర్థించిన తీరును గమనింతము.

"తెలుగు మాటలనంగ వలదు వేదముల - కొలదియ కాజూడు డిల నెట్టులనిన
బాటి తూమునకును బాటి యౌనేని - బాటింప సోలయు బాటియ కాదె"
"అటుగాన యభి వినుతానంది తోక్తి - పటు గద్యపద్య ప్రబంధ సామ్యముగ
గావ్యకళా ప్రౌఢి గల్పింతు ద్విపద - కావ్యంబు భావ్యంబు గాన నట్లయ్యు"
"దేశిగా వచియింతు ద్విపదకు వళ్లు - బ్రాసంబులును బొంగు పడగ తావలయు
ననుచు దదీయ సుక్తాక్షర పంక్తి - జనకక యింతొప్ప జెప్ప నేయనుచు
సన్నుతి జేయుచు సత్కవులలర -తిన్నని సూక్తుల ద్విపద రచింతు
నదియును గాకై హికాముష్మిక ద్వి - పద హేతువగుట ద్విపదనా బరగు
ద్వివదాంబు రుహముల ధృతి బసవేశు - ద్విపదాంబురుహముల ప్రీత బూజింతు"

అని ప్రతిజ్ఞ చేసి ద్విపద కావ్యములు రచించినాడు. ఈ రచన వైదిక ఛందము గావుననే సోమనాధుడిట్లనినాడు. 'వేదముల కొలదియ కాజూడు' డని హెచ్చరించినాడు.

అన్నమాచార్యుడు తన రామాయణమున 'ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున[1]' తాళ్లపాక చిన్నన్న నిర్ణయించిన ద్విపద లక్షణములు పాల్కురికి సోమనాధుడు స్థాపించిన ద్విపద లక్షణములు భిన్నముగా నున్నవి.



1. అన్నమాచార్య చరిత్ర - తాళ్లపాక చిన్నన్న - పుట 47

"వాసవుల్కుమ్మువ్వురు పనజాప్తుడొకడు - భాసిల్లునది యొక్క పదము శ్రీకాంత
క్రమమున నీ నాల్గు గణములు నడచు - క్రమ దూరముగ ప్రయోగము చేయరాదు.
ఆపాదమునకు మూడవ గణంబొది -దీపించు యతిమంబుధి ప్రియ తనయ
యుప మింపనది ప్రాస యుతములై రెండు -ద్విపదనా విలసిల్లు వికచాబ్జపాణి
ద్విపదకు ద్విపదకు (దెగ(జెప్పవలయు - నెపుడు సంస్కృతము నితర భాషలను
యతుల లోపల బ్రాసయతి (దక్క సకల - యతులు చెల్లును బ్రయోగాను సారమున
ద్విపదతో ద్విపద సంధిలనేక శబ్ద - మపుడు రెంటను కూర్చునది యయుక్తంబు [1]

అని చిన్నన్న తెలిపినట్లుగా ఇతర లాక్షిణికులెవరు ద్విపదకు సమగ్రమగు నిర్వచనమును తెలుపలేదు.

1. ద్విపదతో ద్విపదకు సంధిలరాదు
2. ద్విపద ఏ పాదమునకా పాదము విడివిడిగా నుండవలెను.
3. ద్విపద యందు ప్రాసయతి నిషేదింపబడినది

ఇవి తప్ప సకల యతులు చెల్లును. ఇంకను చిన్నన్న తెలిపిన నియమము.

"దినము లోననె వేయి ద్విపదలింపొంద
వినుత వర్ణనల తోడ విరచించు వాడ(
గవిశిరః కంప యోగ్య ప్రతి ద్విపద
నవ బిరుదాంకుండ ...."[2] నని పేర్కొన్నాడు.

పైన పేర్కొన్న నియమములు కవులకు ద్విపద రచనలు విశిష్టముగా నుండవలెనని తెల్పుచున్నవి.

యక్షగానములలో ఇతర దేశిచ్ఛందస్సులతోపాటు ద్విపదనొక ఛందోభేదముగ విరివిగా నుపయోగింపబడి యుండెననుటుచితము. ఒక అపూర్వ విశేషము కూడ. యక్షగానములందు ద్విపద ప్రసక్తి గూర్చి ఆచార్య యస్వీ. జోగారావుగారు పేర్కొన్నారు.[3]

ద్విపద సాహిత్యము నందలి విశిష్టతను గూర్చి ఎన్నియో రచనలు వెలిసినవి. తంజావూరు నేలిన మహారాష్ట్ర రాజులలో భోసల వంశస్థుడైన రెండవ ఏకోజి క్రీ.శ. 1736

---

1. అష్టమహిషీ కల్యాణము - అవతారిక - తాళ్లపాక చిన్నన్న - ద్వి. పం. 130 - 160
2. ద్విపద వాఙ్మయము - జి. నాగయ్య - పుట. 95 శ్రీ వేం. యూని. తిరుపతి 1967
3. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - డా॥ యస్వీ జోగారావు గారు - పుట - 257

- 37 రామాయణమును యథా వాల్మీకముగను, సంగ్రహముగను రచించిన ద్విపద రామాయణమును తన తండ్రియగు తులజాజి (క్రీ.శ. 1729 - 36) అంకిత మిచ్చినాడు.[1]

క్రీ.శ. 17,18 వ శతాబ్దములందు తంజావూరులో సాహిత్య వికాసమను వృక్షమునకు కావ్యములను పూలు పూసినవి. కావుననే దక్షిణ దేశము నందు ప్రసిద్ధమైన ద్విపద కావ్యములు వెలిసినవి. వానిలోని కొన్నిటిని పేర్కొందును..

బాలరామాయణము - గణపవరపు వేంకట కవి. క్రీ.శ. 1670లో రచించెను. ఇది అలభ్యము.

రుక్మాంగద చరిత్ర - దర్భా వేంకటగిరి కవి.

శివజ్ఞాన మంజరి, అనుభవ దర్పణములో రచించిరి - ఇవి వేదాంత ద్విపదలు. పరమానంద తీర్థ యోగి క్రీ.శ. 1600

పురాణములు కూడా ద్విపదలుగా రచింపబడినవి. భారత కథలను ద్విపదలో రచించినవారు 1. బట్టేపాటి తిమ్మయ్య (క్రీ.శ. 1550 - 1600), 2. ఆతుకూరి సోమన (క్రీ.వ. 1600-1650), 3. బాలసరస్వతీ రామాయణగాథను ద్విపదలో రచించినవారు.1. కట్టా వరదరాజు క్రీ.శ. 1630, 2. రత్నాకరము గోపాలకవి క్రీ.శ. 1575 - 1650. భారతాంతర్గత కథను సౌగంధికా ప్రసవాపహరణమును భాగవత దశమ స్కంధమును ద్విపదలో రచించెను. టేకుమళ్ళ రంగశాయి భాగవతములోని ప్రథమ మొదలు చతుర్థ స్కంధములను ద్విపదగా మలచెను.

ద్విపద వాఙ్మయము సంగీత సాహిత్యములకే పరిమితము గాక కులవృత్తులలోని విశేషమును చూపిన ఘట్టమొకటి గలదు. ఏకులు వడకు పడతిని స్వభావ సిద్ధముగను. అద్భుతముగను వర్ణించిన ద్విపద పంక్తులను గమనింతము.

"రాట్నము ముందట రతనంపు ( జిన్న - పీటపై గూర్చుండి బిసరుహ పాణి
కుడికా రాట్నపు కొనపీట(దొక్కి - యెడమ హస్త సిలువు నిల(జిక్కబట్టి
కడియముల్ గాజులు కట్లుతోడాలు - భడిబడి ఘల్లని ధ్వని సేయుచుండ(
గుడి చేతిలో(బిడి(గొని త్రిప్పి త్రిప్పి - యెడమ కేలున నేకు నెగ యూడ్చి యూడ్చి

1. ద్విపద వాఙ్మయము - జి. నాగయ్య - పుట. 95. శ్రీ వేం. యూని. తిరుపతి 1967

తన చూక్కి యేకుతో దారంబు తోడ -ననుగమింపగ దారమప్పుడు నపుడు
కదురుకు జుట్టిన క్షణ మాత్రమందు - ........................................"[1]

క్రీ.శ. 17, 18 శతాబ్దములలో వెలువడిన వైష్ణవ మత ద్విపద కావ్యములు విరివిగా గలవు. వానిలోని కొన్నింటిని పేర్కొందును.

తిరువాయి మొళి - కాంద్రవేటి రామానుజాచార్యులు - క్రీ.శ. 1600 అలభ్యము
జాంబవతీ కల్యాణము - కాళాధరకవి క్రీ.శ. 1600 అలభ్యము
మైరావణ చరిత్ర (లేక) హనుద్విజయము - పోలుమంచి బసవన క్రీ.వ. 1600
ఆదిలక్ష్మీ విలాసము - వేటూరి భావమాత్యుడు క్రీ.శ. 1600
విష్ణుభక్త విజయము - చక్రవర్తి రాఘవాచార్యుడు క్రీ.శ. 1620
శశిరేఖా పరిణయము - శేషము చెన్ను భట్టారకుడు క్రీ.శ. 1690
శ్రీనివాస విలాసవధి - శ్రేష్టలూరి వేంకటార్యుడు క్రీ.శ. 17వ శతాబ్దం
అర్చిరాది ప్రబంధము - వేల్పుకొండ సింగరాయాచార్యుడు క్రీ.శ. 17వ శతాబ్దం
తత్వార్థ దర్పణము - అచ్చిరామానుజాచార్యులు - క్రీ.శ. 17వ శతాబ్దం
ఆత్మానందరసమంజరి - శేషదాసు తిరు వేంగళాచార్యుడు - 17వ శతాబ్దం
విష్ణుమాయా విలాసము - కంకంటి నరసింహకవి క్రీ.శ. 1670
రామాయణము - చౌడ రాఘవరెడ్డి క్రీ.శ. 1780 ధమ్మారావు పేట
ముప్పార్థ వైభవము - అనంతకవి గోవర్ధనము క్రీ.శ. 1794

మొదలగు కావ్యములు ద్విపదలుగా రచించి కవులు వాసికెక్కిరి. ఇంతటి చరిత్ర గల్గిన ద్విపద బహుళ వ్యాప్తి చెందినది. వీటినన్నింటిని బట్టి ద్విపద కావ్యములను ఈ క్రింది విధముగా వర్గీకరింపవచ్చును.

పౌరాణికములు, వంశకీర్తనలు, కావ్య ప్రబంధములు, కల్యాణాత్మకములు, క్షేత్ర మాహాత్మ్యములు, వ్రత మాహాత్మ్యములు, భక్తి ప్రబోధాత్మకములు, తాత్వికములు, చారిత్రములు, చిత్రాఖ్యానములు. ఇట్లు ద్విపద కీర్తి ప్రతిష్టలను పొంది దేశము నలుమూలల వ్యాప్తి పొందినది. ఇవే కాక శైవ సంబంధ ఇతర సంబంధ ద్విపదలును అనేకములున్నవి. రామాయణార్థ ప్రతి పత్తికై వైష్ణవ సిద్ధాంత ద్విపదలు మాత్రమే పేర్కొనబడినవి.

---

**1. ఉత్తర హరిశ్చంద్రీయము (ద్విపద) 4వ ఆశ్వాసం - పుట 141, 142 - గార్ల దిన్నె సుబ్బారావు (క్రీ.శ. 1910 ఆదోని 1936)**

# తృతీయ ప్రకరణము

# రంగనాథ రామాయణము, ఏకోజీ రామాయణముల కాలము నాటి సాంఘిక, మత రాజకీయ పరిస్థితులు

రంగనాథ రామాయణము పురాణ మార్గమున నడచి, కథాకథన పద్ధతి యందు ప్రధానముగ దేశీయ పద బాహుళ్యముగను, సర్వజన సుబోధకముగను రచింపబడినది. ఇందలి కవితా శిల్పమును గ్రహించినచో పారాయణ యోగ్యతను కల్గియున్నదని చెప్పవచ్చును.

## ఏకోజీ రామాయణ రచనకు దారి తీసిన పరిస్థితులు :

మధుర, తంజావూరు, పుదుక్కోటలో తెలుగు ప్రధాన భాష కాకపోయినను తెలుగు సాహిత్యము వర్ధిల్లుటకు గల పరిస్థితులు చారిత్రక కారణమే. పదునాల్గవ శతాబ్దంలో విజయనగర సామ్రాజ్య స్థాపన జరిగిన పిమ్మట దక్షిణ భారత దేశము అధికభాగము ఆంధ్ర రాజుల వశమైనదని చెప్పవచ్చును. ఆ ప్రాంతములో శ్రీ కృష్ణ దేవరాయలు తెలుగు నాయకులను పరిపాలకులుగా నియమించుకొనెను. ఈ నాయకులు తాము జీర్ణించుకున్న తెలుగుభాషా సంస్కృతులను తమ పరిపాలన క్రిందనున్న సంస్థానములలో వ్యాప్తి నొందించిరి. పదహారవ శతాబ్ది మధ్య కాలములో విజయనగర సామ్రాజ్యము పతనమైన పిమ్మట అచ్చటి పాలక నాయకులు స్వతంత్రమును ప్రకటించుకొనిరి. కావున మధుర, తంజావూరు, పుదుక్కోట వంటి ప్రాంతాలు ప్రత్యేక రాజ్యాలుగా ఏర్పడినవి. [1]

ఈ రాజ్యములు తెలుగు భాషకు, వికాసానికి, భాషా ప్రక్రియలకు, రంగస్థలములకు నిలయమైనవి. ఈ రాజులు వారి ప్రాంతములలో కవులను పోషించి, గ్రంథములను స్వీకరించినారు. చాలా మంది రాజులు స్వయముగా కృతికర్తలు, కృతి

1. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - నిడుదవోలు వేంకటరావు - పుట - 89 - 1978

భర్తలుగా తెలుగు వాఙ్మయమునకు సేవ చేసినారు. కావుననే ఈ కాలము చరిత్రలో ప్రత్యేక స్థానమును నిలుపుకున్నది. వీరి కాలములో గ్రంథ రచనలు సమగ్రమై సారస్వత ప్రియులకే గాక చారిత్రక పరిశోధనలకును మిక్కిలి ఉపయోగకరముగా వున్నవి. శ్రీకృష్ణ దేవరాయల కాలము ప్రబంధ యుగముగాను, స్వర్ణయుగము గాను వాసిగాంచినది.

దక్షిణాంధ్ర యుగములో ప్రబంధములేగాక యక్షగాన, నాటక, వచన, గేయరచనలు వెలువడినవి. ఈ రచనలను చతుర్విధ కవితలుగా విభజించిరి. అవి ఆశు, మధుర, చిత్ర మరియు విస్తర అనునవి. తంజావూరు నాయకరాజుల కొలువులోనున్న రచయిత్రులు కూడ మిక్కిలి నేర్పరులు. రఘునాథుని కాలములో రామభద్రాంబ, మధురవాణి, విజయరాఘవుని సభలో రంగాజమ్మ, కృష్ణమాంబ, ముద్దుపళని, మొదలగు కవయిత్రులు కొలువుదీరి యుండిరి. రాజకీయదక్షులైన తెలుగు రాజులు స్థిరపడినవారై, భాషా సంస్కృతులను పోషించుటచే కవులు రచనలు చేయగలిగినారు. మధుర కవితకు చెందిన యక్షగానములు దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయములో ప్రత్యేకతను సంతరించుకున్నవి. ఆనాడు ఉత్తరదేశములో కన్న దక్షిణ దేశములోనే నృత్యసంగీతాదులు పోషించబడినవి.

ఈ కాలములో వ్యావహారిక భాషా పదములు, రూపసాధనములు వ్రాయబడినవి. యక్షగాన, నాటకములందు పాత్రోచిత భాషను ఉపయోగించియున్నారు. ఈ కాలములోను కొంత శృంగార రచన యధికమైనదని చెప్పవచ్చును. దీనికి కారణము ఆనాటి ఆర్థిక, రాజకీయ పరిస్థితులు బహుమెరుగుగా యుండుట. ఆనాటి పోషకుల, ప్రజల ఆదరాభిమానములే ముఖ్యకారణము. చంద్రుని లోని మచ్చవలె యిది క్రొత్తది కాదు. ఉచితానౌచిత్యములను గుర్తెరిగి తత్పూర్వ కవుల పోకడలను గ్రహించి సంప్రదాయ సిద్ధముగా వర్ణించిరని గ్రహింపవచ్చును. నేటికినీ దక్షిణ దేశములో 80 లక్షల మంది తెలుగువారున్నారు.[1]తెలుగు వారు తమిళ దేశమును సుమారు 300 సంవత్సరములు పాలించిరి. అప్పుడు భాషా సంస్కృతులను చిరస్థాయిగా నిలుపుటకు తోడ్పడిరి. పుదుక్కోట సంస్థానపు కోటపై జెండా యందు "శ్రీబృహదంబా సహాయం' అన్న తెలుగు లిపిలోనున్న వాక్యము గలదని నిరూపించిరి.

---

శ్రీ కె.యస్. కోదండ రామయ్య గారు మదరాసు అసెంబ్లీనుద్దేశించి చేసిన ఉపన్యాసము.

నాయక రాజుల తర్వాత తంజావూరు పాలించిన మహారాష్ట్రులు నాయక రాజులు పోషించిన తెలుగు భాషా సంస్కృతులను చెక్కుచెదరకుండ నిలిపిరి. ఆదేశము తమిళ ప్రజా సంబంధమైనను తెలుగును మిక్కిలి ఆదరించిరి. అభివృద్ధి పరిచిరి.[1]

తొలిసారిగా తెలుగును అధికార భాషగా ప్రకటించిన ఘనత తమిళులకే దక్కినది. వీరు శాసనములలో కూడా తెలుగు భాషనే వాడిరి.[2]

## జాతీయ సమైక్యత - భాషా సమైక్యత :

తమిళ ప్రజలు ఇతర భాషలను ఆదరించినందున తెలుగు, తమిళ, మరాఠి భాషలు సంఘటింపబడినవి. ఈ మూడు జాతుల వారే గాక కన్నడిగులు, హిందీవారు కూడా తంజావూరులోనే యుండి గ్రంథములను రచించిరి. ఇవియేగాక యావద్భారత భాషయైన సంస్కృతము పోషించబడి, సంస్కృత ప్రసంగములు జరిగినవి.

విశ్వసాథ నాయకుని స్థానాపతి రాయ వాచకములోని యీ క్రింది విషయములను గ్రహించనగును. శ్రీకృష్ణదేవరాయల కాలము క్రీ.శ. 1509 - 1530లో నాగమ నాయకుడు, విశ్వనాథ నాయకుడీ రాజ్యమును జయించిరి. రాయలు ఆ రాజ్యానికి విశ్వనాథ నాయకుని కధికారము గట్టబెట్టెను. నాటి నుండి మధుర (పాండ్య దేశము)లో రాజ్య వంశమంతరించి తెలుగు నాయకుల పాలన మారంభమైనది.

విశ్వనాథ నాయకుడు రాయలవలె తెలుగు భాషా సంస్కృతులను బాగుగా పోషించి, కావ్యరచనను ప్రోత్సహించెను. మధురలో ఆనాడే వచన రచన బయలుదేరెను.

కుమారధూర్జటి కృష్ణరాయ విజయములో ఆనాటి ఘనతను చాటిన పద్యములు కొన్ని.

క॥ విజయనగర జనపాలుడు
విజయపురి గోలుకొండ వీరులతోడన్
గజపతిని నాడి గెలిచిన
విజయుడౌ కృష్ణరాయ వీరుని చరితల్

1. దక్షిణదేశాయాంధ్ర వాఙ్మయము - పుట 13, 1978, నిడదవోలు వెంకటరావు
2. ది మరాఠా రాజాస్ ఆఫ్ తంజావూరు డా॥ కె. ఆర్. సుబ్రహ్మణ్యామ్ 1929 పుట 34
3. ది మరాఠా రాజాస్ ఆఫ్ తంజావూరు డా॥ కె. ఆర్. సుబ్రహ్మణ్యామ్ 1929 పుట 35

క॥ రాయలకు రాజనీతు
నాయుడు నప్పాజీ చెప్పినవి యన్నియు దా
బాయక మనసున నునిచిన
రాయసములు వ్రాయ జదువ రసికత గలుగన్ [1]

అని రాయల నాటి విశేషములను వివరించెను.

"ముద్దళగిరి విజయము" [2] అనునొక చాటుకృతిని రచించెను. అందు తూర్పు మాలిక, పడమటి మాలిక, ఉత్తరపు మాలిక అను శీర్షికలలో నాలుగుపెద్ద ఉత్పలమాలికలున్నవి.[3] మొదటి ఏకోజీ తంజావూరిపై దండెత్తి వచ్చినపుడు ముద్దళగిరి ఏకోజీని ఓడించిన సందర్భమున అతని జయసూచకముగ గణపవరపు వెంకటకవి ఈ ఉత్పలమాలికలను రచించినారు.

ఉదాహరణమునకొక పద్యము :

ఉ॥ పోటిరినంటతా సహజీ పుత్రుడొకానొక నాడు దూరుపుం
బేటజేరి తంజపుట భేదన మండలి విష్ణుచక్రపుం
గొటకులగ్గ లెక్కుమది గోరి కఠోర వజీర కోటికిన్
హాటక టంకముల్ బిరుదులైన సరాలు వరాలు మాడలె
ర్పాటుగ గేడెముల్ మెఱుగు బట్టెసముల్ జగదాళ్ నెఱాజిరాల్ [4]

గీ॥ అనుచునేకొజీ భూపాలుడను దినంబు
మెచ్చి ముత్తెపుకుచ్చు నీకిచ్చు సభను
కలితగుణపేటి యాశ్రిత కల్పవాటి
భావజుని ఘటి ముద్దుమంగావధూటి [5]

అని యుండుటచే తెలుగు కవులకును, కవయిత్రులకు, అపార గౌరవమున్నదను భావమును పై పద్యము వ్యక్తీకరించినది.

వాఙ్మయమునకు విజయనగర సామ్రాజ్యపు రాయల కాల మెటువంటిదో, తంజావూరి, రఘునాథ నాయకుని కాలమట్టిది. మహారాష్ట్ర రాజుల పాలన శివాజీ

---

1,2,3,4,5. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - నిడుదవోలు వెంకటరావు - పుట 328 - 1978

కాలమెట్టిదో, మధుర నాయకుల కాలమున విజయరంగ చొక్కనాధుడు (క్రీ.శ. 1706 - 1782) పరిపాలనా దక్షుడు. కవిపండిత పోషకుడు. ఇతని కాలమునందు గద్యరచనా సంప్రదాయమున, ఆంధ్ర వాఙ్మయమునకు శ్రీకారము చుట్టబడినది.

దక్షిణాంధ్ర దేశము సర్వమత సమాదరణ కలిగియుండెను. ఎన్ని దండయాత్రలు జరిగినను తెలుగు వాఙ్మయము వికాసదశలోనే యుండెను. దీనిని బట్టి తెలుగు మీద వారికి గల అభిమానము తెలియగలదు. ఇట్లు ఏకోజీ కవిరాజు కాలమునకు కొంత పూర్వము క్రీ.శ. 15వ శతాబ్ధమున పురాణ రచనము సన్నగిల్లి, వచన రచన విజృంభించుట సంభవించినది. తెలుగు వచనమున రచింపబడిన పురాణములలో చాలభాగము దక్షిణదేశముననే వెలసినవి.

విజయనగర సామ్రాజ్య పతనానంతరము మధుర, తంజావూరు, పుదుక్కోట మొదలగు ప్రాంతములందు తెలుగు రాజ్యములేర్పడినవి. ఆయా ప్రాంతములందు స్థానిక భాష తెలుగు కాకపోయినను తెలుగు రచయితలు. తెలుగు అభిమానులు పెక్కుమంది నివాసమేర్పరుచుకొనిరి. వారు చాలాకాలమాంధ్ర దేశమును వీడియుండుటచే వారికి కఠినములును, దీర్ఘములును నగు గ్రంథములు గాక, సరళములును, సంక్షిప్తములును నగు రచనల యావశ్యకత యేర్పడినది. [1]

దక్షిణ దేశాయాంధ్రులు పురాణములనభిమానించుటకు కారణము వైదిక సిద్ధాంతములపై వారికి గల విశ్వాసమనియే చెప్పవచ్చును. ఇట్టి పురాణములన్నియు వైదిక కర్మలగు యజ్ఞయాగాదులను, వర్ణాశ్రమ ధర్మములను బోధించునవిగా నుండి శైవ వైష్ణవ విపరీత సిద్ధాంతములను నిర్మూలించి, వానిని సమన్వయ పఱచుటయే ప్రధానోద్ధేశ్యముగా నుండెను.[2] దీనిని బట్టి తెలుగులోని పురాణ, ఇతిహాసాదులు తెలుగు వచనములో వ్రాయబడినదీ కాలములోనేనని స్పష్టమగుచున్నది. ఏకోజీ పరిపాలన తరువాతయు రాజకీయ, మత, సాంఘిక, సారస్వతములు ఈ విధముగనే కొనసాగినవని తెలియుచున్నది.

---

**1-2. వచన వాఙ్మయము - ఉత్పత్తి వికాసములు - ఆచార్య ఎం. కులశేఖరరావు - పుట 580**

డా. ఎం. పద్మకుమారి

## రంగనాథ రామాయణము - ఆనాటి రాజకీయ పరిస్థితులు :

ఆనాటి రాజులు పండితులను, కళావేత్తలునైన ఉత్తమ గురువులను నియమించి తమ పుత్రీ, పుత్రులకు విద్యాబుద్ధులను నేర్పించెడివారు. అందుకే నాటి రాజోత్తములు కవిరాజ శ్రేష్ఠులుగా పేర్గాంచినారు. నన్నెచోడ, కృష్ణదేవరాయ, రఘునాథనాయక, ఏకోజీ వంటి రాజకవీంద్రులు ఉత్తమోత్తమమైన గ్రంథ రచనలు గావించినారు. అట్లే గోనబుద్ధ భూపతియును విద్వాంసుడై, కవియై పండితుడై రామాయణ మహాత్కావ్యమును దేశీయమైన ద్విపదలో రచించియున్నాడు. [1]

గోన వంశీయులలో కొందరు వైష్ణవ మతావలంబికులు, మరికొందరు పరమ వైష్ణవులు. రాయచూరి శాసనము నందు గోన గంగయరెడ్డి 'రాజ్య రక్షామణి' యని చెప్పబడిన విఠలనాథుడు వైష్ణవుడు, విష్ణుభక్తుడు, శ్రీశ్రీమన్నారాయణ దివ్యశ్రీపాద పద్మారాధకుడు, కర్తృ, భర్తలైన బుద్ధ, విఠలక్ష్మాపాలురు విష్ణుభక్తి తత్పరులనుటకు రామాయణమే సాక్ష్యము. ఆదియందు శ్రీ కామినీ నాథుడు, అంతమున రంగనాథుడు కీర్తింపబడినారు.[2]

ఉత్తరకాండ కర్తలును కులస్వామియగు విష్ణువును గొలిచియే కావ్యమారంభము గావించినారు. వీరుకూడ విష్ణుమూర్తినే యిలవేల్పుగాను, వైష్ణవ సంప్రదాయమునకు రంగనాథునే ప్రధాన దైవముగాను ఆరాధించినారు. గోనవారి వంశ ప్రస్తావనము గల శాసనములందు వర్ధమాన పురము[2], రాయచూరు, బూదపురములను గ్రామములు పేర్కొనబడినవి. వర్ధమానపురమే వ్యవహారముబడి వడ్డెమానుగాను, బుద్ధపురము బాద్‌పూర్, బూత్‌పూర్‌గాను వ్యవహరింపబడుతున్నవి. ఈ పేరుగల ఊరు పాలమూరు జిల్లాలో జడ్చర్లకు 12 మైళ్ళ దూరములో గలదు. ఇచ్చటనే నొక కొండ గలదు. ఆ కొండపైనొక రంగనాథ దేవాలయమున్నది. దీనినే కొందరు గోవిందస్వామి ఆలయమని వ్యవహరించుచున్నారు. దీనిని బుద్ధారెడ్డి కూతురు కుప్పాంబిక భర్త చనిపోయిన పిమ్మట ఒక దేవాలయమును నిర్మించి, తన భర్త గుండయ పేర లింగ ప్రతిష్ఠ చేసినట్లు శాసనము నందున్నది. కావున వీరి వంశస్థులు రంగనాథుని ఇలవేల్పుగా భావించిన వైష్ణవులని తెలియనైనది.

---

1. ఆంధ్రసాహిత్య సంగ్రహ చరిత్ర - వారణాసి వేంకటేశ్వర్లు - పుట 123
2. ఆంధ్ర సాహిత్య వికాసము - డా॥ పి. యశోధారెడ్డి - పుట - 143
3. ఆంధ్రకవి తరంగిణి - రాయచూరు శాసనము - గోనగన్నారెడ్డి రాజధాని

శ్రీ ఆరుద్ర గారి అభిప్రాయము ప్రకారము "క్రీ.శ. 1294 లో వేయించిన రాయచూరు శాసనములో గోనగంగయరెడ్డి రాజ్యరక్షామణి విఠలుడే రామాయణ కర్త తండ్రి విఠల భూపతియని "విసరగండ" బిరుదునాధారముగాకొని ఇతని 25 సంవత్సరముల కాలములోనే శాసనము వేయించినచో రామాయణ రచనా కాలము 1294 + 30 = 1324 అని చెప్పవచ్చును. [1] ఈ కాలమున రాజకీయముగా అల్లరులైనాయి. అవి ప్రతాపరుద్ర చక్రవర్తి అస్తమించినను శాంతింపలేవు. ఢిల్లీ సుల్తానుల బెడద తప్పి, కాపయనాయకుడు శాంతపర్చిన కాలము క్రీ.శ. 1340 ఇదే రామాయణ రచనా కాలము కావచ్చును.[2]

నన్నెచోడ, పాల్కురికి, మల్లికార్జున పండితారాధ్యుడు మున్నగు శివభక్తి తత్పరులు శైవమత ప్రచారమును దృష్టినందుంచుకొని రచనలు చేసినారు. అట్లే రంగనాథ రామాయణము వైష్ణవ మత వ్యాప్తికై రామానుజ మతస్థుడైన బుద్ధ భూపతి చేత విష్ణు పారమ్య బోధకమైన వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణము ననుసరించి వ్రాయబడినది.

ఇది ఆనాటి సామాజిక చారిత్రక పరిస్థితులకు నిదర్శనమనవచ్చును. విష్ణు ప్రసాదమున లభించిన శ్రీరంగనాథ విగ్రహమును యిక్ష్వాకులు మొదలుకొని సూర్యవంశరాజులందరు ఆరాధించిరి. శ్రీరాముడు దానిని విభీషణునకొసంగగా తరువాత నది ఉభయకావేరి మధ్యమున నెలకొన్నది. అదియే శ్రీరంగము.[3]

రంగనాథ రామాయణములో ఆనాటి రాజుల బహు భార్యాత్వము గ్రహింపనగును. మూలము నందు "అర్ధసప్తశతాప్తత్రదదర్శాన్యావిమాతర్త"[4] అని యున్నది.

దశరథునికి 350 మంది భార్యలనియు (కౌసల్యతో పాటు అంతఃపుర స్త్రీలతో సహా) అని శ్రీరాముని వనవాస సందర్భమున పేర్కొన్నాడు. ఇట్టి విషయాన్ని బట్టి నాటి సాంఘిక పరిణామమును గ్రహింపవచ్చును.

---

1. సమగ్ర ఆంధ్ర సాహిత్యము - ఆరుద్ర - సంపుటము 3 పుటలు 224, 225
2. సమగ్ర ఆంధ్ర సాహిత్యము - ఆరుద్ర - సంపుటము 3 పుటలు 224, 225
3. వాల్మీకి రామాయణము - అయోధ్య కాండము - సర్గ - 20 శ్లోకము - 14
4. వాల్మీకి రామాయణము - అయోధ్య కాండము - సర్గ - 42, శ్లోకము - 36 (పశ్చిమోత్తర ప్రతి)

దశరథుడు యాగము చేసినపుడు ఋత్విజులకు అయోధ్య తప్ప, తక్కిన దేశాలు దానము చేసినాడట.[1] దీనిని బట్టి అనాటి దాన విశేషములు బోధపడును. పాయస పంపకములోని విషయము గమనించగా

"................................ - అమర నిర్మితమైన యాపాయసంబు
సగము కౌసల్యకు, సగములో బుచ్చి - సగము సుమిత్రకు, సగములో సగము
కైకకు నిచ్చి యుత్కంఠనాసగము - ప్రాకటంబుగ సుమిత్రకు నిచ్చెమఱియు"[2]

దీనినిబట్టి ఏ భార్య కెంత భాగము చెందవలసినదో లెక్క ప్రకారముగా విభజించినాడు దశరథుడు. ఈ విషయమునాటి రాజతత్త్వమును స్పష్టపర్చుచున్నది. ఈ ఆలోచనలో రాజకీయపు టెత్తుగడలు గలవు. కైకేయి పుత్రుని రాజును జేసెదనని దశరథుని మాట. రాజ్యాధికార సమస్య వచ్చినపుడు తగవులొచ్చునని తలచియే దశరథుడు పాయసములోని సగభాగము కౌసల్య కిచ్చెను. కావున సంతానములోని బలవంతుడు కాకపోవచ్చును. అంతేగాక తనమాట నిలుపుకొనవలెననిన లోకమొప్పవలెను. కైక కుమారునికి రాజ్యభారమప్పగించుటకు మంత్రులు, ప్రజలు, పురోహితులు ఒప్పుకోక పోవచ్చును. కైకేయికి వరములిచ్చి నాడను రాజకీయపుటెత్తు మహారాజకీయ వేత్తలను సైతము తలయూచునట్లు చేయుచున్నది.

శ్రీరామజన్మ తిథి నందు మూలమున లేని 'బుధవారము'ను రంగనాథ, ఏకోజీ రామాయణ కర్తలు పేర్కొనుట గలదు. అట్లే శ్రీరామాయణము, భాస్కర రామాయణములందును బుధవారమనియే యున్నది. కాబట్టి వైష్ణవులకు తిరు నక్షత్రముపైగల విశ్వాసము 'తిరుమకనార్' అనుటయు నొక్కటియే మొల్ల "భాను వాసరమ"ని సూర్యవంశ స్థితిని బట్టి చెప్పెనేమో?

వాల్మీకి రామాయణమున దశరథుడు అరవై వేల యేండ్లు బ్రతికినట్లున్నది.[3] ఇది రంగనాథ రామాయణమున యథాతథముగా గ్రహింపబడినది.

"అఱువది వేలేడు లవని బాలించి - తఱిదప్పిముదిసి యాతని గంటినేను"[4]

---

1. రంగనాథ రామాయణము - బాలకాండ - 440 - 442. రాయలు అండ్ కో
2. రంగనాథ రామాయణము - బాలకాండ - 512 - 514 రాయలు అండ్ కో
3. వాల్మీకి రామాయణము - బాలకాండ - సర్గ 20, శ్లోకము 10
4. రంగనాథ రామాయణము - బాలకాండ - 636 రాయలు అండ్ కో

అని యున్నది. శ్రీరాముని వనవాస ఘట్టమును గూర్చి వివరించినపుడు మూలములో 12-13 సంవత్సరముల బాలుడనియు తెలియుచున్నది. మారీచుని వెంబడించునపుడు 25 సం॥లుగా తెలియుచున్నది. ఈ రెండవ విషయము రంగనాథ రామాయణమున గ్రహింపబడినది.

'ఎలమిమైై యిరువది యేను వత్సరము -లలరి పెంచితి నిన్ను నఖిలంబు నెఱుగ'[1]

ఇచట తల్లిదండ్రులు తనయుల వయోనిర్ణయాధికారమును ప్రకటించుచున్నది. రాముడు సుబాహు, మారీచులను హతమార్చునపుడు ప్రయోగించిన అస్త్రములను వివరించు సందర్భమునుబట్టి రంగనాథ రామాయణ కాలమునాటి యుద్ధ పరికరములు తెలియగలవు.

"అటిముటి రఘురాముడగ్ని బాణమున - నురక సుబాహుని నురమేసి చంపె
దక్కిన రాక్షస దళముల నొకట - జక్కాడే మనావ శర మహత్వమున"[2]

పై విషయమునననుసరించి శ్రీరాముడు మానవ మాత్రమున జన్మించిన పురుషోత్తముడని పేర్కొనబడినది.

"పుడమిలో నా కీర్తి పాలుపొందుననుచు"[3]

అని వివరణ శ్రీరామునకును, గోనబుద్ధారెడ్డి కీర్తికిని వర్తింపనగును. రామాయణ రచన వలన తన కీర్తి పుడమిపై నిలుచునని భావించి రచించెను.

అందరు మెచ్చే నూతనత్వమును చూపిన కవి ప్రతిభ మెచ్చతగినది.

"పురుష పురాకృత పుణ్యంబు వలన - దొరకొన్న విఘ్నంబు ద్రోచియే తెంచు
వెరపున నారాజు వెనుకనే తెంచి - ................................"[4]

అని చక్కగా వివరించినారు.

---

1. రంగనాథ రామాయణము - అయోధ్య కాండ - 470, రాయలు అండ్ కో
2. రంగనాథ రామాయణము - బాలకాండము - 901 - 911 రాయలు అండ్ కో
3. రంగనాథ రామాయణము - బాలకాండము - 1303 - 1315 రాయలు అండ్కో
4. రంగనాథ రామాయణము - బాలకాండము - 1318 -1319 రాయలు అండ్ కో

"పేదవానికి దొరికిన పెన్నిధి" వలె జనక మహారాజునకు సీతాదేవి దొరికినదట. జనకుడు యాగము చేయదలచి పుడమిని శుద్ధిచేయ నాగలిపట్టి దున్నసాగెను. అట్టి మందసమున సీత దొరికినదట. ఆ విషయాన్ని పరికింతము.

"మందసంబున రాగమదినుచించి చూచి - మందసంబును నేను మమత దీయంగ నతి వైభవంబుగా నందులోనతడు - .............................."[1]

ఇది నేటి ధననిధివలె గోచరించును. ప్రాచీన కాలములో నిక్షేపము గావించిన నిధి కొంత కాలమునకు బయల్పడుట తథ్యము. అలాగే మూల విధేయమైన సీతా వృత్తాంతమును సీతా నామకరణమును గ్రహించినచో నది నాటి హల ప్రభావ వృత్తాంతమగునే దప్ప విశేషముగా నేరదు. భరత శత్రుఘ్నులు మాతామహుల గృహమునకు పోవునపుడు, వారి మేనమామయగు యుథాజిత్తు మేమయల్లురను తీసికొని పోవు సందర్భమును చూడండి.

"ఒకనాడు దశరథుండు చితమెఱింగి - ప్రకటిత శుభరతు భరతునీక్షించి"[2]

వీరి ప్రయాణ, రాజగృహ, నివాస, విద్యాదులను గురించి కొన్ని ప్రధాన విషయములనిట పరిశీలింతము.

1. భరతుడు మాతామహుల ఇంటికి ప్రయాణమైనపుడు దశరథుడు బుద్ధులు గరిపి 'విద్యల నభ్యసింపుడ"ని చెప్పుట.

2. భరతుని ప్రయాణ సన్నాహములు

3. మనుమల రాక నెఱింగి, మాతామహులు తమ కేకయ రాజపురమును అలంకరింపచేసి, మనుమలను మహావైభవముగా తోడ్కొని వచ్చుట.

4. భరత శత్రుఘ్నులు పురోహితుడైన గార్గేయుని చెంత అస్త్రశస్త్రాది విద్యలను అభ్యసించుట.

5. విద్యాభ్యాసానంతరము భరతుడు తన తండ్రికి బ్రాహ్మణోత్తముని ద్వారా తమ క్షేమమును పితృదర్శన అభిలాషను వ్యక్తీకరించుట.

---

1. రంగనాథ రామాయణము - బాలకాండము - 1857 -1860 రాయలు అండ్ కో
2. రంగనాథ రామాయణము - బాలకాండము - 2430 -2457 రాయలు అండ్‌కో

ఇట్టి యేర్పాట్లు, అప్యాయతానురాగములు ప్రాచీన సాంప్రదాయమును జ్ఞప్తికి దెచ్చును.

మేనమామల బిడ్డలను పరిణయమాడు ప్రాచీన సాంప్రదాయము రంగనాథ రామాయణమున గోచరించుచున్నది. శ్రీరాముడు యుక్త వయస్కుడయి, విలు విద్యాదులను నేర్చిన పిదప పౌర, జానపద, మంత్ర, సామంతాదుల యంగీకారముతో పట్టాభిషేకము చేయ నిశ్చయించినాడు. ఈ వేడుక చూడ జనులు తండోపతండములుగా యేతెంచిరి. రాజపుత్రుల జూడ వేడుకతో వచ్చుట, చూచి ఆనందించుట మొదలగు విశేషములు ప్రాచీనతరమైనవి.

తన కుమారులు అడవి పాలౌదురని బాధపడు సందర్భమున దశరథుడు పల్కిన మాటలు.

"దైవంబులకు నైనదమ కర్మఫలము - భావించి కుడువక పాయరాదెందు"[1]

అని మానవకర్మలకు దైవబలమే కారణమని భావించుట యథార్థమైనది. నరుడు శుభాశుభకర్మముల నాచరించును. అవి జ్ఞాతములు, అజ్ఞాతములు ఏవిధమైనను గానవచ్చును. బుద్ధిపూర్వకము లేదా మనఃపూర్వకముగా వచ్చును. కాలాంతరమున పక్వదశకు వచ్చినపుడు ప్రతి కర్మమునకు ఫలితమేర్పడును. మానవుడా కర్మఫలముల అనుభవించక తప్పదు గదా! ఆ విషయమునే దశరథుడు వక్కాణించి యున్నాడు.

కవి గోనబుద్ధారెడ్డి శ్రీరాముని తేజోవిశేషములను భగవంతుని రూపమును సహస్ర భానుతేజములుగా వర్ణించినాడు. అతనిట్లు వర్ణించుట ముక్తి పొందుటకేయని తెలియుచున్నది.

'పదివేల కోటుల భానుతేజములు - పొదిగొన లోకముల్ పొదివినయట్లు
రాముని తేజమరణ్య భూజములు - భూమియు నభము నబ్దులు గప్పుటయును
జడమతులై సర్వ సంభ్రమంబుడిగి - మిడుకుచు కన్నులు మిఱుమిట్లు గొనగ
కడునంధులైన రాక్షసులను జూచి - కడకలో బల్కెనాఖరుడు దూషణుని
ఇది యేమి దూషణడేగి యీసేన నడవ - బెదిరెనో పరసేన యేర్పడెనో

1. రంగనాథ రామాయణము - అయోధ్యా కాండము - ద్విపద - 1195 రాయలు అండ్ కో

యనిన దూషణుడేగి యటజూచివచ్చి - దనుజేశ! రామునుద్ధండ తేజంబు
కలయ బర్వుటయు గతి దప్పెననుడు-నలుకయై ఖరుడు సైన్యముల దిట్టుచును"[1]

అని పదివేల కోట్ల సూర్య తేజసమానుడైన శ్రీరాముని జూచి, ఖరదూషణాదుల సైన్యము కండ్లు దిగిరి పడిపోయెను. దూరముననున్న సైన్యము దగ్గరకు రాలేకపోయినవి. అప్పుడు సైన్యము శ్రీరాముని జూచి బెదరెనో లేక (సైన్య సమూహము) అడ్డమైనందున రాలేకపోయెనోయని కవి చమత్కరించినాడు.అతిథి మర్యాదల విషయమునందు రంగనాథ రామాయణ కర్త సముద్రుడు శ్రీరామునకు చేసిన రాచమర్యాదలు, ఆభరణాలు వర్ణింపబడినవి. రామలక్ష్మణులు సొమ్ములను ధరించి సూర్యునివలె ధగధగ మెరుపులతో, నారవస్త్రములను కట్టి చంద్రుని వలె చల్లగా వుండి సూర్యచంద్రుల వలె నొప్పినారట.[2]

రంగనాథ రామాయణ కర్త రావణుని భార్యయైన మండోదరి సుగుణవతియని నిరూపించెను. దీనివలన ఆమె గుణశీలాదులు విశదమగును. భర్తకు హితవు జెప్ప సభకేతెంచినపుడు ఆమెను వర్ణించిన విధము.

'కడునొప్పునీల మేఘము జొచ్చు మెఱుపు - వడువున జొచ్చె రావణు సభాస్థలము'[3]

ఇట్లు మండోదరి రావణసభలోనికి మేఘమే లోనికి మెఱుపు తీగవలె జొచ్చుకొని వెళ్ళినది. ఆమె రావణుని సభను వీడిన సందర్భమున

"రమణీయ తరమైన రావణులక్ష్మి - క్రమమేది తొలగెడి కైవడి దోపి"[4]

ఇట్టి వర్ణన వలన ఆనాడు స్త్రీకి గల గౌరవ మర్యాదలు బోధపడుచున్నవి. రావణుని గుణశీలములను వర్ణించునపుడు 'సీతను దెచ్చి, రాముని చేతిలో చచ్చిముక్తి పొందాలని అవనిజను దెచ్చితినని'' కుంభకర్ణునితో చెప్పినపుడు రావణున్ని ముక్తి మార్గమునకు నడిపించినాడు.

"రణములోపల రఘురాముచే నీల్గి - ప్రణుతింప విష్ణుని పరమపదంబు
దక్కక పొందంగ దలచియేసీత - నిక్కంబు దెచ్చితి నింకేల దాప?"[5]

---

1. రంగనాథ రామాయణము - అరణ్యకాండము - 529 -536 రాయలు అండ్ కో
2. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - 1146 -1157 రాయలు అండ్కో
3. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - 3083 - రాయలు అండ్ కో
4. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - 3133 - రాయలు అండ్ కో
5. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - 3691-3692-రాయలు అండ్కో

ఇట్టి మాటలు రంగనాథ రామాయణములోనే యున్నవి. మూలమున లేవు. రావణుని, కుంభకర్ణుని కూడ మోక్షమార్గమున నడిపించి ముక్తి నొందెను.

రాక్షస ప్రవృత్తిలలోను భ్రాతృప్రేమకు తావున్నదని చెప్పకయే చెప్పుచున్నది. "అన్నా! రాక్షస కులము దగ్ధమైపోవునని నీతి చెప్పినను యతడు (రావణుడు) వినలేదు. ఇక లాభము లేదని, అన్నను విడిచి శ్రీరాముని శరణు పొందితిని" అని పలికి కన్నుల నీరు గమ్మగా మిగుల దుఃఖపడి కుంభకర్ణుని జూడజాలక దూరముగా పోయెను.[1] కవి యిచట సోదర ప్రేమను వివరించెను.

రావణాసురుడు పాతాళ హోమము చేయునపుడు వానరులు రావణుని యజ్ఞమును విఘ్నము చేయుట. రావణుడు మండోదరి నోదార్చుట, యుద్ధమునకు వెడలుట.[2] ఈ పద్ధతి లోకపు పోకడలను వివరించుచున్నది. సీతను గీతలు దాటవద్దని లక్ష్మణుడు సీతకు చెప్పిన తీరును గమనింతము. అంతటి ఆపద సమయము నందునను ఆదుర్దాపడకుండా సీతను రక్షించుట తన కర్తవ్యముగా భావించి చెప్పిన ధైర్యవచనములు బహుచక్కగా నున్నవి.

"ఎవ్వడేన్ బరుల్ నెసదాటి వచ్చు - నవ్వీరవరు తలలవియు నాక్షణమే"[3]

అని పర్ణశాల చుట్టూర వరుసగా ఏడు గీతలు గీసి "గీతలు దాటివచ్చిన వాని తలలు పగులుతాయని" చెప్పినాడు. దీనిని కవి లోకానుభవ పద్ధతిలో వివరించినాడు.

విఘ్నేశ్వరుని ప్రథమ పూజ దేవతల నుండి మానవుల వరకు పరంపరగా వచ్చుచున్నది, నేడు మానవులు ఏ పనిని ప్రారంభింపబూనినను మొట్టమొదటగా విఘ్న నాయకుడైన విఘ్నేశ్వరుని పూజించియే మొదలు పెట్టుదురనియు తెలియజేయు సందర్భము, సేతుబంధన ప్రారంభమున గణేశుని మదిలో తలచెననుట కవిలోక విధితమైన భావన.

"............శైల వృక్షావళి దెచ్చి - తోయధి గట్టనుద్యోగించిరపుడు
రామ చంద్రుండను రాజు గణేశు - దామది లోపల దలచి మ్రొక్కుచును"[4]

---

1. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - ద్విపద - 4056 - రాయలు అండ్ కో
2. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - పీఠిక - పుట - 18. వావిళ్ళ ప్రతి
3. రంగనాథ రామాయణము - అరణ్యకాండము - 935 వ ద్విపద - రాయలు అండ్ కో
4. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - ద్విపద - 990 - రాయలు అండ్ కో

అని శ్రీరామునిచే గణేశునికి ప్రణమిల్ల జేసినాడు. వారిధి నిర్మాణము నిర్విఘ్నముగా సాగవలెనని మ్రొక్కించినాడు. ఇది శుభకార్యములందు ప్రతి మానవుడు తప్పకుండా పాటించే నియమము యెంతో మనోహరముగా నున్నది.

రావణుడు రాజనీతితో, చతురోపాయములను అంగదునిపై ప్రదర్శించి తనవైపు త్రిప్పుకొనుటకు చేసిన ప్రయత్నము గమనింతము.

"వనచరాధమ ! యోరి ! వాలికి నీవు - తనయుండవైతేని ? దశరథాత్మజుని
గొలిచితింటవై కొలయీగవైతి - చలమున నీ తండ్రి జంపినాడతడు,
అట్టి రాముని గొల్చి అధమ వానరుడ! పుట్టి తింద్రజుగర్భమున వృథానీవు,
చంపిన పగవాని జంపక రాము - పంపుసేయుచు నిట్లు బంటవై తిరిగి
యెలమి గొల్చెద నన్న నీరాజేకాని - తలపోయ రాజులు ధరణిపైలేరె?
గొనకొని పగవాని గొలిచినవాని - నినుగాని యెవ్వరి నెఱుగమెన్నడును
నీమగటిమికిని నీదు పెంపునకు - సీమ వారెల్లరు సీయని నగరే
కొడుకైన పిమ్మట గులవైరమెల్ల వడితోడ నీగని వాడెట్టి కొడుకు ?"[1]

రావణుడు అంగదునికి శ్రీరామునిపై పౌరుషము కక్షను చిగుర్చుటకు పల్కినాడు. "శత్రుశత్రేన మిత్రః" అన్నట్లు నీవు రాముని చేరి నాపై యుద్ధానికి వచ్చితివి. నీ తండ్రిని చంపిన వానిని నీవు చేరదగునే? యని కఠోరమాటలు పల్కినాడు. అయినను అంగదునికి రాముని పైని భక్తి చెదరలేదు. తన తండ్రిని గూర్చి అంగదుడు

"కర్మ పంకములెల్ల గడతేరివాలి - నిర్మలాత్ముడు రామ నృపతిచేజచ్చి
పదపడి వైకుంఠ పదము గైకొనియె - నిది కీడుగా మమ్ము నెన్ననేమిటికి?"[2]

అని శ్రీరాముని మహిమను, వాలి కర్మను చెప్పినాడు.

శ్రీరాముడు సముద్రునిపై కోపగించి బ్రహ్మాస్త్రము ప్రయోగింపబోగా, అతడు భీతిల్లి రక్షింపుమని రాముని శరణు వేడెను. సాగరుని భార్యలు పతిబిక్ష పెట్టమని ప్రాధేయపడిరి. గంగాది నదులేకమై రాముని స్తుతించిరి. "అబ్ధీశుగాచి - శుభమతి

1. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - 2025 - 2030 - రాయలు అండ్ కో
2. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - 2049 - రాయలు అండ్ కో

మంగళ సూత్రముల్ నిలుపుమని"[1] ప్రార్థించిరి. శ్రీరాముడు గంగమోమును చూచి సముద్రుని వదిలి పెట్టినాడు.

రావణ వధానంతరము రాముడు, బ్రహ్మహత్యా దోషము నివారించుకొనుటకు రామేశ్వరసముద్రములో)న లింగప్రతిష్ఠ చేసి, దోష నివారణ గావించుకొనెను. కావున దోష పరిహారార్థము ఆలయ నిర్మాణము సరియైన ప్రాయశ్చిత్తముగా నేటికి సమాజములో కన్పించును.

"రావణుడు మోక్షమును గోరినీయెదుట రోచినాడు" అని బ్రహ్మచే పలికించినాడు బుద్ధ భూపతి హరిహరనాథ తత్త్వమును ప్రదర్శించినాడనవచ్చును. శైవ వైష్ణవులు వేరుగాదను సత్యమును నిరూపించినాడు. నేటికిని ప్రజలందరు తమతమ భేదములేక కాశీ రామేశ్వరములను దర్శించుచున్నారు. వైష్ణవ మతాభిమానమును మూలము గ్రహించి ఇరుమతాలలోను సామరస్యమును నింపినాడు. శ్రీ రామేశ్వరమును ప్రతిష్ఠించి రంగనాథుని సేవించుటచే రంగనాథ రామాయణమను నామధేయమునకు సార్థకత చేకూరినది. గోన వంశస్థులైన బుద్ధ భూపతి ఇలవేల్పు రంగనాథుడయ్యె. ప్రజలు, పండితులు, భక్తులు 'రంగనాథరామాయణము' యని పిలువగా నదియే ప్రసిద్ధమయినదేమోనని అనిపించును.

వైష్ణవాచారములు, దైవభక్తి యజ్ఞము, శివారాధన, పతిభక్తి మొదలగు గుణములు హరిహరనాథ తత్త్వ సంబంధమైనవి. పెండ్లి, ఆభరణములు, సంప్రదాయ పద్ధతులు, యుద్ధములు మొదలగునవి సాంఘికాచారములు. రాజకీయ - [illegible] ప్రజలకు రాజులపైగల భక్తి విశ్వాసములు, పన్నులు, దండ-యాత్రలు, సుఖ దుఃఖముల ప్రభావము మొదలగునవి సాంఘిక పరమైన, రాజకీయ [illegible] గ్రహింపనగును. కావున రచనాకాలము నాటికి వాని ప్రభావము కవులపై బడినది.

ఇచట మత, సాంఘిక, రాజకీయ, చారిత్రక, విషయములన్నియు ఒనగూడినవి. రంగనాథ, ఏకోజీ రామాయణములు ఆనాటి కాలపరిస్థితులపై నాధారపడి తమ రచనలను కొనసాగించినట్లు బింబ ప్రతిబింబములుగా ప్రస్ఫుటమగుచున్నవి.

---

1. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - 923 - 924 - రాయలు అండ్ కో

# చతుర్థ ప్రకరణము

# రంగనాథ - ఏకోజీ రామాయణములోని కథ, అవాల్మీకాంశముల సమన్వయము

**రంగనాథ రామాయణము :**

"ఆదికవీశ్వరుడైన వాల్మీకి - యాదరంబున బుఱ్ఱ్యలందఱు మెచ్చ
జెప్పిన తెఱఁగున శ్రీరామ చరిత - మొప్ప జెప్పెద కథాభ్యుదయమెట్లనిన"

అని వివరించిన విషయమును బట్టి ఆనాటి దేశ, కాల పరిస్థితుల నాధారమున కొన్ని అవాల్మీకాంశములను ప్రవేశపెట్టుట జరిగినది. అట్టి అవాల్మీకాంశములు కొన్ని:

**గౌతమాశ్రమ వృత్తాంతము :**

యజ్ఞ రక్షణార్థము విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంట నిడుకొని మిథిలా నగర ప్రయాణము, సగర వృత్తాంతము, గంగావతరణము, సాగర మథన కథ, మరుత్తుల కథ, వైశాలికుల వృత్తాతంములను వివరించి గౌతమాశ్రమమును చేరబోయిరి. ఆశ్రమావరణమును బరికించిన శ్రీరాముడు " మునీశ్వరా ! ఇంత రమణీయంబయ్యు నిర్జనమైనదీ వాటిక - కారణంబేమ"ని సందేహపడినప్పుడు గాధేయుడు ఇట్లు పలికెను.

"గౌతము డిక్కడగడు వేడ్క దొల్లి - యాతతనిష్టనహల్యతో గూడి
యతిఘోరతపము సేయగ నింద్రుడెఱిగి - యాతని తపంబు దానంతయు జెఱుప
మనము, జింతించి మఱియొక్కనాడు - ముని నిజానృష్ఠానమునకు బోవుటయు
గౌతమాకారంబు గైకొని వచ్చి - యాతని సతిన హల్యాదేవి గదిసి" [1]

అహల్యా గౌతములను గురించి, ఇంద్రుని మాయ రూపమును గూర్చి శ్రీరామునకు వివరించెను."కుక్కుటం బైపోయి కుటజంబు జేరి కొక్కొరోకో యని

1. రంగనాథ రామాయణము - బాలకాండ - పుట 57, ఆంధ్రవిశ్వకళా పరిషత్తు - 1942

కూయుట" రంగనాథుని ఊహాకల్పన, ఇంద్రుని మాయరూపమైన, గౌతమ వేషధారణము, ఇంద్రుడని యెఱిగియు, పర్ణశాల లోనికి పిలుచుటతో అహల్య శాపయోగ్యతను పొందినది.

"ఋతు కాలమనరు కోరిక గలవారు - మతిఁదలంప గఁబ్రాద్దు మణిచాలఁగలదు పొలతుక, ఋతుకాలమున ఁగ్రీడ సలుప - వలయుట, దలపోసి వచ్చితి" ననిన నెఱిగి యహల్య "నీ వింద్రుండ వగుట - యెఱుగుదునౌగాక, యిందు రమ్మ"నుచు జలజాక్షి తమ పర్ణశాలలోపలికి - బలభేది గొనిపోయి పరగ గ్రీడించె"[1] -నని కారణమును జూపెను.

గౌతముడాశ్రమమునకేతెంచి జూచి ఇంద్రుని భ్రష్టుడవగుమనియు, అహల్యను శిలవగుమనియు శాపమిచ్చెను. ఈ వృత్తాంతము వాల్మీకి రామాయణము నందులేదు. దీనికి కవి కాలమునాటి సాంఘిక ప్రభావము యుండి యుండవచ్చును.

ఏకోజీ రామాయణము నందు అహల్యేంద్రుల జారత్వము లేదు. ఆమె శాప విమోచనము మాత్రమున్నది. శ్రీరాముడు తాటకను వధించి తిరిగి అయోధ్యకు వచ్చునపుడు మార్గమధ్యమున గౌతమాశ్రమము జూచుట రాముని పాదము తాకగానే ఒక శిల సుందరాకృతి గల్గిన స్త్రీ అయినట్లు వర్ణింపబడివున్నది.

"గరిమతో రాగ మార్గంబున రామ - చరణ రేణువు సోకి శాపంబు మాని
నెలకొన్న చట్రాయి నెలతయై నిలిచి - ..........................................
.............................. - నెక్కువ నాపాపమేడ్తెరబాసె."[2]

ఏకోజీ అహల్య సౌందర్యమును మాత్రము తెల్పి, శాపమును ప్రకటించిన కారణము చూపలేదు. (బ్రహ్మదేవుడు అహల్యను విశిష్ఠ సౌందర్య రాశిగా సృష్టించినాడు. హల్యమనగా విరూపమని అర్థము. అహల్యమనగా వైరూప్యము లేనిదై, అతిలోక సుందరమైన రూపమును గలదను భావము)

ఇంద్రుని, అహల్యను ఒకచోట చూచిన గౌతముని కోపము శాపమునకు దారితీసినది.

---

1. రంగనాథ రామాయణము - బాలకాండము - పుట - 49, రాములు అండ్ కో - కడప
2. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 32, డా॥ ఎం. బాగయ్య 1993

"నడరి గౌతము డహల్యాదేవి జూచి - పడతి పాషాణ రూపము దాల్చియిచట
కరముగ్రమగు నెండగాలి, పెంధూళి - పొరలుచుండుము నీవు పాడగాన బడక"[1]

అని శపించెను. ఆ మాటలు వినిన అహల్య భయకంపితురాలై గౌతముని పాదములనంటి క్షమించుమని వేడుకున్నది. అప్పుడు కరుణార్ద్రియై గౌతముడు :

"వైకుంఠధాముడవాప్త కాముండు - లోక రక్షణ కళాలోల మానసుడు
రాముడైవచ్చి పురాణ పూరుషుడు - భూమిపై జనియించి పొగడదీపింప
............................................ - ఇనకులాధీశ్వరుడీత్రోవ వచ్చి
తొలగి పోవక నిన్ను ద్రొక్కిన జాలు - జలజ లోచన నీదు శాపంబు తీఱు"[2]

- అని దీవించినాడు. ఇట్టి కల్పన మూలములో లేదు.

గోనబుద్ధ భూపతి వాల్మీకి హృదయమును గ్రహించి, కొన్ని మార్పులతో రచన సాగించినాడు. గౌతముడింటిలోలేని సమయమున దేవేంద్రుడు గౌతము నాశ్రమమునకు వచ్చినట్లు వాల్మీకి చెప్పియుండెను. దానిని రంగనాథ రామాయణ కర్త ఎవ్వరికిని అనుమానము కలుగకుండునట్లుగా అర్ధరాత్రమున, గౌతమాశ్రమమున ప్రవేశించిన ఇంద్రుడు కోడివలె కొక్కొరోకో యని గూసి, గౌతముని బయటకు పంపెను. అనుష్టానములు, జపతపములు ముగించుకొనిన గౌతముడింకను తెల్లవారక పోవుట గమనించి తన తపశ్శక్తితో జూడగా యింటి యందలి దృశ్యము, ఇంద్రుని కపటబుద్ధి గోచరమయ్యెను. కోపమున ఇంటికి వచ్చి ఇద్దరిని శపించెను. ఇచట తెల్లవారినదను భావన కలుగుట గౌతముడింటి నుండి బయటకు వెళ్ళుటకై కుక్కుటము వలె కూయుట మూలమున లేని అంశమును గోనబుద్ధారెడ్డి గ్రహించెను. అహల్యను పాషాణము కమ్మని శపించినట్లు వాల్మీకి రామాయణములో కనిపింపదు.[3]

అహల్య శాప విమోచనమును గురించి ఏకోజీ ఇట్లు వచించెను.

"సారది నీపాదంబు సోకిన యపుడె - పరమ పతివ్రతా భరణంబునైతి
పాలిసె నా పాపంబు పాలిసె శాపంబు - ..............................
కరుణించు మీ వేళ కరుణాపయోధి - శరణాగత త్రాణ జయరామ చంద్ర"[4]

1. రంగనాథ రామాయణము బాలపుట 57, ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు 1942
2. రంగనాథ రామాయణము బాలపుట 58 ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 1942
3. ద్విపద రామాయణ భారతి - పుట 223, డా॥ జె.వి. సుబ్బారాయుడు - 1981
4. ఏకోజీ రామాయణము - బాలకాండ - పుట - 33, డా॥ ఎం. బాగయ్య - 1993

అని అహల్యచేత పల్కించెను. ఏకోజీ మూలమున లేని స్వతంత్ర భావమును ప్రకటించుకొనెను.

## స్వయంవరానికి ముందే సీత రాముని చూచుట

జనకుడు సీతా స్వయంవరమునకు శివధనుస్సును పదివేల మంది బలవంతులచే సభకు తెప్పించెనట. అయితే శివధనుర్భంగమునకై వచ్చిన అనేకమంది రాకుమారులలో రామలక్ష్మణులు కూడా ఉన్నారు. వారి తేజమును చూచిన జనకుడు, భటులు ఆశ్చర్యపోయినారు. రామలక్ష్మణులను చూచిన సీత చెలికత్తె సీతను చాటు నుండి వారికి చూడమని చెప్పినది.

శివ ధనుర్భంగమునకు ముందే సీత రాముని చూచినదట. జనక మహారాజు శివధనస్సును తెమ్మని పదివేల మంది బలవంతులను నియోగించెను. భటులు విల్లును వేదికవైపు కొని వచ్చుచుండ "జనకునంతః పురచారుతావారు పనివడి దాదులు పరతెంచి వేగ జానకీ నూర్మిళ జనకుని దేవి కానంగ జనుదెంచి"రట. అప్పుడే ఆమెకు (సీతకు) రాముని ప్రతాపము తెలిసినదట. చాల బరువుగల విల్లును తెచ్చుట కష్టము కనుకనే ఎందఱినో పంపుట - అట్టి దానిని శ్రీరాముడు విఱుచుట గొప్ప విశేషము.

"విల్లున్న మందస వేగ దెండనుచు - బల్లిదులగు వారి బదివేల బనిచె"[1]

అని ఈ విషయమున సీత గ్రహించినదని భావము. శివుని విల్లును రాముడెక్కు పెట్టుచుండగ కౌశికుడిట్లు వక్కాణించెను.

"అదరకు భూదేవి యాత్మలో నీవు - చెదరి చలింపకు శేషాహి, నీవు
కడక ధరింపుము కమఠేంద్ర, నీవు - కడునేమరకుడు దిక్పతులార, మీరు
గడగడవడకకు కమల బాంధవుడక - జడియకుడీ జంతు సంతతులార..."[2]

అని సీతతో సహా సకల ప్రాణులను భయపడరాదని ధైర్యము చెప్పెనట. అప్పుడే సీతాదేవికి రాముడు శివధనస్సును విఱుచునను భావన మనంబు కలిగినదట. కావున సీత మనః ఫలకముపై రాముని రూపము ముద్రింపబడినదని భావించవచ్చును.

---

1. రంగనాథ రామాయణము పుట, 74 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942
2. రంగనాథ రామాయణము - బాలకాండ - పుట 75 ఆంధ్ర విశ్వ కళాపరిషత్ 1942

## సీతాపహరణమున రామ విలాపము

సీతాపహరణానంతరము రాముడు సీతను వెదుకుచూ విలపించిన తీరు కళ్ళు చెమర్చక మానవు.

"వనజాక్షి జింతించి వగలు రెట్టింపఁ - దనమది శోకింప దైవంబుదూఱి
పోయితే సీత, నా బొందితో బాసి! - పోయితే నను బ్రాణములతోడడించి !
పోరి సురాసురలోక పూజార్హమనక - హరువిల్లు విఱిచితి నతివ నీ కొఱకుఁ
బరుని గాఁదలపోసి బ్రాహ్మణుడనక - పరశురాముని భంగ పఱచితిఁగడగి
నీరజలోచన, నీకునై పూని - యీ రెండు నిందల నేను గైకొంటి
కడపట నిను బాపె గష్టదైవంబు - పడతి, నిందల బడ బాలైతి నేను"[1]

అని రాముడు "నీకొఱకు హరువిల్లు విఱిచితిని, పరశురామునితో తలపడితిని, ఈ ...ందలు గలిగినను నీవు నిలువవైతివి. కట్టడి దైవము నన్నింత వానిని జేసినది. నా ...ణమును బాసిపోయితివి సీత, నన్ను బ్రాణములతో నుంచి వెళ్ళుట నీకే దగినదని ...లపించుట సహజముగానున్నది.

శ్రీరాముడు రావణాసురునితో యుద్ధము చేయునపుడు విల్లు ధరించి సంధించు ...సమయమున ఎడమచేయి వెనుకకు, కుడిచేయి ముందుకు సాచి యుండెను. ...ప్పుడు హస్తములే మాటలాడినట్లు చూపిన ఘట్టము అద్భుతముగా వర్ణింపబడినది.

...రగ ప్రత్యాలీఢ పాదుడై నిలిచి - మొరయంగ గర్ణాంతముగ నారిఁదివియ
...యుడా రాముడా పలిహస్తమంత - వెలుపలి హస్తాన (వినగ) నిట్లనియె
...వంది యేను ముందఱ నడువంగ - మనుజేశు మగుకు మగుడఁబోయెదవు
...వ గట్టను దొడు కొన బూయగాక - యెడపక యని నిల్వ నెవ్వరి తరము
...త్మసుత భోగ తలిబొందునపుడు - నీ రాజ్యమైయుండు నీరామునొద్ధ
...ని వలపలి హస్తంబునవ్వి - వెనుక దీయుట గాదు వినుము నీమాట
...ర నీయమ్మున నతివేగ చంప - వసుధీశునకు జెప్పబలెనని యేనుఁ
...జేరి విన్నవించెద నంచు దలచి - భువన రహస్యమై పోయితిగాక
...కేను వఱతునే యద్భుతంబుగను - ననుజూడు మింతలోననే రామచంద్ర"[2]

---

...రనాథ రామాయణము - అనుబంధము - 2 - పుట. 213. ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942
...రనాథ రామాయణము - అరణ్య కాండము - పుట 200 – ఆంధ్ర సాహిత్య కళా పరిషత్తు - 1942

## యుద్ధ సమయమున రాముని హస్తములు మాటలాడుకొనుట

రాముడు యుద్ధము చేయునపుడు హస్తములు మాటలాడి సమాధానములు చెప్పినవట. ఇది వాల్మీకి రామాయణమున లేదు. వెనుకనున్న దాపలి హస్తంబు దశరథునకు విషయము తెలుపబోయెనట. వలపలి హస్తము భువన రహస్యము చెప్పబోయెనట, భయపడిగాదు. అని సమాధానపడుట అద్భుతముగను కల్పనా చాతుర్యముగా గలదు.

## సీత లక్ష్మణుని నిష్ఠూరము లాడుట

మారీచుడు మాయా మృగము వేషధారియై శ్రీరామచంద్రుని దూరమునకు గొనిపోయి, రాముని బాణముచే హతుడై "హా లక్షణా ! హా సీతా !" యని యరువగా సీత భయపడి లక్ష్మణుని వెళ్ళి చూడుమని కోరెను. లక్ష్మణుడు వదినను "భయపడవలదు! నా అన్న కే కీడు రాదు" అని పలుకగా సీతాదేవి లక్ష్మణుని నిందించిన తీరు గమనింతము.

"సౌమిత్రి, యిది యేమి చందమో నేడు - రాముడు నిన్నార్తరవమున జేసె!
ననఘు! నీ వాపలుకాలించివినవో! - వినవొల్లవో! కాక వినరాదో నీకు !
అని నిష్ఠూరములాడెను. లక్ష్మణుడు సీతాదేవిని శాంతపరుచుటకై పల్కిని మాటలు.

"తల్లీ నీవేటికి దలకెదు రామ - వల్లభునకు గీడు వచ్చునే యెందు?[2]
అని పలికెను. సీత శంకించుచుండెను.

"భూపతి నిను నమ్మి పోయిన చోట - నీ పాపవర్తన యేల గైకొంటి!
వగు నెఱుంగుదు, రాముడ సురుల మాయ - దెగుట నిక్కముగాగ దెలిసి నీవర్ధి
ననుచిత మతి బూని యను మానముడిగి - ననుబొంద దలచేదో నాన పోవిడిచి
కాదేని గొనిపోయి "కైకేయి సుతుని - కాదట నొప్పింతు"నని తలంచెదవో!
యేను నాదగు జేపె మీ శరీరమున - బూనదలంచుట బుద్ధిగా దింక
దడయక పోయి గోదావరిలోన - బడి ప్రాణములు వాతు బలుకు లేమిటికి"[1]

---

1,2. రంగనాథ రామాయణము - అరణ్య కాండము - పుట 201 - ఆంధ్ర విశ్వకళా పరిషత్తు - 1942

అని నిష్ఠురముగా పలికినది. అప్పుడు లక్ష్మణుడు ఆవేశముతో రాఘవుని గొని వత్తునని పోయినాడు. వదినను రక్షింపుమన్న అన్నమాట ప్రకారము ఏడుగీతలు గీసి వెడలినాడు.

## రావణుడు విభీషణుని తన్నుట, తల్లి కైకసి, రాముని వద్దకేగుమనుట

విభీషణుడు సీతను రామునకిచ్చి వేయుమని హితవు పలుకగా, రావణుడు అతనిని నిండుసభలో తన్నెనట. అందుకే ఖిన్నుడైన విభీషణుడు శ్రీరాముని శరణు జొచ్చెనని కల్పించెను.

"అద్దిరా! యితని కోపావేశమనగ - గద్దియనుండి దిగ్గన డిగ్గనుఱికి
యడిదంబు జడిపించి యటు వ్రేయబూని - యుడిగి విభీషణు నుగ్రత దన్నె
దన్నిన వజ్రంబు తాకునఁగూలు - తగిరివోలె నుర్విపై బడియె" [1]

నీతి చెప్పిన విభీషణున్ని రావణుడు కోపముతో తన్నగా, నవమానితుడైన విభీషణుడు తల్లి (కైకసి) యొద్దకేగినట్లును, ఆమె యాతని దుఃఖ కారణము నడిగి తెలుసుకొన్నది. విభీషణుని వలననే తమ వంశము నిలుచునని చెప్పి ఆశీర్వదించి, శ్రీరాముని శరణు వేడుమని చెప్పినది.[2]

## లక్ష్మణ మూర్ఛ, నారదాగమనము

ఇంద్రజిత్తుతో పోరిన లక్ష్మణుడు రాక్షస మాయలకు లోనై మేఘనాధుని చేతిలో నాగపాశబద్ధుడైనాడు. రాముడు సౌమిత్రి స్థితిని జూచి దుఃఖింపసాగినాడు. ఆ సమయమున నారదుడు వచ్చి "నీవు విష్ణ్వంశ సంభూతుడవు. గరుత్మంతుని స్మరింపుమని " సలహానిచ్చెను. రాముడట్లే గావించగా లక్ష్మణుడు మూర్ఛ నుండి తేరుకొనెను.

"దేవనిన్ బ్రహ్మాది దేవతలెల్ల - నావార్ధిమధ్యంబునం దొప్పగాంచి
రావణ బాధా పరంపరల్ సెప్ప - గావిన వారిపై గరుణించి నీవు
వారి బ్రోచుటకు రావణుద్రుంచుటకు - ధారుణిఁబుట్టితి దశరథేశునకు"[3] అని కీర్తించినాడు.

---

1. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 334, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 1942
2. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 345 ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 1942
3. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 414, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 1942

## సులోచన వృత్తాంతము

సులోచన వృత్తాంతము అవాల్మీకమైనను అతి ప్రధానమైన ఘట్టము. ఈమె రావణాసురుని కోడలు. ఇంద్రజిత్తుని భార్య, పాతాళాధిపతి యైన ఆదిశేషుని బిడ్డ. లక్ష్మణుని చేతిలో హతుడైన తన భర్త కళేబరమును తెచ్చుకొని, సహగమనమొనర్చి పాతివ్రత్యమును నిలుపుకొన్న పతివ్రతా శిరోమణి. పరమ సాధ్వీరత్నము. వాల్మీకి రామాయణ ప్రతులలో సులోచన కథ మచ్చుకైనా కన్పింపదు. ఇదియు 1942లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారి అనుబంధములో ప్రచురించిరి. పుట 682 ఈ విధముగా సులోచన కథ పరిచితమైనది. ఇట్టి విచిత్రమైన సన్నివేశములన్నియు చమత్కారము కొఱకు, రసపుష్టి కొరకు, కథాగమనము కొఱకు రంగనాథ రామాయణ కర్త గోనబుద్ధారెడ్డి ఇతర సంస్కృత రామాయణముల నుండియు, జనశ్రుతుల నుండియు గ్రహించి తన రామాయణమున చేర్చుకొన్నాడు.[1]

సులోచన శ్రీరామచంద్రుని ఎదుట నిలిచి, నా భర్త కళేబరము నిమ్మని వేడుకొని శ్రీరాముని చేత ప్రశంసింపబడినది. మామయగు రావణుని చేత కీర్తింపబడిన సద్గుణవతి భర్త కళేబరమునకై సులోచన రథము నెక్కి ఆకాశ మార్గమున వచ్చినపుడు హనుమంతుడు జూచి రామునితో పల్కిన మాటలు.

"భామినీ మణి జూచి పరగ రామునకు - దామసింపక వేగదగ విన్నవించె
ఈ మానవతి మదినెంచగా దేవ - భామకాదిది ధరాపుత్రియుగాదు
మానుగాబతిలేని మగువయే గాని - దానిని నదిగో ప్రత్యక్షంబు గలదు[2]

ఆకాశమున గల వనితను సీతగాదు, పతిలేని మగువ నిక్కము అని పవనసుతుని పలుకులు గొప్పగా నున్నవి. రాముని దర్శించిన సులోచన పలుకులు.

"నందంద తూలుచు నసురుసురనుచు - మందయానంబున మగువ రాఘవుని
గదిసి సాగిలి నమస్కారంబు సేసె - ముదిత హస్తంబులు ముకుళించి నుదుట
రవి కులాంబుధి సోమ రామాభిరామ - ప్రవిమల గుణధామ పరరాజ భీమ"[3]

సులోచన శ్రీరాముని ఎదుట విచార వదనయై నిలిచి చేతులు జోడించి నమస్కరించి, రవికుల సోమ, రామాభిరామ అంటూ స్తుతించినది. ఏ స్త్రీ యయినను

---

1. రామాయణ సుధాలహరి - పుట తి.తి. దేవస్థానం 1984 జంధ్యాల పాపయ్యాశాస్త్రి గారి వ్యాసము
2,3. రంగనాథ రామాయణము అనుబంధము - పుట 682 ఆంధ్ర విశ్వ కళాపరిషత్ 1942

తన పతిని జంపిన వానిని కీర్తింపదు. సులోచన పతివ్రత కావున శ్రీరాముని చేతిలో తన భర్త మరణమొంది మోక్షము పొందెనని భావించి సహగమనమొనర్చినది.

"మరుగు సాచ్చితికాన మన్నించు నట్టి - బిరుదు నీ బిరుదు రూపింప నా విభుని
మరల ప్రాణములిచ్చి మన్నించునాకు - పురుష బిక్షము వెట్టి భువినన్ను నిలుపు "[1]

అని వేడుకొన్నది. ఈ మాటలు విన్న రాముని మనస్సు కరిగినది. అప్పుడు ఆంజనేయుడు ఇట్లా అన్నాడు.

"ఇదియేమి రాఘవ ఎఱుగరే మీరు - వదలక యా బ్రహ్మ వరము తప్పింప
నీతియే మీరు మానికిని జెప్ప - ధాతను మన్నింపఁదగును భూనాథ"[2]

- అని గుర్తు చేసినాడు. ఆ మాటలాలించి రఘువీరుడు మానినియగు సులోచనను జూచి

"జలజాక్షి యింకొక్క జన్మంబు నందు - కలిసెదు భువి బెద్ద కాలంబుదాక
పెక్కు సంపదల చేబెంపు సొంపార - నక్కజంబుగ భోగ మనుభవంబొంది
యా మీద వైకుంఠ మందు నిర్వురును - కామితార్థోన్నతిఁగాంతురుగాక"[3]

అని మరుజన్మములోన సుఖములను, మోక్షమును పొందుదురని దీవించినాడు.

- అప్పుడు సులోచన తన పతి కళేబరము నిమ్మని వేడుకొనెను.

"పరగ నాపతి కళేబరము తెప్పించు - పురమున కతి వేగ బోవంగవలయు"[4]

- నని పల్కిన సులోచనతో సుగ్రీవుడిట్లనియె, పతివ్రత వేని, నీ భర్తతో మాట్లాడుమని పరీక్షించెను.

"వనజలోచన పతివ్రత వౌదువేని - నీదుపురుషునితోడ నీ చందమెల్ల"
తగబల్కు మిప్పుడు తడయక యనిన - ......................................"[5]

ఆమె వెంటనే కదన రంగము చేరి భర్త తలను తడిమిచూచి, దుఃఖములో మునిగి యిట్లు విన్నవించినది.

---

1. రంగనాథ రామాయణము అనుబంధము పుట 682 ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942
2,3. రంగనాథ రామాయణము - అనుబంధ - పుట 682 ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942
4. రంగనాథ రామాయణము - అనుబంధము - పుట 685 ఆంధ్ర విశ్వ కళాపరిషత్ 1942
5. రంగనాథ రామాయణము - అనుబంధము - పుట 683 ఆంధ్ర విశ్వ కళాపరిషత్ 1942

"పతియె దైవంబని భావంబులోన - సతతంబు వ్రతముగా సల్పుదునేని
చెలగి నా విభునకు జీవంబు వచ్చి - యేలమి నాతో మాటలాడుగాకనుచు"[1]

అని వేడుకున్నంతనే మేఘనాథుని తల సులోచనతో మాటలాడిన విధము గమనింతము.

"తనదు ఋణానుబంధము గూడియున్న - నెనసి యుందురు నరులింతుల గూడి
వెలయగ యోగ వియోగముల్ బ్రహ్మ -వెలయంగఁగల్పించె వెలది జీవులకు"[2]

అని విధి విధానమును, లోకజ్ఞానమును సులోచనకు బోధించి, కన్నులు మూసెనట. ఇట్టి విషయము విచిత్రమైనది. అప్పుడు కళేబరమును గ్రహించి రాఘవునకు నమస్కరించగా నతడు అతివను వీడ్కోలు పలుక నామె పోయి అంతఃపురములోని తన పిల్లలకు నీతులు - హితవులు చెప్పి చెప్పి శిరము మూర్కొని ప్రేమచే చెక్కిలి నొక్కి యిట్లు వక్కాణించెను.

"సుతులార మీ ముద్దు చూడంగ నాకు - హితవు మీఱగ దైవమీయకపోయె
మహిమీద నుండ ధర్మము గాదు తనకు - సహగమనంబు నిశ్చయముగాఁ గూర్తు
నిక్కడ నుండుట యిది బుద్ధిగాదు - తక్కక పొండు పాతాళంబునకును
స్థిరబుద్ధి మీరాది శేషుని యింట - వెఱవకుండుడటంచు వేగంబె పంపి"[3]

తన పుత్రులను సులోచన తన తండ్రియైన ఆదిశేషుని ఇంటికి పొమ్మని, మీ తాత వద్ద కడు జాగ్రత్తగా నుండుడని చెప్పి తాను సహగమన క్రియకు బోవుచున్నానని వెల్లడించినది. ఇవేమి తెలియని పిల్లలు పాతాళమునకు వెళ్ళిపోయిరి. ఈ కథ కరుణ రసభరితమై వినువారికి, చదువువారికి హృదయము ద్రవింపకపోదు.

## కాలనేమి వృత్తాంతము

రావణుని శరధాటికి మూర్ఛిల్లిన లక్ష్మణుని రక్షించుటకై సంజీవనిని తెచ్చుటకు హనుమంతుడు ద్రోణాద్రికి బయలుదేరి వెళ్ళెను. ఆ ఔషధి సూర్యోదయానికి ముందే లక్ష్మణునికి అందవలెను. లేనిచో పనిచేయదను నియమము కలదు. హనుమంతుని మార్గమునకు ఆటంకము కలిగించుటకై రావణుడు కాలనేమిని నియోగించుటకు నిర్ణయించుకొన్నాడు. అర్థరాత్రి వేళ కాలనేమి వద్దకు చేరి ఈ విధముగా చెప్పసాగాడు.

1,2. రంగనాథ రామాయణము - అనుబంధము - పుట 683 ఆంధ్ర విశ్వ కళాపరిషత్ 1942
3. రంగనాథ రామాయణము యుద్ధకాండ పుట 683 అనుబంధము ఆంధ్ర విశ్వ కళాపరిషత్ 1942

"ఈ మధ్య రాత్రి నీవిటకు విచ్చెయు - టేమి కారణము? నా కెఱిగింపు" మనిన
ననినేడు నాశక్తి మతి మృతుండయిన - యనుజునికై రాముడటు తన్ను బనుప"[1]

ఇక కాలనేమి రావణునితో పల్కిన మాటలు.

"మాయా మృగాకృతి మారీచుడరిగి - మాయమైపోడె, యామతము పోవిడుః
ఘోరాజిగూలిరి కుంభకర్ణాది - వీరదానవులెల్ల వినువింకనైన
మనుజేశునకు సీత మరలంగనిచ్చి - దనుజేశ, లంక నీతమ్మునకిచ్చి
యరిగి మృడావాసమైన కైలాస - ధరణిధరము నందుఁదపసివైయుండు
కాదేని బిరుదవై కదన రంగమున - మేదిని పతిచేత మృతి బొంది మీద
నొనరంగ విష్ణు సాయుజ్యంబు నొందు - ......................................"[2]

యని పలికిన కాలనేమి యధార్థ వాదమునకు కుపితుడై రావణుడు చంద్రహాసమ వేయనుంకించగా, నతడు భయపడి లేచి, నీవు చెప్పినట్లుగానే చేతునని చెప్పి వెడలెను. ముని వనంబున తిరుగుచు క్షుద్బాధచే పండ్లు, రసములు చూచి గ్రోలెను హనుమంతుడు దప్పిగొనగా మకరి (రాక్షసి) గల సరోవరమును జూపెను. అతడ దానికి పట్టువడి చంపి, ఓషధిని గానక సంజీవని పర్వతాన్నంతటిని మోసుకొని తెచ్చి లక్ష్మణుని బ్రతికించెను. ఇది కల్పితమైనను మనోహరముగా అద్భుతముగానున్నది.

## జంబుకుమారుని వృత్తాంతము

ఈకథ రంగనాథ రామాయణమున అరణ్యకాండములో గలదు. జంబు కుమారుడు శూర్పణఖా విద్యుజిహ్యుల పుత్రుడు. రావణాసురుడు లోకము గెలువ దిగ్విజయ యాత్రకు బయలుదేరినపుడు, తన రాజ్యమగు లంకా పట్టణమును తన చెల్లెలి భర్త యగు విద్యుజిహ్యునకు అప్పగించి వెళ్ళెను. అంత విద్యుజిహ్యుడు రావణుని గెలువనెంచి, పాతాళ లోకమునకు పోయి మాయలు నేర్వసాగెను. ఇంతలో రావణుడు లంకకు వచ్చి జూడగా విద్యుజిహ్యుని కుతంత్రము తెలిసి, కోపించి పిలిపించి చంపెను. అప్పుడు శూర్పణఖ ఆరునెలల గర్భవతి. ఆమెతో రావణుడు ఇట్లునెను. 'నీవు స్వేచ్ఛా విహారిణివై తిరుగుము. నీకు నచ్చిన పురుషుని పొందుమని' యానతిచ్చెను. ఆమె యట్లేగావించెను. ఈమెకు పుట్టినవాడే జంబు కుమారుడు.

1. రంగనాథ రామాయణము యుద్ధకాండ పుట 566 అనుబంధము ఆంధ్ర విశ్వ కళాపరిషత్ 1942
2. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - పుట 566 ఆంధ్ర విశ్వ కళా పరిషత్

ఇతడు జన్మించిన తరువాత తన తండ్రి మరణ కారణము తెలుసుకొని మేనమామయగు రావణుని చంపనెంచి తపస్సు చేయ నిశ్చయించి, తల్లియనుమతి నడిగెను. తపస్సు చేసి సూర్యుని వలన ఒక ఖడ్గము పొందెను. సూర్యుడు కన్పించక పోయేసరికి దానిని గ్రహించక విసిరివేసెను. వెదురు బియ్యమునకై చెట్టు నరుకుచున్న లక్ష్మణునికి ఖడ్గము తాకి ఆ పొదల చాటున తపోదీక్షతో ఉన్న జంబు కుమారునికి తాకగా మరణించెను. ఈ కథ మూలములో లేదు. గోనబుద్ధ బూపతి పాప పరిహారము. గర్వభంగము, అత్యాశాఫలితము, తపోనిష్ఠలో సదుద్దేశలోపము, అతిస్వేచ్ఛా విహారము అను నంశములు సత్ఫలితములనీయవని లోకమునకు చాటుటకై ఇతర రామాయణముల నుండి గ్రహించెను.

## ఉడుతాభక్తి

రంగనాథ రామాయణములో గల మరొక సుందర దృశ్యము ఉడుతాభక్తి వానరులు వారిధి నిర్మించేటప్పుడు అచటనే వున్న ఒక ఉడుత ఏదైనా పనిచేసి వారిధి నిర్మాణమునకు సహాయపడవలెనని మనమున దలంచినది. వానరులు రాళ్ళు మోస్తూన్నపుడు ఉడుత చిన్న చిన్న రాళ్ళను దొర్లించిందట. ముందుగా నీళ్ళలో మునిగి తర్వాత ఇసుకలో మునిగి చిన్నగా వారిధి దగ్గరకు వెళ్ళి దులుపుతూ ఇసుకను మోసిందట.

"...................... - మనమున జేర్చియా మనుజేశునెదుర
నచ్చపు భక్తితో నలవార్ధిమునిగి - వచ్చితానిసుకలో వడి పొరలాడి
తడయక యటగని తనమేని యిసుక - వడికట్టపై రాల్చి వనధిలో మరియు"[1]

ఇట్లు ఇసుక మోస్తున్న ఉడుతను చూడముచ్చటపడిన రాముడు లక్ష్మణునకు ఉడుతను తీసుకురమ్మని చెప్పగా, అతడు ఉడుతను తెచ్చెను.

"పలు తెరంగుల దాని ప్రస్తుతి జేసి - కలిత దక్షిణ కరాగ్రము దువ్వుటయు
అలయుడుతను వెన్కనమరె త్రిరేఖ- ....................."[2]

---

1. రంగనాథ రామాయణము యుద్ధకాండము పుట 319, ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942
2. రంగనాథ రామాయణము - యుద్ధకాండ - పుట 310, రాములు అండ్ కో

ఉడుతభక్తి మెచ్చి రాముడు దాని వీపుపై ప్రేమతో నిమిరెను. రాముని చేతివ్రేళ్ళ గుర్తులు నేటికినీ కన్పించుచున్నవి.

## సముద్రునికి ప్రాణ భిక్ష

శ్రీరాముని కోపానికి సముద్రుడు భయపడి రక్షించుమని వేడుకొనెను. అప్పుడు సాగరుని భార్యలు (నదులు)తమకు "మంగళ సూత్రముల్ నిలుపుమ"నిరి ఇదియును అవాల్మీకాంశము.

మూలములో సాగరుడు నదులతో వచ్చి ప్రార్థించినట్లుండగా రంగనాథ రామాయణమున ఆ నదీమ తల్లులు తమ మంగళ సూత్రములు నిలుపుమని ప్రార్థింపగా శ్రీరాముడభయమిచ్చినట్లు చెప్పబడినది. అన్ని కాలములందును అబలలు దయనీయస్థితిలో జీవించియున్నారు. అపరాధి సంబంధీకులు శరణాగతి వేడిననూ కరుణాసముద్రుడు, శరణాగత వత్సలుడైన శ్రీరామచంద్రుడు వరమునిచ్చునను భావమును గోనబుద్ధారెడ్డి వ్యక్తీకరింపుటకు భాగవత ప్రభావమును పూనెను.[1]

## రామేశ్వర ఘట్టము

మూలము లేని శ్రీరామేశ్వర ఘట్టము ఈ రామాయణమునందు గలదు. శ్రీరాముడు హనుమంతుణ్ణి కాశీకి పంపి శివలింగమును దెమ్మనగా, హనుమంతుడు వచ్చుట యందాలస్యమగుటతో శ్రీరాముడు ఇసుకతో లింగరూపమును తయారుచేసి లింగ ప్రతిష్ఠ చేసి పూజించబోవునంతలో హనుమంతుడేతెంచి కోపించి బాధపడెను. రామావతారమూర్తి శ్రీమన్నారాయణుడేయని కవి కల్పించెను.

" భుజగ కంకణుతోడ భూతాలితోడ - రజతాద్రి నెత్తిన రావణునకును
నెత్తంగ నలవిగా కెసగు సౌమిత్రి - నెత్తితి నింద్రాదులెల్ల గీర్తింప
దటుకున మేరు మందర మూలనైన - బొటనవ్రేల జిమ్ముదు భూరి సత్త్వమున"[2]

అని గర్వించిన ఆంజనేయుని దర్పమును దొలగింపబూని శ్రీరామ స్వహస్త స్థాపితమైన శివలింగమును (సైకతలింగము) తొలగింపుమనెను. ఆంజనేయుడు

---

1. రంగనాథ - వాల్మీకి రామాయణముల తులనాత్మక పరిశీలనము - డా॥గుండి వెంకటాచార్యులు పుట - 327

2. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 531 ద్విపద, రాయలు అండ్ కో - కడప

సంతోషించి పెకిలింప యత్నించి మూర్ఛిల్లినాడు. శ్రీరాముడు తన తొడపై తలను పెట్టుకొని సేదదీర్చెను. అంత హనుమంతుడు మేల్కొని శ్రీరామునికి పాదాభివందనములు చేసెను.[1]

శ్రీరాముడు శివలింగ ప్రతిష్ఠ చేసి అద్వైతమును ప్రదర్శించెను. ఇది రామాయణములోని ప్రత్యేకత.

శ్రీరాముడు పట్టాభిషేకానంతరము వానరులను తమ నెలవులకు పంపెను. విభీషణుడు మాత్రము శ్రీరాముని వీడక యుండెను. అప్పుడు విభీషణునకు తనకు బదులుగా శ్రీరంగనాథమూర్తిని పూజింపుమని చెప్పెను. విభీషణుడు దానిని తీసుకొని వెళ్ళుతూ కారణాంతరమున ఉభయ కావేరీ నదుల మధ్య విడిచెను. అదే శ్రీరంగధామేశ్వరము. విభీషణుడు నిత్యము లంక నుండి వచ్చి పూజించెడివాడు. రాను రాను సంవత్సరముకొకసారి వచ్చి శ్రీరంగణ్ణి సేవించువాడు. దీనినే బుద్ధారెడ్డి తన గ్రంథాంతమున నిట్లు మంగళాంతము గావించినాడు.

"అంత విభీషణుడా రాము జూచి - యెంతయు భక్తితో నిల జాగి మ్రొక్కి
దేవయిచ్చటనే మీ దివ్య శ్రీపాద - సేవ జేయుచునుందుఁజనగ నేనొల్ల
మనుజేశనా మది మది నిల్వదచట - యనవుడు రఘు రాముడతని కిట్లనియె
నరయగా మా స్వామియగుచున్నయట్టి - శ్రీరంగ ధామునిచ్చెద నీవు గొమ్ము
పోయి నీ వందు నెప్పుడు పూజసేయు- మాయందు భక్తియు మఱువకు మెపుడు"[2]

అని బోధించినాడు. రంగనాథునితో లంకలో ప్రవేశించువరకు భూమి మీద దింపవద్దని రాముడు పలికెను. అట్లేనని విభీషణుడు బయలు దేరెను. అమరులకిది యిష్టములేక విఘ్నేశ్వరుని ప్రార్థించిరి. కావేరి తీరము చేరిన విభీషణునకు వటురూపమునున్న గణేశుడు కన్పించెను. అతనిని చూడగానే కడుపుబ్బెను. అంతలోనే శ్రీరంగధాముని వటరూప గణపతికిచ్చి పట్టుకొమ్మని చెప్పి దేహబాధ తీర్చుకొని వచ్చెదననెను. అంతటా వటువు ముమ్మారు పిలిచి క్రింద బెట్టెదనని చెప్పి శ్రీరంగధాముని పట్టుకొనెను. విభీషణుడు దేహబాధ తీర్చుకొనక ముందే మూడుసార్లు పిలిచి క్రింద

---

1. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 321 ద్విపద, రాయలు అండ్ కో - కడప
2. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - అనుబంధము - 2, పుట - 842, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 1942

పెట్టెను. అంత విభీషణుడు తన శౌచకర్మను దీర్చుకొని వచ్చి శ్రీరంగశాయి మందసము నెత్తలేక దీనచిత్తుడై ప్రార్థించుచుండగా "ప్రతి నిత్యము వచ్చి నన్నిచ్చటనే గొలుచుచుండుము, విచారింపవద్దుపొమ్ము" అని ఆనతీయగా విభీషణుడు తన బలగముతో లంకను చేరెను.

"రామునిచే రంగ నాయకుగొనుచు - యామినీచర పాలుడతిముదంబునను
కావేరీ చంద్ర పుష్కరిణీ తటమున - నా విమానము నుంచి యది రాకయున్న
జనియె మ్రొక్కుదు విభీషణుడర్థిదన్ను - దనుజులు గొలువ....."[1]

అని యుండుటచే విభేషణుడు శ్రీ రంగనాథస్వామిని గొల్చినట్లు కన్పించుచున్నది. ఇది మూలమున అస్పష్టముగ నున్నను రంగనాథ రామాయణమున వివరముగ గలదు.

## సౌమిత్రి హాసము

రంగనాథ రామాయణమున యుద్ధకాండములో గోనబుద్ధారెడ్డి కల్పించిన "సౌమిత్రి హాసము" మూలములో లేదు. శ్రీరామ పట్టాభిషేక సందర్భమున బంధు, మిత్రులకు విందు చేయునపుడు లక్ష్మణునకు అసందర్భపు నవ్వు వచ్చినది. శ్రీరాముడు కోపగించి సౌమిత్రని చంపుటకు పూనుకొనెను. లక్ష్మణుడు అందరికి తన నవ్వుకు కారణము వివరించెను. అరణ్యవాస సమయమున తన్నావరించుటకు వచ్చిన నిద్రాదేవిని బ్రతిమిలాడి ఈ పదునాలుగేండ్లు తన భార్యయగు ఊర్మిళ దగ్గరకు వెళ్ళుమని కోరినాడు. ఆమె యట్లేగావించెను. వనవాసాంతరము నిద్రాదేవి వచ్చి తనను ఆవరించినది. కావున నాకు నవ్వు వచ్చినదని సమాధానమిచ్చెను. శ్రీరాముడు తన తప్పుకు ప్రాయశ్చిత్తమేమని వశిష్ఠుని అడుగగా నతడు సౌమిత్రి పాదములు తాకిన చాలునని చెప్పెను. అతడు అట్లే తాకెను. వెంటనే అన్నను లక్ష్మణుడు కౌగిలించుకొనెను. ఈ కథ రంగనాథ రామాయణము నందే కన్పించును. ఇతర రామాయణములలో కన్పింపదు. స్త్రీల రామాయణపు పాటలలో గలదు.

ఇట్లు రంగనాథ రామాయణము తెలుగు రామాయణములకాద్యమై అందరి మన్ననలు పొందినది. ఇది దేశీయమైనను శిష్టులకు యిష్టమై ప్రాచుర్యమును

1. రంగనాథ రామాయణము - యుద్ధకాండము - అనుబంధము - 2, పుట - 843, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 1942

పొందినది. అవాల్మీకాంశముల కల్పనలు, పాత్ర చిత్రణలు రంగనాథ రామాయణము నందు కోకొల్లలు.

## రంగనాథోత్తర రామాయణమున కొన్ని అవాల్మీకాంశములు

రంగనాథ రామాయణములోని ఉత్తర భాగమును కాచభూపతి, విఠలరాజు అను సోదరులు రచియించిరి. రామాయణము వ్రాసిన తరువాత ఉత్తర రామాయణము వ్రాయబడినది. ఇందలి కథ రామజన్మాది నుండి శ్రీరామవతార సమాప్తి వరకు వరికథంపబడినది. ఇందులోను మూలమునకు భిన్నములగు కల్పనలెన్నో గావింపబడినవి.

1. రావణుడు బ్రహ్మదేవుని గూర్చి తపమొనర్చి, తన నాభి యందలి యమృతము నరుల కెవరికినీ కానరాకుండునట్లుగ వరము నొందెను.

2. రావణుడు మాంధాతతో పోరాడినట్లును, పులస్త్యుడేతెంచి, వారికిర్వురకును సంధి గావించినట్లును వర్ణించినారు.

3. వాలిసుగ్రీవుల జన్మవృత్తాంతము పూర్తిగా వర్ణించబడినది.

4. గౌతముని శాపముచే అహల్య పాషాణముగా బడియున్న సంగతి వర్ణితము.

5. ఆంజనేయుని జన్మ ప్రకారము వాల్మీకి రామాయణము నందు లేదు. రంగనాథ రామాయణము నందు గలదు. పూర్వము పార్వతీ పరమేశ్వరులు మర్కట రూపమును ధరించినపుడు వారి వలన కల్గిన శక్తిని భూదేవి 'సప్తగిరులు, సప్త సముద్రములను, స్థావర జంగమాదులను మోయుచున్నను ఈ గర్భమును మోయలేన' ని శివునికి మొరపెట్టుకొనగా, శివుడు వెయ్యి సంవత్సరములు తానే మోసి, వాయువునకిచ్చెను. వాయువు వెయ్యి సంవత్సరములు మోసెను. గౌతముని బిడ్డ అంజనాదేవి వాయువును గూర్చి తపస్సు చేయుచుండగా ఆ గర్భమును ఆమె కిచ్చెను. ఆమె పన్నెండు మాసములు మోసి ఆంజనేయుని గనెను.

6. వాలి సుగ్రీవుల జన్మ ప్రకారమున కింకొక కథ గలదు. ఒకసారి బ్రహ్మదేవుడు మేరు పర్వతముపై జపమాచరించుచుండగా అతని కన్నీటి బిందువులు నేలపై బడినవి. అవే "బుక్షవిరజుడ"ను వానరుని పుట్టుకకు కారణము.

7. రావణుడు సీతను అపహరించుటకు గల కారణము వాల్మీకి రామాయణ
కానరాదు. రావణుడు శ్రీరాముడే నారాయణుడని తెలిసి కోరి వైరము తెచ్చుకొ

8. నారద ప్రేరితుడై రావణుడు శ్వేత ద్వీపమునకేగి యచట స్త్రీలచే నవమానిత
కథ వాల్మీకి రామాయణమున కానరాదు.

9. సీతారాములు సంసారము సాగిస్తున్న కాలములో నొక రాక్షసి ఈమె దగ్గ
వచ్చి శ్రీరాముని వద్ద యిద్దరు వనితలున్నారని సీతతో చెప్పను. సీతకు కోపము
రాముని చేరి " ఆ వనితల వృత్తాంతమడుగగా, కుంభణుడు తనకొక "మూరు
ఒకటి, రెండమ్ముల నొసంగినాడ"ని చెప్పెను. ఈ బాణ రాజంబులెలమితో
ప్రాబల్యముగ పనులొనగూర్చునని నతడే చెప్పెనని, అవి ఆ రీతినే వనితలై
పనులు చేయుచున్నవని చెప్పెను. ఇంట్లో రాముడు లేనప్పుడు సీత ఆ గదిలో
అమ్ములను పటపట విరచి పొడిచేసి నీటిలో గలిపి త్రాగినదట. ఆమె వెంటనే గర్భ
దాల్చినదట.

10. వాల్మీకి శత్రుఘ్నునకు పూర్వ రాజు మిత్ర సహుని కథ చెప్పుట మ
రామాయణములో లేదు.

11. గృధ్రోలూక గృహ వివాదము శ్రీరాములు తీర్చుట కూడ వా
రామాయణములో లేదు.

ఇట్లు రంగనాథ రామాయణ ఉత్తర కాండము నందు భిన్న కథలు కల్పించి
గావించిరి.[1]

ఏకోజీ రామాయణము

ఏకోజీ రామాయణమును "వాల్మీకి యలరామ కథను - రచించినట్లు సారము
ద్విపద రచియించ దత్కథాక్రమ మెట్టిదనిన[2] అని ప్రారంభించినను వా
రామాయణములోని అన్ని విషయములను అనుసరించలేదు. కావున దీనిని సంగ్ర
రామాయణమనవచ్చును. సంగ్రహమయినప్పటికినీ కొన్ని అవాల్మీకాంశములకు స్థాన

1. ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర - డా॥ టి. సుశీల పుట - 199-201-1979
2. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 2, డా॥ ఎం. బాగయ్య - 1993

కల్పింపబడినది. గోనబుద్ధ భూపతి వలెనే ఈ ఏకోజియు అవాల్మీకాంశములను గ్రహించినాడు.

## శ్రీరాముని అవతార విషయము

శ్రీ మహావిష్ణు శ్రీరామావతారమున జన్మించినట్లు గలదు. వాల్మీకి లోకోత్తమ పురుషుడు, సద్గుణ శీలుడు, సత్యజ్ఞుండు, ధర్మజ్ఞుండు, జితేంద్రియుడైన వీరుడెవరు? అని నారదుని ప్రశ్నించగానపుడు, ఈ లక్షణములు గలవాడొక్కడే ఆయనే శ్రీరాముడని నారదుడు జవాబిచ్చెను.

"దశరథ తన యుండు ధర్మమానసుడు - దశదిశలను కీర్తి దనరినవాడు
యినకుల తిలకుడు దేవేంద్ర సన్నుతుడు - ఘనుడు శ్రీరాముడు కల్యాణగుణుడు
పురుషోత్తముడు సంపూర్ణావతారు - డరయంగ జన్మించి యభివృద్ధి పొంది"[1]

ఇట్లు శ్రీరాముడు విష్ణ్వంశ సంభూతుడుగాను, తల్లిదండ్రుల యెడ భక్తి ప్రపత్తులు, సోదరులయెడ భ్రాతృప్రేమ, ఏకపత్నీవ్రతుడై, అన్యాయాన్ని, అధర్మాన్ని, రాక్షసత్వాన్ని కూలద్రోయుటకు ఒకే ఒక్క బాణమును ప్రయోగించి నిర్మూలించేశక్తి గల ధీశాలిగా వర్ణింపబడినాడు.

శ్రీరాముడు జన్మించిన తిథి, వార నక్షత్రముల గురించి స్పష్టపర్చిన ఘట్టము. జన్మవారము బుధవారముగా గలదు. రామాయణము నందును శ్రీరాముని జన్మ చరిత్ర యథాతథముగా నున్నది.[2]

"సురుచిర మధు మాస శుక్లపక్షమున - పురడించునవమిని బుధవాసరమున
మలయ పునర్వసుమధ్యాహ్నవేళ - లలిత కర్కాటక లగ్నంబునందు
గురుచంద్ర యోగంబు కొమరు దీపింప - పరగనుచ్చంబులై పంచగ్రహములు
పరమాత్మునవ్యయు భక్త మందారు - గరిమెతో శ్రీరాము గనియె కౌసల్య"[3]

భరతుని జన్మ ముహూర్తము : కైకేయి భరతుని జన్మ తిథిని వివరించిన విధమును విలోకింతము.

---

1. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 4, డా॥ ఎం. బాగయ్య - 1993
2. శ్రీరామాయణము - బాలకాండము - కట్టావరదరాజు - తంజావూరు
3. ఏకోజీ రామాయణము - బాలకాండ - పుట - 14,15 డా॥ ఎం. బాగయ్య 1993

"పొలుపొందు శుభకర పుష్యనక్షత్ర - కలితమౌమీన లగ్నంబున గరిమ
పూని కేకయపుత్రి పుణ్యయోగమున - భాను సన్నిభతేజ భరతేశుగనియె"[1]
అని కేకయరాజపుత్రి భరతుని ఏనక్షత్రమున కనినదో చక్కగా వివరింపబడినది.

లక్ష్మణ, శత్రుఘ్నుల జన్మ ముహూర్తమును గురించి : శ్రీరామ, భరతుల జననము తర్వాత సుమిత్రా దేవి కవలలను కనిన సమయమును కవి పేర్కొన్న సందర్భము అరయుదము.

"కలితాహి నక్షత్ర కటకలగ్నమున - తలపుల్లసిల సుమిత్రా దేవి కవల
లక్ష్మీకరాకార లక్ష్మణాన్వితుల - లక్ష్మణ శత్రుఘ్నులను గాంచెనపుడు"[2]
ఇట్లు దశరథునకు గల్గిన నల్గురు పుత్రుల జన్మతిథి, వార నక్షత్రాదులు కడు చక్కగా, వివరింపబడినవి. జ్యోతిశాస్త్ర వేత్తలకనువైనదిగానున్నది. దశరథాత్మజులు జన్మించిన శుభసమయమున దేవతలు పుష్పవర్షము గురిపించిరి. వీనిని ఏకోజీ "సొరది పువ్వుల వాన సోనలై కురిసె" నని వర్ణించినాడు.

ఇందు "సోనలై" అను అచ్చ తెలుగు పద గుంఫనముతో సొంపైన పూసోనలను గుభాళింపచేసినాడు. రఘువంశ కులగురువులైన వశిష్ఠ మహర్షి వారు రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల యొక్క జాతక కర్మములు జేసెను. మంత్రసానులకు ధన, ధేను, నవరత్నములను బహూకరించిరి. ఇట్టి ఆచారము తెలుగు దేశమున (ప్రసూతి సందర్భమున) నేటికినీ కన్పించుచునేయున్నది. తంజావూరి పురవీధులను దర్శించి, తెలుగుదనముట్టిపడునట్లు రామాయణ రచన చేసినాడు.

**అహల్య శాపవిమోచనము :**

శ్రీరాముని చరణ ధూళి అహల్యకు తాకినంతనే పాషాణ రూపమును వీడి పూర్వ రూపము సంతరించుకున్నది. ఈ సందర్భమున ఆమె చక్కనైన అందచందములను వర్ణించెను.

"గరిమతో రాగ మార్గంబున రాము - చరణ రేణువు సోకి శాపంబు మాని"[1]
అని శ్రీరాముని పాదధూళి సోకి రాయిగా పడివున్న అహల్య నాతియై నిలిచినదని

1. ఏకోజీ రామాయణము - బాలకాండ - పుట 15, డా. ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - బాలకాండ - పుట 15, డా॥ఎం. బాగయ్య 1993

చెప్పినాడు. అందాలన్నింటిని ఆపాదించుకొని యెట్లున్నదో కన్నులకు కట్టినట్లుగా వర్ణించినాడు.

"............................... - తొలకరి మెరుపునా తులకించు మేను
తుమ్మెద రెక్కల తొలగించు కురులు - తమ్మిరేకుల మించి తనరారు కనులు
బాలచంద్రుని గేరుఫాలభాగంబు - శ్రీలను రంజిల్లుచిన్ని వీనులును
ముకురములు మొనయు ముద్దు చెక్కులును - చికిలి విద్రుమముల చెనకు కెమ్మోవి
ననవిల్తుచాపంబు నవ్వు కన్బొమలు - యెనలేని నూగారు నెచ్చెడినాస
దాడిమ విత్తుల తరము పల్వరుస - పుడమిని శంఖంబు పోలిన గళము
కాంతి లతికెన గడుగు బాహువులు - ................................."[2]

అని అహల్యను అతిలోక సుందరిగా వర్ణించి, ఆమె అందమే ఆమెను యిడుముల పాలు చేసినదని చెప్పినాడు.

## అహల్య శ్రీరాముని కీర్తించుట :

శాపవిమోచనానంతరము పరమానందభరితురాలైనది. అహల్య భక్తి పారవశ్యమున శ్రీరాముని స్తుతించినది.

"జయ జయ రఘురామ! జగదభిరామ! - జయ దశరథ పుత్ర! ధవళాబ్జనేత్ర!
సురముని జన మిత్ర ! సురుచిర గాత్ర! - పరమ పుణ్య చరిత్ర! పద్మాప్త గాత్ర!
సొరది నీ పాదంబు సోకిన యపుడే - పరమ పతివ్రతా భరణంబునైతి
యెలమి గౌతమ మునికిల్లాల నైతి - పొలిసెనా పాపంబు పొలిసె శాపంబు"[3]

ఇట్లు శ్రీరాముని కీర్తించి పవిత్రురాలైనది. అహల్య పాపము, శాపములు సమసిపోయి పరమ పతివ్రతాభరణంబుగా నిల్చి, గౌతమ మునికి యిల్లాలయినది. శ్రీరాముణ్ణి పతిత పావనుడుగా కీర్తించినాడు. గోనబుద్ధ భూపతి అహల్య శాపవృత్తాంతమును వివరించి, శాపవిమోచనమెందులకనో వర్ణించలేదు. ఏకోజీ కవి శాపవృత్తాంతమును విడిచిపెట్టి శాపవిమోచనమును వర్ణించినాడు. గౌతముడు శ్రీరాముని దర్శించి, కీర్తించి

1. ఏకోజీ రామాయణము - బాలకాండ - పుట 32, డా॥ ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - బాలకాండ - పుట 32, 33 డా॥ ఎం. బాగయ్య గారు 1993
3. ఏకోజీ రామాయణము - బాలకాండ - పుట 33, డా॥ ఎం. బాగయ్య గారు 1993

అహల్యను గొని, శ్రీరామ కౌశికాదులను తోడ్కొని ఆశ్రమానికి వెళ్ళినట్లు చెప్పియున్నాడు. ఏకోజీ కవి అహల్య కౌశికునకు పిదప శ్రీరాముని కీర్తించినట్లు గలదు.

## వనవాస సందర్భమున కౌసల్య దుఃఖించుట :

శ్రీరాముడు సీతా లక్ష్మణ సహితుడై అరణ్యావాసమునకేగునపుడు కౌసల్య పుత్రుని వీడి, ఒక మాతృమూర్తి ఒలకింపచేసిన అవాల్మీకాంశము.

> " నీజన్మలగ్నంబు నీ శుభాంగములు - నీజాతకము జూచి నిఖిల సంయములు
> భూలోక మంతయు భుజబల స్ఫూర్తి - పాలించు నితడని పలికిరి గాని
> కొరమాలి మునివృత్తి ఘోరాటవులను - తిరుగుదువని మున్నెతెలుపలేరైరి
> యప్పుడే దెలిపితే యన్న శ్రీరామ - తెప్పున నేమైన తెగువ గైకొందు..."[1]

నని మాతృహృదయము శోకించినది. పుత్రుని వీడి బ్రతుకలేనని వాపోయినది. పుత్ర వ్యామోహముతో పరిపరి విధముల పలుపాయముల సూచించినది. ఇన్నాళ్ళు బిడ్డలు లేక గొడ్రాలిగా దుఃఖించినాను. ఇప్పుడు సత్పుత్రుడవైన నిను గాంచిన సుఖము క్షణముగానే మిగిలినది. మీ తండ్రి నుండి కొరతలేగాని సుఖములు నేపొందలేదని వ్యక్తీకరించినది. కష్టసమయములందే నిష్ఠుర సత్యములు బయల్పడునను సత్యము లోక విదితము. కైకేయి రాజ్యాభిషేకముతో భరతుని పట్టమహిషిగా యున్నచో నేను కొరగాను. తండ్రీ ! నీవు అయోధ్యాపురము నందే తిరుగాడుము తండ్రీ! నీ ముద్దు ముఖమును జూచి దుఃఖమును మరిచెద రామచంద్ర! పరదేశులెందరో అయోధ్యనందు తిరుగుటలేదా అట్లే నీవును తిరుగుము. అడవులకు మాత్రము వెళ్ళవద్దని విలపించినది. ఇచట మాతృమూర్తి ఆవేదనను కరుణ రసాత్మకముగా వర్ణించి, పఠితులను కంట తడిపెట్టించెను. వనవాసమంటే అడవులకే వెళ్ళవలెనని కౌసల్యకు తెలియకగాదు.తల్లి ప్రేమను తెలియజెప్పుటకే కవి కౌసల్యచే ఇట్లు పలికించినాడు.

> "కొడుకు రాజ్యంబు గైకొని యేలుచుండ( - బెడ మాటలను విప్రవీగుచునుండు
> కైకేయి మొగమెట్లు కనుగొందు నేను - కైక నన్నెంచునే కలనైన గాని

---

1. ఏకోజీ రామాయణము - అయోధ్య - పుట 79, డా॥ ఎం. బాగయ్య గారు 1993

పరదేశులెందరీ పట్టణంబుననను - తిరుగరే నీవట్లు తిరుగు మీ పురిని
నిరతంబు నీ ముద్దు నెమ్మోముజూచి - మరచెద దుఃఖంబు మా రామచంద్ర"[1]
అని ఏకోజీ పలికించినాడు.

## సుమంతుడు కైకేయిని ధిక్కరించుట :

కౌసల్య, సుమిత్రలు కడు విలపింపజూచిన మంత్రి సుమంతుడు కైకేయిని దూషించిన విషయమున్నది.

"............ సుమిత్ర కౌసల్య - కడువడి విలపింప కని సుమంత్రుడు
శోకంబు సొరదియై సూటిగా తాను - కైకేయి జూచి దిక్కరించి పలికె
రాకకై నీ గుండె రాయిగా వోలు - రాకుమారివి గావు రాక్షసివి నీవు
పతిహితమింతైన పరికింపలేవు - గతినీకు గలదే దుర్గతి యింతేగాని"[2]

అని నిందించి పలికిన వాక్యములు సత్యములై యొప్పారుచున్నవి. పట్టభద్రుని గావింప వలసిన శ్రీరామచంద్రుని కానలకు పంపుటకు నీ మనసెట్లంగీకరించుచున్నదని ప్రశ్నించెను. సుమంత్రుని ప్రశ్నలో ఆవేదనతో పాటు అనింద్య వాక్యములున్నవి.

## దశరథుడు కైకేయి మనసును మళ్ళించుటకు ప్రయత్నించుట :

కైకేయి అడిగిన వరములకు దశరథుడు బాధపడినాడు. కైకేయి మనస్సును మార్చుటకు శ్రీరాముని సద్గుణములను గుర్తు తెచ్చినాడు.

"........................ - ఇట్టి పాపపు మాటలెట్లు పల్కెదవు
కన్నతల్లియగు యా కౌసల్య కన్న - నిన్ను పూజించును నీ సేవ సేయు
నట్టి సద్గుణ శాలినట్టి పుణ్యాత్మ - నట్టి రాముని కానక నుపమందువది
యెటుల నేముందునే నెటుల సహింతు - కటకటా నీకింత కరుణ లేదటే"[3]

అని కైకేయిని బుజ్జగించి, కోపగించి, నిందించినాడు. అయినను ఏమి ఫలితము కనబడలేదు. అంతకు మిక్కిలి ఏమి చేయగలడు. ఇచ్చిన వరముల తీసుకొనలేడు. అందుకే దశరథుడు విలపించినాడు.

---

1. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట 79, డా॥ ఎం. బాగయ్య 1993
1. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట - 88, డా॥ ఎం. బాగయ్య గారు 1993
2. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట - 67, డా॥ ఎం. బాగయ్య గారు 1993

## శ్రీరాముడు కైక సంశయమును దీర్చుట :

దశరథుని మాట ప్రకారము శ్రీరాముడు రాజ్యాభిషేక మహోత్సవమును విడనాడి నారచీరలు ధరించి కారడవులకు వెళ్ళునా? వెళ్ళుటకు రాముడు ఒప్పుకొనినను కౌసల్యాదులూరుకుందురా ? అని మనమున తలచిన కైక వద్దకు శ్రీరాముడు చేరి ఈ విధంగా పలికినాడు.

"................... - తన తండ్రి మాటకై దారుణంబైన
కాలాగ్నిసైనను కణకతో జొత్తు - కాలకూటంబైన కబళీకరింతు
జనని! యిందు నీకు సంశయంబేల?- ......................"[1]

అని పితృవాక్య పరిపాలనత్వమును చాటుకొన్నాడు. తండ్రి మాటకై కాలాగ్నిచొచ్చెదను, కాలకూటమునైన సంతోషమున సేవింతునని పినతల్లి కైకేయికి ధైర్యము చెప్పినాడు.

## శ్రీరాముడు భరతునకు పట్టము గట్టుమని దశరథునికి చెప్పుట

కైకేయి వరముల ప్రకారము భరతునకు పట్టము గట్టుమని తాను కారడవులకు పోయెదనని, తండ్రి దశరథునకు తల్లులకును మ్రొక్కు సందర్భమున శ్రీరాముని మాటలు

"కట్టుమా భరతునీ ఘడియ పట్టంబు - గట్టిగా యిప్పటికి కార్య సంగతులు
తల్లి కైసల్యకు తగసుమిత్రకును - యిల్లాలు సీతకు నెలమితో దెలిపి
తపసి పోయెద దారుణాటవికి - .........................."[2]

అడవి మాటవినగానే తల్లిదండ్రుల హృదయములు తపించినవి. సీతారామ, లక్ష్మణులు నారచీరలు గట్టి వనవాసమునకు ప్రయాణమైరి. దశరథుడు కోపమును తట్టుకొనలేక కైకేయిని క్రూరురాలవనగానే కైకేయికిచ్చిన మాటను తిరిగి తీసుకొనుమని నిందించినది. ఇద్దరి తగవును శ్రీరాముడు నివారింపనెంచి ఇట్లు పలికినాడు.

---

1. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట - 74, డా॥ ఎం. బాగయ్య గారు 1993
2. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట - 76, డా॥ ఎం. బాగయ్య గారు 1993

"తల్లి కైకేయి మా తండ్రి కీలాగు - యిల్లాలవైయుండి యేలదూరెదవు
తప్పను కలనైన తండ్రి వాక్యంబు - లిప్పుడే పోయెద నెలమి కానలకు"[1]

కలలోనైన మాట దప్పను, పితృవాక్య పాలన చేసెద నమ్మమని కైక తెచ్చిన నార చీరలు ధరించి అడవికి బయలు దేరెను.

**కౌసల్య దుఃఖించుట :**

పట్టు వస్త్రములను వీడి నారచీరలు ధరించి అడవులకు ప్రయాణమైన శ్రీరాముని కౌగిట జేర్చి విలపించినది.

"నను వీడు కొల్పుము నా మేలు కోరు - మని మ్రొక్క కౌసల్య యపుడు రాఘవుని
కనికరంబున నెత్తి కౌగిట చేర్చి - కానకగన్న చక్కని రామచంద్ర!
కానకు బోయదె కటకటయిపుడు -డని విలపించుచు నశ్రువుల్ రాల
గొనకొని పైట కొంగున చక్కనొత్తి - ...............................
పావన జలముల పక్షాళ తాస్య - యైవచ్చి పుణ్యాహమమర సేయించి"[2]

ఎవరైన ప్రయాణమై పోవునపుడు కంట నీరు పెట్టుట శుభకరము గాదు. కావున కౌసల్య అశ్రువులను పైటకొంగుతో తుడుచుకొని మంచినీటితో ముఖము కడుగుకొని వచ్చినది. పుణ్యాహవచనములతో నిట్లు పలికెను. చతుర్వేదములు, అష్టదిక్పాలకులు, రవిచంద్రులు, అగ్ని, సముద్రుడు, వృక్షములు, లతలు, పుష్పకుంజములు, మేరు పర్వతాదులు అడవిలో నీకు తోడుగా నుండునని దీవించినది.

**శ్రీరాముని పురజనులు వెంబడించుట :**

శ్రీరాముడు వనవాసమునకు బయలుదేరగా, రాముని వెంబడి అయోధ్యపురి ప్రజలందరు అడవులకు వత్తుమని బయలుదేరిరి. రావద్దని నివారించినను వినరైరి.

'జనులార విడిచి మీ సంసారములను - చనువేర యుచితమే చనుడ యోధ్యకును
భరతుండు నా కంటె పరమ పుణ్యుడు -నిరంతంబు మిము బ్రోచు నీతి తోననిన'[3]

---

1. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట - 90, డా॥ ఎం. బాగయ్య గారు 1993
2. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట - 82, డా॥ ఎం. బాగయ్య గారు 1993
3. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట - 94, డా॥ ఎం. బాగయ్య గారు 1993

అని చెప్పిన రాముని మాటలు పురప్రజలకు రుచింపక వారిట్లని

"భరతుడేలను మాకు భువనంబునేల - మరలవు నీమీది మమ
నీ వెంట వత్తుము నీవు వద్దన్న - కావివస్త్రంబులు గైకొందుమని:
తమ నిర్ణయము రామునకు విన్నవించుకొనిరి. శ్రీరాముడు న:
అక్కడనే నిదురించుటకు నిశ్చయించుకొని అర్ధరాత్రి ప్రజలందరు అదమరచి
సమయమున రథమును అయోధ్యకు కొనిపొమ్మని సుమంత్రునకు చెప్పి
లక్ష్మణులతో కలిసి గుహుని పడవలో ఆవలి తీరము చేరెను. పౌరులంద
జూడగ శ్రీరాములు కనబడరయిరి. రథ చక్ర చిహ్నములు చూడ అ
పోవుచున్నవి. శ్రీరాముడు రథమునెక్కి అయోధ్యకు మరలి వెళ్ళెననుకొని
అయోధ్యకు చేరుకొనిరి.

"........................ - మేల్కొని శ్రీరాము వెదకి
గానక రథ చక్రగతుల చొప్పరసి - మానవేశ్వరునాజ్ఞమన రామచ
డరిగెనయోధ్యకు నని నిశ్చయించి - పురజనుల్ సాకేతపురికేగుదెం
రని సామాన్య ప్రజల ఆలోచనను కన్నులకు కట్టినట్లు చెప్పియు:

## తార విలాపము :

శ్రీరాముని బాణమునకు వాలి కూలినప్పుడు తార విలపించిన
నిందించినది.

"ఓ! రాఘవేశ్వర యో మహావీర - వూరకే వాలినిట్లొగి చంపతగునే
నీనీతి నీమతి నీదు విఖ్యాతి - జానకి వెంటనే జనియెనో జెపుమ
దేవేంద్ర నందను తెగటార్చినట్లు - దేవనన్నిప్పుడు తెగటార్చుమన
నీనీతి, మతి, కీర్తి అన్నియు సీతతోడనే పోయినవా? వాలిని చంపి
చంపుము. నాథుడు లేని నా జీవితమెందుకు? అని విలపించినది. తారా
సహజత్వమును తెలుపుచున్నది.

1. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట - 94,95 డా॥ ఎం. బాగయ్య
2. ఏకోజీ రామాయణము - అయోధ్య కాండము - పుట -95, డా॥ ఎం. బాగయ్య
3. ఏకోజీ రామాయణము - కిష్కింధా కాండము - పుట - 15 ద్వి.సంపుటి. డా॥ ఎం. బాగ

**భీషణుడు రావణునకు నీతి చెప్పట:**

రావణుని సోదరుడైన విభీషణుడు సీతను రామునకప్పజెప్పుమని, తద్వారా ంశము, ప్రాణములను కాపాడుకొనుమనెను.

ను రాక్షసేశ్వరా! విక్రమోదార! - చనటి మంత్రుల మాట చెవిబెట్టవలదు
ని లంకకు దెచ్చినమొదలు - దేవ! యీ పురలక్ష్మీ దీనయై పొలిచె
ుచున్నది మహా దుర్నిమిత్తంబు - లేచందమున జూడనిది బుద్ధిగాదు
కజ గొంపోయి సరగున రామ - జనపాలమణి కిచ్చి శరణంబు జొరుము
వంశ గరిమెను నీ జీవములను - నీవారి నెల్లను నీవు రక్షింపు
ని చిలుకకు చెప్పినట్లు ముమ్మారు - చనబుద్ధి యా విభీషణుడు చెప్పినను"[1]

అని విభీషణుడు చిలుకకు చెప్పినట్లు రావణుని చెవినిల్లు కట్టుకొని చెప్పెను.

**వణుడు విభీషణుని తన్నుట :**

సీతను గొనిపోయి శ్రీరాముని కిచ్చి శరణు వేడుమని చెప్పిన విభీషణుని టలకు కోపవివశుడైన రావణుడు విభీషణుని తన్నెను.

.................................. - బుద్ది యా విభీషణుడు చెప్పినను
రావణుండు కోపవివశుడై జూచి - తన తమ్ముడనకనుతన్నె తన్నుటయు
విభీషణుడు శోకా క్రాంతుడగుచు - వే వేగ రాక్షస విభునికి మ్రొక్కి
ణా విను నీవు రాముబాణాగ్ని - కావరంబున గంగ్రాగెడు నాడు
చుము నా బుద్ధి తలపున నన్ను - తలచు మటంచును తరలె యాక్షణమే"[2]

విభీషణుడు రావణునకు మ్రొక్కి " నీవు రామబాణాగ్నిచే క్రాగెడునాడు నన్ను, మాటలను గుర్తు తెచ్చుకో" అని చెప్పి శ్రీరాముని శరణు వేడుటకై వినువీధిన రులున్నచోట దిగి శ్రీరాముని శరణు జొచ్చెను.

**నుమంతుని పిడికిలి దెబ్బకు రావణుడు మూర్ఛిల్లుట:**

హనుమంతుడు రావణుని తేరుపైకి దుమికి కోపముతో దూషించెను. రావణుడు జనేయుని పక్షంబున బొడవగ, ఆంజనేయుడు పిడికిట బొడవగనే రావణుడు ర్ఛజెందును.

---

కోజీ రామాయణము - యుద్ధ కాండము - పుట - 59, 60 ద్వి.సంపుటి. డా॥ ఎం. బాగయ్య గారు 1993
కోజీ రామాయణము - యుద్ధ కాండము - పుట - 90 ద్వి.సంపుటి. డా॥ ఎం. బాగయ్య గారు 1993

"వాయుజుండపుడు రావణు తేరుపైన - పాయక దుమికి కోపమున నిట్లనియె
ఓరి! రావణ ఏనరోరి మూఢాత్మ - యీ రేడు జగముల ఇంద్రాది సురుల
క్రౌర్యంబును వీడక త్రుళ్లించు నీచు - త్రుళ్లనంబే చోటు తొలగించె ననిన
వీక్షించి రాక్షస విభుడాంజనేయు - వీక్షించి బొడిచిన వణకి వాయుజుండు
వడిచేర్చి రావణుని వక్షమ్మునపుడు - పిడుగుతో సరియైన పిడికిట బొడువ
పడి మూర్ఛజెంది వెంబడి మూర్ఛదెలసీ - ..........................."[1]

మూర్ఛిల్లి లేచిన రావణుడు హనుమంతుని కొనిడాయెను.

"........................రావణుండనిలజజూచి - నీలావు కొండాడ నేనెంత వాడ
మేలు పావని నిన్ను మెచ్చితిననిన - ................................"[2]

హనుమంతుని పరాక్రమమును మెచ్చుకొన్నాడు రావణుడు

**కుంభకర్ణుడు రావణునకు హితవ చెప్పట :**

రావణునాదేశానుసారము భటులు కుంభకర్ణుని నిద్రనుండి మేల్కొల్పగా కారణము తెలుసుకొనుటకు ఇట్లు పలికెను.

"రక్కసులరీతి రాయడి సేయ - నొక్కంత మేల్కొని హమ్మని నీలిగి
బడబాముఖాగ్నియై పరగిన నోరు - తడయక తెరచి వింతగ నావులించి
శ్రీరాముచే ముక్తి చేకొన కోరి - దూరంబుగా నిద్ర తోసిన మాగడ్కి
ప్రళయకాలాగ్ని బింబములు బోలు - కలయంగ నెఱ్ఱని కన్నులతోన"[3]

కవి కుంభకర్ణుని రూపమును హాస్యాస్పదముగా వర్ణించి రక్తి కట్టించెను.నిద్ర లేపిన కారణమేమని అడిగి విషయమును గ్రహించిన కుంభకర్ణుడు రావణునకు నీతి చెప్పెను.

"విని కుంభకర్ణుండు విభుదారి కనియె - మును రాము భార్యను మ్రుచ్చిలి నీవు
తెచ్చినప్పుడే కీడు వెచ్చితి వధిప! - యిచ్చట పునరుక్తు లేమికి నీ కను

---

1,2. ఏకోజీ రామాయణము - యుధ్ధ కాండము - పుట - 90 ద్వి.సంపుటి. డా॥ ఎం. బాగయ్య 1993

3. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము - పుట - 90 ద్వి.సంపుటి. డా॥ ఎం. బాగయ్య గారు 1993

తుదమొదలెఱుగక దుర్మదంబునను - పదరి యెవ్వడు కార్యభాగంబుసేయు
వాడాపదల బొందు వాడంచు విందు - వాడననేల ? రావణ నీవెసుమ్మి"[1]

అని పలికిన మాటలలో కుంభకర్ణుని సుబుద్ధి గోచరించును. కుంభకర్ణుడు రాక్షసుడైనను పై మాటలతో సత్ప్రవర్తకుడైనాడు. ఇది ముక్తి ప్రసాదితమైన కల్పన.

**విభీషణుడు రావణ మరణ రహస్యమును తెలియచేయుట :**

శ్రీరాముడు రావణుని వధించుటకై ఎన్ని బాణములు వేసినను మరణించలేదు. రాముడలసిపోవుటను గమనించిన విభీషణుడు రావణుని మరణరహస్యమును తెలిపిన విధము.

"దేవ! రాఘవ వీడు తెగడెందు చేత - వావిరి సుధనాభి పడినుండజేసి
అనల బాణం బేసి అమృతమింకించి - మునుకొని బ్రహ్మాస్త్రము నేసి చంపు"[2]

అని విభీషణుడు రావణవధను నిర్దేశించెను. దుర్మార్గుని చంపి ధర్మాన్ని రక్షించుటకు స్వపర భేదము ఉండరాదను రహస్యమును విభీషణుని పాత్ర ద్వారా కల్పించినాడు ఏకోజీ కవి.

ద్విపద రామాయణములలో సంపూర్ణ రూపములు దాల్చినవి మూడు గ్రంథములు మాత్రమే. మొదటిది గోనబుద్ధ భూపతి కృతమైన రంగనాథ రామాయణము, రెండవది కట్టా వరదరాజకృతమైన శ్రీరామాయణము మూడవది ఏకోజీ కృతమైన ఏకోజీ రామాయణము. ఈ ముగ్గురు రాజకవులే. ముగ్గురును రామకథను ద్విపదలో రచించిరి. ఈ మూడు రామాయణాల్లో అవాల్మీకాంశములనేకములు. రంగనాథ, శ్రీ రామాయణాల్లో కన్న ఏకోజీ రామాయణములో అవాల్మీకాంశముల సంఖ్య తక్కువనే చెప్పవచ్చును. నవరసభరితమైన ఈ ఏకోజీ రామాయణము వర్ణనా బాహుళ్యమై అచ్చతెనుగు పద శోభితమై మోక్ష ప్రదాయినియై యొప్పుచున్నది.

---

1. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము - పుట - 99 ద్వి.సంపుటి. డా॥ ఎం. బాగయ్యా గారు 1993
2. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము - పుట -140 డా॥ ఎం. బాగయ్యా గారు 1993

# పంచమ ప్రకరణము

# సమకాలికాంశముల ప్రతిఫలనము

కవి కర్మ కావ్యము. "కీర్తి ధనము, అమంగళక్షితి, వ్యవహార నేతృత్వము, సద్యఃపర నిర్వృతి, కాంతా సమ్మితోపదేశము"[1] ఫలములుగా నెంచి కవి కావ్యమును రచించును. "సత్కావ్య నిషేవణము, ధర్మార్థ కామ మోక్షములందు కళలందు నైపుణ్యమును, ప్రీతి, కీర్తులను, కలిగించును.[2] లోకమునందు, బుద్ధిమంతులకు కావ్యామృత రసాస్వాదనలు, కావ్యశాస్త్ర వినోదముల తోడను, మూర్ఖులకు నిద్రతోడను కాలము గడచును. కవులు కావ్యములు రచించుటయు, సహృదయులు పఠించి, ఆనందించి, రసానుభూతి పొంది, తమ జీవితమును బాగు పరుచుకొనుటయు, పండితులు పరిశీలించి విమర్శనలు చేయుటయు సహజ ప్రవృత్తి. కవులు నిష్పక్షపాత వైఖరిని అవలంబించి విమర్శించవలయును. ఇతివృత్తము ఇహపరమైనచో భగవత్కథయగును. అట్టి కథలు చరిత్రను, సంఘమును, సామాజిక స్థితి గతులను ప్రతిబింబింప చేయును.

శ్రీరాముని పట్ల సమస్త కవులు సమభావమును ప్రకటించుకొనగా కొందరు సీత యెడల కరుణ రసమును మిక్కిలిగా పోషించి కన్నీరు మున్నీరుగా విలపింపచేసిరి. గానయోగ్యమైన రచనలు వెలువడిన తర్వాత జానపద, ద్విపద సాహిత్యములకు కీర్తి దక్కినది.

ఈ కోవకు చెందినవే రంగనాథ రామాయణము, ఏకోజీ రామాయణములు. రెండును ప్రాచీన రామాయణముల పాత్రలనే పోషించినను, వీటికి కొంత స్వయం

---

1. మమ్మటుడు - కావ్య ప్రకాశము - ప్రథమోల్లాసము - శ్లో - 2
"కావ్యం యశసేర్థకృతే వ్యవహార విదే శివేత రక్షతయే।
సద్యః పర నిర్వృతయే కాంతా సమ్మిత తమోపదేశయుజే॥"

2. భామహుడు - " ధర్మార్థకామ మోక్షేషు వైచక్షణ్యం కలాసుచ ।
కరోతి కీర్తిం ప్రీతించ సాధు కావ్య నిషేవణం॥"

ప్రతిపత్తి గలదు. ఇట్టి పాత్రలు, సన్నివేశములన్నియు అవాల్మీకములే. మూలాన్ని దాటి రసానందభరితము చేసిన కావ్య రాజములు యీరెండు గ్రంథములు.

అహల్య పాత్ర చిత్రణలో అమూలకమైన వర్ణనచే సమకాలీన ప్రతిఫలనము గావించిరి. రాముడహల్యకు శాప విముక్తి గావించినప్పటి దృశ్యము కన్నుల ముందు కదలాడును.

"మొగులెల్ల విరియ సోముని కళ వోలె - పొగయడంగిన హవ్య భుక్కీల వోలె
కలక దొలంగిన కమలిని వోలె - బలు కసటుడిగిన బంగారు వోలె"[1]

అహల్య తన తొల్లిటి రూపము ధరించినట్లు బుద్ధరాజు చిత్రించినాడు. మూల రామాయణములో యీ వర్ణనా ఛాయా మాత్రమున గలదు.

కుంభకర్ణుడు, యుద్ధమునకు బయలు దేరునపుడు మేఘములు అగ్నిపిడుగుల కురిపించుట, భూమి కంపించుట, చుక్కలు రాలుట, తనకు ప్రతికూల వాయువులు వీచుట, మూల రామాయణములో కొంతగలదు. దానినే రంగనాథ రామాయణ కర్త నాటి అరాచక ప్రవృత్తిననుసరించి ఉత్పాతములు సంభవించుటను కల్పించెను. సాంఘిక దురాచార వర్తనుల పట్ల అనాసక్తిని పెంపొందించెను.

"దౌర్జన్యమున దుష్టదానవ నీవు - పర్జన్యు నేచిన ఫల మింక గడువు"
మని రాఘవునకు దోడై వచ్చి పేర్చి - తనరార వాని వదల్చిన మాడ్కి
గలయంగనప్పుడు కాల మేఘంబులు - పలుమాఱు బిడుగులు పరగించె మ్రోసె
"ఢోరంబుగా వార్చిత్రుళ్ళెడు వీడు - ఘోరాహవక్షోణి గుపితుడైనట్టి
తారాధిపతి చేత దాను రూపఱుట - కీరాజవరునిచె నిటగూలు టకును
దారు సాక్షులమని తగజెప్పు కరణి - దారలు ఝల్లుచు ధరణిపై బడియె
తను మును నొంచిన దానికై యనిలు - డనయంబు రాముని యాన నీయసుర
బడవైతు"నని పేర్చి పరగిన మాడ్కి - పడిగొని ప్రతికూల వాయువుల్ వీచె
"రాముడు సంపనీ రాక్ష సాథముడు - నామీద బడునపుడు నాకెంత వ్రేగు
పుట్టునో" యని భీతి కంపించు - నట్టి చందంబున నవని గంపించె"[2]

---

1. రంగనాథ రామాయణము - బాలకాండము - పుట 58 ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 1942
2. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము పుట 461 ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942

నని దుర్నిమిత్తములను కల్గించినాడు. ఇచట భూమి మీద భారము పడుట వలన కంపించును. చేతనుల యందు భయము వలనను కంపన మేర్పడుట విశేషధర్మము. భయము చేత కంపించుట సహజ గుణము. కుంభకర్ణునిది బృహత్కాయము. ఇతని బరువు చేత భూమి కంపించుట సహజ లక్షణము. అతడు పడక ముందు భయము - పడిన తర్వాత భయమును వివరించినాడు. తారలు రాలుట ప్రకృతి ధర్మము. త్రుళ్ళిపడుట, రూపఱుట, నేల గూలుట లోకస్వభావము. తారాపతన వర్ణనము నందలి ప్రతిమాట ఉత్ప్రేక్ష భావికాలమును హెచ్చరించును. ఇట్టివి మూలము నందు సాధారణముగా నున్నను, రంగనాథ రామాయణము నందు మిక్కిలిగా రచింపబడినవి.

శ్రీరాముడు సీతాదేవి లంకలో నున్నదని తెలుసుకొనిన తరువాత కడలిని జూచి శోకించెను. సూర్యాస్తమయమయ్యెను. మూలము నందు ఒకే శ్లోకమున్నది.

"ఏవం విలసితస్తస్య తత్ర రామస్య దీయతాః
దీనక్షయాన్మంద రుచిర్భా స్కరోస్తముపాగమత్"[1]

అని రంగనాథ రామాయణములో బుద్ధారెడ్డి యీ అవకాశము జారవిడువలేదు. లక్షణోక్తిని పాటించి, మహా కావ్యోచితమయిన సంధ్యాదివర్ణనలను గావించినాడు. ఇవి ప్రకృతి పాత్రలతో తదాత్మ్యము గావింపబడిన ఉత్ప్రేక్షలై స్వతంత్రములైన వర్ణనా పటిమకు నిదర్శనములైనవి.

"అని రామ విభుడు శోకాంబుధిలోన - మునుగు చుండగ మూడు మూర్తులు గలిగి
యతని తోడిదె లోకమనిన చందమున - నతి వేగమున నిను డపరాబ్ధిగ్రుంకె"[2]

"ఇనుడు గ్రుంకిన యపుడెల్ల లోకములు - పెను పేద మణి లేని పెట్టియ బోలె
మనసి జానల తప్తమానసు రాము - గనుగొని తనువుగా గప్పెడు కొఱకు
జెలువొందనపరాబ్ధి చెంగావి చీర - నెలమి దెచ్చిన క్రియ నెరసంజ యొప్పె"[3]

సంధ్యాకాల సమయము, సూర్యాస్తమయము మనసి జానలుడగు శ్రీరామునకు చెంగావి చీర కప్పుట కొఱకా? యనునట్లు సంధ్యవేళ సమీపించెను.

---

1. వాల్మీకి రామాయణము - యుద్ధకాండము - సర్గ - శ్లో 22
2,3. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 330 ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942

"శ్రీరామ దేవుని శిత మార్గణముల - నా రత్నములు దక్క నంబుధి యింకి
యీ రూపమున నుండు నినుని మాడ్కి - తారకావళి చేత దనరారెమిన్ను
ఆనిశీధిని రామునంగ తాపంబు - కైనిభిడంబుగా నావరించి యున్న
సారంబపుమల్లికా శయ్య నానొప్పి - తారలు ప్రతి బింబితములయ్యేనబ్ధి"[1]

ఆకాశమున గల చుక్కలు సముద్రుని నీటిలో రత్నములున్నట్లు ఆ రాత్రి అంగతావములు సవరించుకొనుటకు వెలసిన మల్లెపూల శయ్య యనునట్లు తారలు కన్పించుచున్నవని అతిశయోక్తి శ్రీరాముడు క్షీర సముద్రమున ఆదిశేషుడు శయ్యగా పవళించే విష్ణుమూర్తియని చెప్పకయే చెప్పినాడు.

"రాజనై యేను వారాశి యుచ్చింతు - రాజవై నీవు వారాశి యింకింప
దలచుట పాడియే ధరణీతలేశ? - విలసిత సత్కళాన్వితుడవు నీవు
నటు చేసితేని దోషాకరత్వంబు - పటు వృత్తినీ యందు ప్రభవించుననుచు
దూఱి వచిన మాడ్కిదోచె జందురుడు - మీఱిన కరములు మిన్నులు ముట్ట
జనకజపై రామ జననాథ తిలక - ననుతలదాల్చి మన్నన చేసినట్టి
హరువిల్లు విఱిచిన యా దోషముననను - విరహివైతివి సీత వెఱపుననుచు
చందురు డట్ట హాసము చేసెననగ - నందంద చంద్రికలతిశయంబందె"[2]

నిజజీవితములో మానవులు, కావలసిన వారికి ఆపదలో సహకరింతురు. వైరులు నిందలు వేయుదురు. ఇది ప్రకృతి స్వభావము. విరహావస్థలోవున్న రామునికి శైత్యోపచారములు చేయుట స్వభావము. అందుచే చంద్రోదయ చంద్రికలు అట్టహాసము చేసినట్లును మానవ దృష్టిలో సరసముగా నిరూపించెను. ఈ పద్ధతి తోటి కవుల రచనలోని భావలక్షణ ప్రతిఫలనమునకు మచ్చుతునక.

రంగనాథ రామాయణము నందలి వర్ణనలు సందర్భోచితములై, దీర్ఘములై సరసముగా గోచరించును. కవిచేసిన రచనాకథనమును నాల్గు విధములుగా విభజింపవచ్చును. 1. యథా మూలములు, 2. స్వతంత్రములు లేదా అమూలకములు, 3. అన్యథాకరణములు, 4. పరిత్యక్తములు.

---

1. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 330 ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942
2. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 331 ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942

1. యథా మూలములు : మూల రామాయణము నందలి వర్ణనలను యథాతథముగా గ్రహించి తెలుగు నుడి కారముతో అనువదించిన ద్విపదలు యథా మూలకములు. ఇట్టి ద్విపదలకు రంగనాథ రామాయణము పెట్టింది పేరుగా విలసిల్లుచున్నది. వానిలో కొన్నిటిని పరిశీలింతము.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు కౌశాంబి వృత్తాంతమును తన వంశక్రమమును వివరించెను. అప్పటికి అర్ధరాత్రియయ్యెను. అట్టి దృశ్యమును కవి యిట్లు వర్ణించుచున్నాడు.

"నడురాత్రి యరుదెంచె నరలోకనాథ - కడు డస్సినాడవు కను మోడ్చు గాక
చలియింపకున్నవి సకల వృక్షములు - మెలగవు వన భూమి మృగ సమూహములు
నెఱి విహంగములు నీడముల్ చేరి - మరచి యున్నవి తమ మంజుల ధ్వనులు
యామినీ చరులైన యక్షరాక్షసులు - భూమి విచ్చలవిడి, బొరి చరించెదరు
దీటుగా జీకటి దెసలు నాకసము - కాటుక బూసిన కరణి నున్నదియు"[1]

శ్రీరాముడు పంచవటి నందున్నప్పుడు హేమంత ఋతువు వచ్చినది. అప్పటి ప్రకృతి వర్ణన దృశ్యము.

"అడవి యేనుగులు నీరాన నీ నదికి - దుడిదుపి వచ్చి తత్తోయంబుదొడికి
నడికి గిఱ్ఱనుచుదుండములు వేవేగ - మడిచి పాఱెడిని దమ్ముడ విలోకింపు[2]

అని రాముడు లక్ష్మణునితో కాల ప్రభావము తెలియచేయు సందర్భములోనిది.

హనుమంతుడు లంకలో మండోదరిని జూచి సీతయని భ్రమపడినప్పటి వర్ణన

"అవనిజనే గంటి ననుపమా నానంద - వివశుడై గంతులు వేయుచు నచటి
కంబముల్ ప్రాకుచు కలిత వాలాగ్ర - చుంబనం బొనరించు నటించుచును"[3]

ఇట్లు బుద్ధారెడ్డి తనకు నచ్చిన వర్ణనలను యథేచ్ఛగా అనువదించినాడు.

---

1. రంగనాథ రామాయణము బాలకాండ పుట - 39 ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు
2. రంగనాథ రామాయణము పుట 175 ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942
3. రంగనాథ రామాయణము - పుట. 282 ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942

## 2. స్వతంత్రములు లేదా అమూలకములు :

రంగనాథ రామాయణమును తులనాత్మక దృష్టితో చూచినపుడు అమూలకము లనేకములు కన్పించును.

వానరులు సేతు నిర్మాణము చేసినపుడు సూర్యాస్తమయమైనది. చంద్రోదయ వర్ణన రంగనాథ రామాయణములో గలదు.

"కృత కృత్యుడగు రాముకీర్తి పుష్పములు - చతురతమై వెదజల్లిన యట్లు
కరమొప్ప జుక్కలు గాన్పించెమింట - వరకరాయతి సీమ వలరాజు మామ
పొలుపొందు కలువల పోరాని విందు - కలసిన జక్కువ కవ్రబాపు మందు
శూలి యౌదల పువ్వు జుక్కల నవ్వు - ..............................................
.................................................. - సరసిజ రిపుడైన చంద్రుండు వొడిచె
నిను పొరి కలశాంబునిధి వెల్లివిరిసె - ................................"[1]

సీతాన్వేషణకు బయలుదేరిన ఆంజనేయుడు, లంకలో అవనిజను గాంచి మేను పెంచి మందర పర్వతముతో సమానుడై నిలబడెను. నక్షత్రములు తలకు తాకినట్లున్నదని వర్ణించుట గలదు. ఇంకను ఈ నక్షత్రమాల మెడదండయై మొలత్రాడుయై, ఘంటలై, కాలిమువ్వలై పరిఢవిల్లినవి. ఇట్టి వర్ణన మనోహరమై హృదయమును హత్తుకొనునట్లుగా సహజత్వముతో నున్నది.

శ్రీరాముడు ఋష్యమూక పర్వతమును గాంచినపుడు మంజుల ప్రకృతి గతమై కథాకథనములకు యోగ్యమైనది. మనోహర భావము, సుందర శబ్ద భావము, అలంకారములు గలవు.

వర్షఋతు వర్ణన వెనుక శరత్కాల వర్ణన స్వతంత్రముగా నున్నది. ఈ వర్ణన మూలము కంటె సామాన్యుని కందుబాటులో నుండునట్లు వర్ణితమైనది.

ఇట్లు రంగనాథ రామాయణమునందు అమూలకములైన ప్రకృతి వర్ణనలకు కొదవలేదు. పాత్రోచితములైన వర్ణనలెన్నియోగలవు.

1. రంగనాథ రామాయణము - యుద్ధ కాండ 1026 - 1033 ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942

శబరి శ్రీరామునకు భక్తి పారవశ్యమున తాను ముందుగా రుచి చూచిన ఫలముల నొసంగును. ఇట్టి విధానము ఆయా కాలములలోని సాంఘిక సంప్రదాయములను గ్రహించి కవులు కల్పించిరి.

జంబుకుమారుని వృత్తాంతము రంగనాథ రామాయణములో గలదు. శూర్పణఖ, విద్యుజ్జిహ్వుల కుమారుడుగా వర్ణించబడియున్నది. విద్యుజ్జిహ్వుని చంపిన రావణాసురునిపై పగబూని తపస్సు చేయుట స్వతంత్ర కల్పన. ఇట్టి కల్పన ఆనాటి ప్రజల సాంఘిక స్థితిగతులు, సంప్రదాయములు, ప్రతీకారములను తెలియ పరుచుచున్నది. కంస, శ్రీకృష్ణుల కథను జ్ఞప్తి యందుంచుకొని జంబు కుమారుని కథను కవి కల్పించి యుండవచ్చును.

లంకలో హనుమంతుని తోకకు నిప్పు పెట్టినపుడు అతడు అగ్ని సూక్తములగు బ్రహ్మ మంత్రములు చదువుటయు, బ్రహ్మ పాశములూడుటయు రంగనాథ రామాయణములో గలదు. ఇది వైదిక ధర్మమును, కథా శిల్పచాతుర్యమును వెల్లడించుచున్నది.

రంగనాథ రామాయణము యుద్ధకాండమునందలి విభీషణుని వృత్తాంతము వాల్మీకి రామాయణమున కన్పించదు. రంగనాథ రామాయణములోని బాలకాండమున హిరణ్యకశిపుడే రావణాసురినిగా జన్మించినట్లున్నది. ఇట్టి విషయము పురాణ ఫక్కీన సాగినది.

రావణుని తల్లి కైకేసి, వేదవతిగా సీతగా జన్మించినదనియు, రాముడు నారాయణుడేనని, సీతను రామునకు అప్పగించమని హితోపదేశము చేసినది. మాతృ సందేశము, ఆశీర్వచనములు, పూజలు మొదలగు విషయములను లోకములోని సాంఘికాచారములను బుద్ధారెడ్డి గ్రహించెను.

రావణుడు యుద్ధ సమయమున, శ్రీరాముని పరాక్రమము, ఆంజనేయుని వీరత్వము, ధైర్యములను ప్రశంసించుట, విభీషణుని బుద్ధి, త్రిజట స్వప్నము, కుంభకర్ణుని నిద్రహారములు, నాగపాశ బంధనము, లంకాదహనము, విభీషణ కుంభ కర్ణుల సమావేశము, సంభాషణములు నాటకీయముగను నవరసభరితములుగను సృష్టించిన కవి ఘనుడు.

### 3. అన్యథాకరణములు :

రావణుడు సీతాదేవిని వెఱపించుటకు విద్యుజ్జిహ్వునిచే రాముని మాయా శిరస్సులు దెప్పించి ముందు పడవేయించెను. అప్పుడు జానకి కైకను నిందించుచు తెగిన అరటిచెట్టువలె భూమి మీద పడిపోయినదని మూల వర్ణనము. దానినే రంగనాథ రామాయణమున

"తలపోసి రాముని తలయ కాదలచి - బలు మూర్ఛ పాల్పడి పడియె ధరిత్రి
నిదిబొంకు, నాపతి కేమియుగాదనుచుఁ - ..................................
దన యుర స్థలికి నా తన్వంగిఁదివిచి - కొనియెనోకాక, యా కుంభిని యనగ"[1]

మూలమునందలి ఉపమానము పతన ధర్మమును తెలియపర్చుచున్నదను భావన కల్గుతున్నది. గోనబుద్ధారెడ్డి ఈ సన్నివేశమును ఓదార్పుగా వర్ణించి చెప్పినాడు.

అమాయకమైన కూతురు ఆపదలోనున్న నిజము గ్రహింపక శోకించుచుండిన, యథార్థము దెలిసిన తల్లి బిడ్డను ఉరమునకు చేర్చుకొని బుజ్జగించుట నైజము. సీతాదేవి భూమిజ గావున 'భూమి మీద పడుట' యనునది తల్లి తన బిడ్డను దగ్గరకు తీసుకొన్నది యని యుత్ప్రేక్ష చెప్పబడినది. కవి యిచట లోక ధర్మమును ప్రతిపాదించుట మూలము కంటె మనోహరముగా నున్నది.

హనుమంతుడు సముద్రమును లంఘించునపుడు వాల్మీకి 'అతని యూరువేగోత్థములైన వృక్షములు హనుమంతుని వెంట స్వబంధువువోలె కొంత దూరమేగి తరువాత మహేంద్రుని భయమున పర్వతములు వోలె జలధిలో పడెను' అని వర్ణించియున్నాడు. ఇట్టి వర్ణన లోకాచార, పౌరాణిక కథల సమ్మేళనముతో నేర్పడియున్నది. వీనినే బుద్ధ భూపతి ఉపమలుగా మార్చి ప్రధాన కథాంశముతో సంబంధము కలిగించినాడు.

" ఆ యువడి మ్రాకు అతనితో నెగసి - తోయధిలోఁజొచ్చి తునియలైరాలె
భావి సేతువునకై పవన నందనుడు - తావచ్చి శంకువు స్థాపించెననగ"[2]

---

1. రంగనాథ రామాయణము - ద్విపద - 1685 - 1687 యుద్ధకాండ -ఆంధ్ర విశ్వ కళా పరిషత్ - 1942
2. రంగనాథ రామాయణము - కిష్కింధా కాండము - 1258 - 1259

ఎంతటి మనోహర వర్ణన శ్రీరాముడు లంకకేగుటకు సముద్రమున సేతువును నిర్మించుట భావి కార్యము. పవన తనయుడు తత్సేతువునకై శంకువును స్థాపించినాడో యనునట్లు మ్రాకులు సముద్రములో పడిన వనుటలో భావికథా సూచన ద్యోతకమగుచున్నది. ఇచ్చటి ఉత్ప్రేక్షాలంకారము మూలమునకు వన్నెపెట్టినది.

హేమంతమున మంచు కురిసి భూమి పచ్చిక.తొడిగినది. తొలినాడు వికసించిన పద్మముల రెక్కలు శీర్ణములై సరోవరము నిండ వ్యాపించినవని చెప్పిన ద్విపద పాదములు మూలమునకు ముత్యాల పేరులై యమరినవి.

"ఉర్విపై నా మంచు నొక్కొక్క చోట - దూర్వాంకురంబుల తుదల జాచితివె
పచ్చమిన్న సలాక పౌజుపై వేద్క - గ్రుచ్చిన ముత్యాల క్రోవలై యొప్పె"[1]

అని మనోజ్ఞ భావనను వెలువరించినాడు. హేమంత ఋతువులో చలికి తట్టుకొనలేక కుంపట్లను ఉపయోగించుటలోక దృశ్యము.

"పొదిగొన్న యకరువుల్ మీద - గదలు తేటులు పొగల్ గాఁజలిగొన్న
కొలను దేవతలకు కుంపట్లు వోలె - విలసిల్లు కెందమ్మి విరులు జూచితివె"[2]

అని యెంతో చక్కగా వర్ణించినాడు.

## జాను తెనుగు శైవస్థితి

రంగనాథ రామాయణము అన్ని గుణముల చేతను నగ్రగణ్యామే. దేశి కవిత్వమును మెచ్చని మార్గాభిమానులు ద్విపద కావ్యమును త్రోసి పుచ్చి ఆయా పద్య కావ్యములనే యాదరించినను దాని ప్రశక్తికి విఘాతము కొని తేజాలక పోయిరి. రంగనాథ రామాయణము ఆద్యంతము నొక చేతి మీదనే ధారావాహికగా నడచిన రచనయగుట చేత నెట్టి లోటు లేక ప్రతి ప్రకరణము గుణాస్పదమై నెగడినది. వాల్మీకి రామాయణము వలె నిదియు "పాఠ్యేగేయేచ మధురమై" పాటగా పాడుకొనుటకు అనువై కావ్యముగా చదువుకొను వారికిని సమాదర పాత్రమై, పండిత, పామర ఆమోద యోగ్యమై, సార్వజనీనమై ప్రసిద్ధ గ్రంథమైనది.

1. రంగనాథ రామాయణము - అరణ్య కాండము - 247 - 248
2. రంగనాథ రామాయణము - అరణ్య కాండము - 252 - 253

ద్విపద కావ్యములు గేయ భావమును సంరక్షించునవగుటచే ప్రజాలోకమున వీని వ్యాప్తి పద్య కావ్యముల కంటదు. ఈ రహస్యము గుర్తించిన సోమనాథాది శివకవులు మత ప్రచారమునకై ద్విపద కావ్యములను రచించిరి. వీని నరికట్టనశక్యము. ఈ ద్విపద రామాయణ వ్యాప్తి ఆంధ్రలోకమున అమరకావ్యమైనది.

దేశీయతామహితమైన యభిరుచిని తృప్తి పఱచగల కవులే మహా కవులుగా. జాతీయ కావ్యకర్తలుగా పూజింపబడుదురు. ఈ కోవకు చెందినవాడే గోనబుద్ధారెడ్డి. మార్గకవిత్వమునకు తట్టుకొనక కోమలమైన దేశికవిత, రాజబాటలు, నగరములు దాటి పల్లెలు చేరినది. సహజ సౌందర్యముగల ముగ్ధ సరస్వతికి కొంత ప్రౌఢ వేషము వేసి, నాగరిక మర్యాదలు నేర్పి సభాప్రవేశం కలిగింప వలెనని పాటుపడిన ద్విపద కావ్య కర్త వీరు. దేశికవితాభిమానమును ఒక వంక, ఇంకొక వంక విద్వత్కవి. కీర్తి కాంక్షను నణచుకొనలేక యుభయతారకమైన మార్గమును త్రొక్కి కొంతవరకు చరితార్థులైరి. ఇట్లనుట యెవరిని కించపరచినట్లు కాదు.[1]

ద్విపద మార్గమును ద్రొక్కిన మొదటివాడు సోమనాథుడు. బుద్ధారెడ్డి ద్విపద కావ్యము, లక్షణయుక్తమును సర్వ పూజార్హమగు రామచరితమును నగుటచే అందరికి శిరోధార్యమైనది. అందువలన తెలుగు ద్విపదములలో అగ్రగణ్యమయినది

గేయకవిత్వ, పదకవిత్వ, దేశికవిత్వ కవులే ద్విపద శాఖకు జాతి రత్నములుగా నిలిచిరి. సంస్కృత భాషకు వివిధ హేతువుల వలన కలిగిన ఫలములనేకములు అందులో కొన్ని :

సాంఘికము : అనాడు బ్రాహ్మణులకు యెక్కువ ప్రాముఖ్యముండుట. అది సాత్విక దేశకాలములలో సహజము.

సాహిత్యము : అనుకరణ ప్రియత్వము, సాహిత్యాదికళలలో సంస్కృతాది పూర్వ ధోరణులను మెండుగా నవలంబించుట. భాషాంతరీకరణములు, పరివర్తనములు వలె, స్వతంత్రకృతులు, జనసామాన్య భావ ప్రకటన గ్రంథములు. రమారమిగ జూచిన ఈ ప్రాంతముల కవులు విద్యాధురీణులగుట వలన రాజకార్య ధౌరంధర్యమున ప్రగల్భులు.[2]

---

1,2. రంగనాథ రామాయణము - పీఠిక - (పింగళి లక్ష్మీకాంతం) ఆంధ్ర విశ్వ కళాపరిషత్ 1942

భారత స్త్రీలు పతివ్రతలు, వీరమాతలు, వీర పతులని రంగనాథ రామాయణము నందు ఏకోజీ రామాయణము నందు నిరూపితమవుతున్నవి. రావణుని తల్లి కైకసి ధర్మ వర్తనమును గల్గియున్నది. రావణుని భార్య మండోదరి, పరమ పతివ్రత. రావణుని కోడలు సులోచన పతిభక్తి పరాయణురాలు. శబరి మహా భక్తురాలు. కుంభకర్ణుడు రామభక్తుడు. రావణుడు మహాజ్ఞాని. అంధాసుర ప్రవృత్తి కలిగినను దైవ ప్రవృత్తియును గలదు. అతని శత్రువైన శ్రీరాముని బలపరాక్రమములను మెచ్చిన ధీరుడు. రాముడు విష్ణువని యెరింగిన జ్ఞాని.

రావణుడు సముద్రునిపై బ్రహ్మాస్త్రము వేయునపుడు అబ్ధిని పొగడిన తీరు గమనింతము.

"సిరి తండ్రియని పెద్ద సేసితిగాని - హరిమామ యనుచుఁబాలార్చిగాని
యిందుకు తనువేడ నేటికి నాకు? - పొందెఱుంగక పేర్చి పొంగెడు జలధి"[1]

అని కీర్తించుటచే రావణుడు వంశ మర్యాదలు తెలిసిన వాడు, మహావీరుడు కావున మనస్సెరిగి యుద్ధమునకు సిద్ధపడినాడు.

అవాల్మీకమైన అంశము నారదాగమనము ఇతడు దేవలోకము నుండి భూలోకమునకరుదెంచి శ్రీరామునకు రావణుని ద్రుంచుటకే, బ్రహ్మాది దేవతలచే పంపబడితివని చెప్పిన విషయము గోనబుద్ధారెడ్డి కాలము నాటికి ప్రజలు అల్లిన కథ అయివుండవచ్చును. ఆ విషయమునీ విధముగ గ్రహించెను.

"దేవ,నిన్ బ్రహ్మాది దేవతలెల్ల - నావార్ధి మధ్యంబునం దొప్పగాంచి
రావణ బాధాపరంపరల్ సెప్పఁ - గా విని వారిపై గరుణించి నీవు
వారి బ్రోచుటకు రావణుద్రుంచుటకు -ధారుణీ బుట్టితి దశరథేశునకు"[2]

అని కథను కల్పించి ప్రతిఫలము పొందెను. ఈ కథ జానపద వాఙ్మయములోనికి చేరినది. భరతుడు తన తల్లిని నిందించిన తీరు కవి కాలము నాటి మాటలు పోటులుగా వివరించినాడు. తన తల్లి ఈ నాలుగు హేతువులకు మూలమని పేర్కొనెను.

---

1. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 357 ఆంధ్ర విశ్వకళా పరిషత్ 1942
2. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట 414 ఆంధ్ర విశ్వకళా పరిషత్ 1942

" ఏ తల్లికై కానకేగె మాయన్న - ఏ తల్లి కతమున నీల్గెమా తండ్రి
ఏ తల్లి కోర్కెనన్నింతకు దెచ్చె - ఆతల్లి మాతల్లి హతపుణ్యపాక"[1]
ఏకోజీ రామాయణములో సీతాదేవి సౌందర్యమును గూర్చి
"సీత సౌందర్యంబు చెఱవు వర్ణింప - ధాతకైనను వాని తాతకు తరమె"[2]

శూర్పణఖ అన్నయగు రావణునకు చెప్పిన మాటలు. అహల్య అందమును కన్నులకు కట్టినట్లు వర్ణించిన కవి, సీత సౌందర్యమును వర్ణించుటకు మాటలు చాలక బ్రహ్మకైనను, బ్రహ్మ తాతకైనను వర్ణింపనలవి కాదని స్పష్టపరిచినాడు.

రావణుడు 'మాయలేడివి కమ్మని' మారీచుని కోరినపుడు

"......................... - తన కీడుకోరునే ధరనెవ్వడైన
దనుజ భేదన బయోద్దాము శ్రీరాము - మనుజ మాత్రుని గాగ మదినెంచవలదు
శైశవంబున రామచంద్రుని క్రమము - కౌశికాధ్వరమును గనియున్నవాడ
నానాటి మొదలు నేనసుర కృత్యంబు - మాని తపోవృత్తి మౌనినై యచట"[3]

రాముని పరాక్రమమును కౌశిక యాగమున కన్నులార గాంచి యుంటిని. రవియన్నను, రత్నమన్నను నేది ప్రయోజనము లేదు. రాముడన్నను చాలును కలుగు మహాపుణ్యములని రామనామ మాహాత్మ్యమును గూర్చి రాక్షసుని నోట పలికించినాడు. మారీచుని మాటలకు రావణుడు మరింత కోపోగ్రుడయ్యెను. మారీచుడు చెవిటికి శంఖూదిన కరణి రావణుని మార్చ నెంచవలదని దలచెను. ఇట్లు దుష్టుని చేతిలో చావుకంటె, రాఘవునిచేతిలో చావుమేలని యెంచి నీతిని విడిచి, రాముని అమ్ముకు ఆహుతియై కొండవలె గూలెను. ఇది ప్రతిఫలమునకు నిదర్శనము. మంచికోసము మరణమును సైతము ఆహ్వానించుట ధర్మమని రాక్షసుని ద్వారా తెలియపరిచినాడు.

జటాయువు రావణునితో పోరి మరణించెను.

"అంత నా రఘురాముడా జటాయువుకు - వింతగా పరలోక విధులెల్ల దీర్చి"[4]

---

1. రంగనాథ రామాయణము - అయోధ్య కాండము - పుట. 452. ఆంధ్ర విశ్వకళాపరిషత్ 1942
2. ఏకోజీ రామాయణము - అరణ్యకాండము - పుట 132, డా॥ఎం. బాగయ్య 1993
3. ఏకోజీ రామాయణము - అరణ్య కాండము - పుట 133, డా॥ ఎం. బాగయ్య 1993
4. ఏకోజీ రామాయణము - అరణ్య కాండము - పుట - 139 డా॥ ఎం. బాగయ్య, 1993

అని పరలోక విధులను నిర్వహించిన రాముడు స్వర్గలోకపు దారిని చూపెను. శ్రీరాముని కాలములో ప్రజలు సుఖ జీవనము గడుపుటకు హోమములు నిర్వహించిరి. ఆ విషయమును ఏకోజీ రాముని కళ్యాణ సందర్భమున

"మంగళ స్నానముల్ మహిత హోమములు - సంగతిగా నొగి స్నాతక వ్రతము
లరయంగ చేయించె నంత రాఘవులు - ....................................."[1]

అని వివరించెను. జనకుడు తన బిడ్డలను నలుగురిని కన్యాదానము చేసిన విషయములో నాటి సాంఘికాచార వ్యవహారములను వివరించెను.

"..................................... - రవి వంశ మెల్లను రంజిల్లెనంతటను
సౌమిత్రి కూర్మిళ సరస మాండవిని - తామరసాక్షిని తగ భరతునికి
శృతకీర్తి కన్యను శత్రుఘ్నునికిని - కుతుకంబుతో జనకుడు దారబోసె"[2]

వివాహ సమయమున వధూవరులు ఉపవాస దీక్షలో నుండుట ఆచారము. సీతారాముల కల్యాణోత్సవ సందర్భమున

"ధరణితో గూడి దశరథ తనయు - డురు తరభక్తితో నుపవాసముండి"[3]

అని తెల్పినాడు. చలువ పన్నీటిని చల్లించువారు, కలయ తోరణములు కట్టించువారు, మృగనాభి (కస్తూరి)ని అలికించువారు, ముత్యాల ముగ్గులు పెట్టువారు. అందమైన జెండాలు నిలుపువారు, పరుగు చిత్తరువులు వ్రాయించు వారును గలరని కవి రామాయణ కాలమునాటి విషయములను వివరించెను. దశరథుని వినయ సంపన్నతకు ఋషులు, గురువులు తలయూచి ఆనందించువారని తెలియపరిచినాడు. తెలుగువారి పెండ్లి తంతును కవి సవ్యముగా వీక్షించి రచించినట్లు పై విషయముల వలన గ్రహింపనగును.

"............................... - ఇచ్చు సామజముల నిచ్చు నశ్వముల
నిచ్చు దైవంబుల నిచ్చు సౌఖ్యముల - నిచ్చు సదాచార మీపుణ్య చరిత
మెవ్వరు చదివిన నెవ్వరు వినిన - నెవ్వరు వ్రాసిన నెవరు జూచినను
భువిలోన వారికి పుత్ర సంపదలు - నవిరళ భక్తులు నతుల శౌర్యములు

1. ఏకోజీ రామాయణము - అరణ్య కాండము - పుట - 47 డా॥ ఎం. బాగయ్య, 1993
2. ఏకోజీ రామాయణము - అరణ్య కాండము - పుట - 49 డా॥ ఎం. బాగయ్య, 1993
3. ఏకోజీ రామాయణము - బాల కాండము - పుట - 60 - డా॥ ఎం. బాగయ్య, 1993

ఘనమైన కీర్తులు కరితురంగములు - మనసు రంజిల జేయు మానినీమణులు
పరగ దీర్ఘాయుష్య భాగ్యముల్ కలుగు - ధరణిలో నా చంద్ర తారార్కముగను"[1]

రామకథ చదివిన, వినిన, వ్రాసిన, చెప్పిన, చూచిన భోగభాగ్యములు కల్గి సురలోక ప్రాప్తి కలుగునని, సూర్య చంద్రాదులున్నంత వరకు ఈ కథ యిలలో నిలిచి యుండునని పేర్కొనినాడు. నాటి ఫలశ్రుతి అజరామరమై నిలిచి యుండును. ఈ పద్ధతి రంగనాథ రామాయణము నందును, ఏకోజీ రామాయణమునందును పాటింపబడినది.

1. ఏకోజీ రామాయణము - అరణ్యకాండ - పుట - 31 - డా॥ ఎం. బాగయ్య 1993

# షష్ఠ ప్రకరణము

# రంగనాథ రామాయణము రచనా ధ్యేయము

శ్రీమన్నారాయణుడు భూమిపై అవతరించి దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసిన ఉదంతములు మన పురాణేతిహాస కావ్యములలో రచితమైయున్నవి. దశావతారములలో శ్రీరాముని అవతారకథను వాల్మీకి మహర్షి గ్రహించి ఆదికావ్యమును వ్రాసినాడు. మనదేశములోని కవులు ఆ రామాయణ గాథను తమ బాషలలో వ్యక్తము చేసి సార్థక జన్ములైనారు. ఉత్తర దేశములో తులసీదాసు, శ్రీరామచరిత మానస కావ్యమును రచించినాడు. దక్షిణ దేశములో కంబన్ మహాకవి కంబ రామాయణమును వ్రాసి చరితార్థుడైనాడు. ఆంధ్ర భాషలో తిక్కన సోమయాజి తాతగారును మంత్రి భాస్కరుడు మొదట రామాయణమును రచించెను. ఈ పరంపరలో రంగనాథ రామాయణము వెలయించి, అమృతప్రాయమైన కావ్యముతో తెలుగువారిని అలరించెను. ప్రబంధ యుగములో నివసించిన అయ్యలరాజు రామభద్రుడు, కవయిత్రి మొల్ల, కూచిమంచి తిమ్మకవి, కట్టా వరదరాజు మొదలయినవారు రామాయణ రచనా సంప్రదాయమును కొనసాగించిరి. ఆధునిక యుగములోను ఈ సంప్రదాయము నిర్విరామముగా కొనసాగుచునే యున్నది. గోపీ నాథ వేంకట కవి, శ్రీ వావిల కొలను సుబ్బరాయకవి, జనమంచి శేషాద్రి శర్మ, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు మొదలగు వారు రామకథను నిరాటంకముగా కొనసాగించినారు.

ఈ రామకథా సంప్రదాయమునకు ప్రధానముగా పేర్కొనవలసిన వారు భాస్కర రామాయణ కవులు. తరువాత రంగనాథ రామాయణము రచించిన గోన బుద్ధారెడ్డి, రంగనాథ రామాయణము దేశి పద్ధతిన వెలువడిన మహాకావ్యము. నన్నెచోడ మహాకవి, పాల్కురికి సోమనాథుడు జాను తెనుగు అని పేరుపెట్టి దేశీ ఛందస్సును ప్రారంభించగా గోనబుద్ధారెడ్డి ఆ పద్ధతిని పరిపూర్ణముగా నవలంబించి, జాను తెనుగు కావ్యమును వెలయించినాడు. పాల్కురికి సోమనాథుడు రచించిన ద్విపద కావ్యములు తెలుగు సాహితీ ప్రియులను అపారముగా ఆకర్షించినవి. ఈ విషయమును ప్రత్యక్షముగా దర్శించిన కవి బుద్ధారెడ్డి తన కావ్యము కూడ తెలుగు సాహిత్యములో దేశి పద్ధతిలో శాశ్వత స్థానమును పొందవలెనని భావించి, తన ధ్యేయమును సాధించి కృతార్థుడైనాడు.

గోనబుద్ధారెడ్డి అదృష్ట వశమున మహోదాత్త వంశములో జన్మించిన వాడు. ఆతని తండ్రి విఠల వంశీకుడు. ఇతడు గోనవంశరుద్ర నరేంద్రుని పౌత్రుడు. ఆంధ్ర దేశములో దేదీప్యమానముగా వెలిగిన కాకతీయ చక్రవర్తి తండ్రిని గురించి గోనబుద్ధారెడ్డి చెప్పిన మాటలు పరిశీలింవలెను.

"దొరయు కోనాన్వయ దుగ్ధాంబు రాశి - పరిపూర్ణచంద్రుడై భాసిల్లువాడు

.................................................................................................

మగటిమి నసమానమహిమ దీపింప - పగతుఱ ననిలోన భంజించువాడు

.................................................................................................

అరినృపప్రాణానిలాహార భుజగ - వరభుజ స్థాపితావని నేలువాడు
కురు కుంతళానంతి గూర్జర ద్రవిళ - నరనాథ సభల వర్ణన కెక్కువాడు

.................................................................................

వినయ నయోదయ విభవ సుస్థిరుడు - మనుమూర్తి విట్టల క్ష్మాపాల విభుడు
రాజ సర్వజ్ఞుండు రాజసింహుండు - రాజ శిరోమణి రాజపూజితుడు [1]

ఈ మహానుభావుడు పండితసభ దీర్చి రామాయణము వ్రాయుటకు సమర్థులెవరు? అని సభలోని పండితులను ప్రశ్నించినాడట. వారు యేకకంఠమున బుద్ధారెడ్డి భూవిభుని పేరు సూచించినారు. విఠల నాథుడు తన కుమారుని పిలిపించి ఈ విధముగా పలికెను.

భూమి కవీంద్రులు బుధులును మెచ్చ - రామాయణంబు పురాణ మార్గమున
తప్పక నాపేర తగనంధ్ర భాష - చెప్పి ప్రఖ్యాతంబు సేయింపు మర్వి[2]

అని ఆదేశించినాడు. మహావీరుడు, కవి పండిత పోషకుడు, రసజ్ఞుడు అయిన విఠల భూపతి ఆదేశమును శిరసావహించి మహాకావ్యమును రచించుటయే గోనబుద్ధారెడ్డి ధ్యేయము. అదియే అతని ఆదర్శము. ఆది కావ్యమని ప్రఖ్యాతి నందిన వాల్మీకి మహర్షిచే మహాకావ్యముగ భాసించిన శ్రీమద్రామాయణమును వ్రాయునంతటి శక్తి ఈ కవికి గలదా? అను సందేహము రాక మానదు. దానికి సమాధానము రంగనాథ రామాయణ అవతారికలోనే యున్నది.

---

1. రంగనాథ రామాయణము - అవతారిక పుట - 3 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942
2. రంగనాథ రామాయణము - అవతారిక పుట - 4 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942

"నేతనూజన్ముండు నిపుణ మానసుడు - ధూత కల్మషుడు బంధుర నీతిధనుడు
సర్వజ్ఞడనఘుండు చతుర వర్తనుండు - సర్వ పురాణ విచార తత్పరుడు
కమనీయ బహుకళాగమ విచక్షణుడు - సుమనీషి పోషణోత్సుక సుఖోన్నతుడు
కవిసార్వభౌముండు కవి కల్పతరువు - కవిలోక బోజుండు కవి పురంధరుడు"[1]

ఇటువంటి ప్రజ్ఞా పాటవము కల్గిన బుద్ధ భూపతి మహా కావ్యమును తెలుగువారికి అందించుటలో ఆశ్చర్యమేమి? ఏ కథ చెప్పిన ఇహపరములు ముక్తి దొరకునో? కష్టములు పోయి సుఖములు చేకూరునో? అట్టి కోర్కెలు దీర్చె పుణ్య కథలు వ్రాయుదును. సజ్జనులు కీర్తించు దేవుని గురించి నా అంతరంగమున స్తుతియించి, కృతి చేయుదనని పేర్కొన్నారు.

'యే కథ చెప్పిన నెల్ల సజ్జనులు -సేకొని కీర్తనల్ సేయుచునుందు?
రేకథ సెప్పిన నిహపరోన్నతులు - ప్రాకటంబుగ నిల్పి ఫలియించు నుర్వి
నేకథ చెప్పిన నీప్సితార్థములు - గైకొని పుణ్యముల్ గరగి కావించు?"[3] అని రామాయణ రచనకుపక్రమించెను. మహాకావ్యము రచించినపుడు ఆ కావ్యమునకు నాయకుడు కూడ మహానుభావుడై యుండవలెను. కావ్యము నాయకాశ్రితమని లక్షణోక్తి. దానికి నాయకుడు మహోదాత్తుడు శ్రీరాముడు. రఘువంశ కలశాంబుధి సోముడు.

"నియతాత్ముడతిశౌర్య నిధి కృపాజలధి - జయశాలి స్వజన రక్షణ విచక్షణుడు
కంబు కంధరుడు సక్కని మేని వాడు - బింబారుణోష్ఠుండు పీనవక్షుండు
వెడదకన్నుల వాడు విపులాంసతలుడు - నిడుదచేతుల వాడు నియత వర్తనుడు
వేదవేదాంగ కోవిదుడు కోదండ - వేద విదుండు వివేక భూషణుడు
............................ - కౌసల్య కానంద కరుడట్టి రాము
నాసక్తి యువరాజ్యాభిషిక్తునిగ - భాసుర త్రైలోక్య పావన మూర్తి"[4]

రాముడై ఇలను బుట్టిన రాజశేఖరుడు. ఇటువంటి మహానుభావుడు నాయకుడుగా కల్గిన, మహాకావ్యమును వ్రాయుట గోనబుద్ధారెడ్డి ధ్యేయము. దీనిని పరిపూర్ణముగా నిర్వహించిన కవి ధన్యుడు.

---

1. రంగనాథ రామాయణము - అవతారిక పుట - 4 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942
2. రంగనాథ రామాయణము - అవతారిక పుట - 2 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942
3. రంగనాథ రామాయణము - అవతారిక పుట - 5 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942
4. రంగనాథ రామాయణము - అవతారిక పుట - 91 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942

గోనబుద్ధారెడ్డికి తమ తండ్రి మీద అమితమైన భక్తి విశ్వాసములున్నవి. ఆయన ఆదేశము చేతనే ఈ కావ్య రచనకు పూనుకున్నాడు. అందుచేత ఈ కావ్యమును తన తండ్రికి సంప్రదాయ బద్ధముగా అంకితము చేయుట తన విధిగా ధ్యేముగా భావించుకున్నాడు. ప్రతి కాండములో చివరన ఆయన తన తండ్రిని వర్ణించిన తీరు మహోన్నతముగా నున్నది.

"......................... - భూలోక నిధి గోన బుద్ధ భూవిభుడు
తమ తండ్రి విఠల ధరణీశు పేర - కమనీయ గుణధైర్య కనకాద్రిపేర
అలగు నిశ్చల దయాయత బుద్ధిపేర - లలిత నిర్మల గుణాలంకారు పేర
ఆచంద్ర తారార్కమై యొప్పు మిగిలి - భూచక్రమున నతి పూజ్యమై వెలయ
నసమాన లలిత శబ్దార్థ సంగతుల - రసికమై చెలువొందు రామాయణమును
కరమర్థి ఈ బాల కాండంబు జెప్పె- ............................"[1]

తన తండ్రిని కృతి భర్తగా భావించి, అతనిని స్తుతి చేయుట బుద్ధారెడ్డి ఆశయములలో ఒకటిగా చెప్పవలసి యున్నది.ఈ విధముగా బుద్ధారెడ్డి తన ధ్యేయమును పాటించుట వలన లోకమునకు మహోపకారము జరిగినది. తెలుగు వారికి యొక మహాకావ్యము లభించినది. తెలుగులో దేశి శాఖ సుసంపన్నమైనది. ద్విపద వాఙ్మయ విభాగము నిత్య నూతనముగా శోభిల్లినది.

## ఏకోజి రామాయణము రచనా ధ్యేయము

కవియైనవాడు రామాయణములు వ్రాసి తరింపవలెనని తపన యుండును. ఏకోజీ కూడా రామాయణమును వ్రాసి కోరికను నెఱవేర్చుకొనెను. ఇతర కవుల వలెనితడు కూడ కాండముల చివరన ఈ రామాయణమును చదివిన, వ్రాసిన, వినిన, వ్రాయించిన, "భువిలోన వారికి సంపదలు, ఘనమైన కీర్తులు కరితురంగములు, మనసు రంజిలజేయు మానినీ మణులు, పరగ దీర్ఘాయుష్య భాగ్యంబులొసగు. ధరణిలో నా చంద్ర తారార్కముగను" అని తన వాంఛను వివరించెను.

గోనబుద్ధారెడ్డి ఆదర్శముగా గ్రహించి, అతని వలె తానును పండిత పామరులలో ప్రఖ్యాతిని పొందవలెనని కోరిక గలవాడు. కావుననే, అధిక శాతము రంగనాథ రామాయణములోని విషయముల ననుసరించెను.

---

1. రంగనాథ రామాయణము - అవతారిక పుట - 91 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942

దక్షిణాంధ్ర యుగములో పురాణములు పరిఢవిల్లినవి. ఇతిహాసములు, తెలుగు వచనములు, యక్షగానములు, నాటకములును ఒకేరీతిగా సరళ ఛందస్సుయగు ద్విపదలో వ్రాయవలెనన్న కవి కోరిక తీరినది. వాల్మీకి మహర్షి చెప్పిన కథను, జానపదులలోనున్న కథలను గ్రంథస్థము గావించవలెనని భావన :

1. వాల్మీకి నారద మహర్షిని భూలోకమున ఉత్తమ పురుషుని గురించి ప్రశ్నించుట.

2. కుంభకర్ణుని నిద్ర నుండి మేల్కొలిపిన తీరు, అతడు నిద్ర నుండి మేల్కొని యుద్ధమునకు సిద్ధమై ప్రహస్తాదులన విచారించి, విషయము గ్రహించి, అన్న చేతిలో చావు కంటే శ్రీరాముని చేతిలో చావు ముక్తిని ప్రసాదించునని భావింపచేయుట. కవి మనోభావమును వ్యక్తీకరించెను.

3. యుద్ధ రంగమున విభీషణుడు కుంభకర్ణుని మెచ్చుకొని, ఇనవంశ తిలకుని మనసారా నడువుమని బోధించుట.

4. అహల్య శాప విమోచన సందర్భము, ఆమె అందమే ఇన్ని ఇడుములకు మూలమైనదని భావింపచేయుట నూతనాంశమే.

5. అహల్య పావనమైన విధము గౌతముడనుగ్రహించిన పద్ధతి శ్రీరాముని కీర్తించడము గలదు.

6. కైకకు మందర దుర్బోధ సందర్భమున "పరుల పంచన నుండి యొదిగిళ్ళ పడుచు తిరుగుటేగానీ సుస్థితి గాంచగలమే" అని సాంఘిక ప్రవృత్తిని ప్రదర్శింపచేసినాడు.

7. పితృవాక్య పాలకుడగు శ్రీరాముడు "కాలాగ్ని యైనను కరుణతో జూతు" నని ప్రతిజ్ఞ చేయించినాడు.

8. కైకవరముల వలన, కౌసల్య తన పుత్రుడగు శ్రీరాముని చిన్ననాటి జాతక కర్మను, తనకు జరుగుచున్న అన్యాయమునకు విధిని నిందించిన తీరులో "పరదేశులెందరీ పట్టణంబునను" అని భావింపచేసినాడీ కవి.

9. సీతారామ లక్ష్మణులు అడవికి ప్రయాణమైనపుడు కౌసల్య, సుమిత్రలు కైకను నిందించునపుడు సామాన్య స్త్రీ పాత్రల వలె సంభాషణమును కల్పించెను. "..... నీ గుండె రాయిగావోలు. రాకుమారివి గావు రాక్షసివి నీవు" అని తులనాడిరి.

10. కైక దశరధునితో తన వరములు ధిక్కరింపరాదని భీష్మించినపుడు, శ్రీరాముడు తల్లియగు కైకతో పల్కించిన మాటలు "తప్పను కలనైన తండ్రి వాక్యంబు" అని పలికెను.

11. శ్రీరాముడు వనవాసమునకు బయలు దేరునపుడు పురజనులు వచ్చుట. రాత్రి యగుట, నిద్రించుట, అర్ధరాత్రి రథమును అయోధ్యకు పంపుట, పురజనులు నిద్రలేచి రాముడు అయోధ్యకు చేరెనని భావించుటలో కవి కల్పనా చాతుర్యము కొనియాడదగినది.

12. శ్రీరాముని బాణము చేత హతుడైన వాలిని చూచి తార విలపించిన తీరు హృదయమును కదిలించును. "దేవేంద్రనందను తెగటార్చినట్లు, దేవనన్నిప్పుడు తెగటార్చుమనుచు" అని విలపింపచేయును. ఇట్లు సంభాషించుట నాటి ప్రజలలోని విషయమును గ్రహించినట్లు తెలియుచున్నది.

13. రావణునకు విభీషణుడు హితమును బోధించుటలో చక్కని నీతిని గఱపినాడు. సీతను అపహరించి, తెచ్చిన మొదలు లంకలో " దేవ యీ పుర లక్ష్మి దీనయై పొలిచె" నని చెప్పినాడు.

14. రావణ - ఆంజనేయుల యుద్ధములో పిడిగుద్దులు, మూర్ఛలు, సాధారణ శైలిని దాటినవి.

15. కుంభ కర్ణుడు ముక్తి కోరిన మాట "శ్రీరామునిచే ముక్తి చేకొనకోరి" అనిపించినాడు.

16. శ్రీరాముడు - రావణుని వధింప యెన్ని బాణములు వేసినను మరణింప నందున, రావణుని మరణ రహస్యమున విభీషణుడు చెప్పిన తీరు "దేవ రాఘవ వీడు తెగడెందుచేత, వావిరి సుధనాభి పడియుండజేసి" అని గుర్తు చేసెను. ఇట్లు అవాల్మీకాంశములను ఏకోజీ కల్పించినాడు.

వాల్మీకి రామాయణము దీర్ఘమైన కావ్యము 24 వేల శ్లోకములు గల కావ్యమును సంగ్రహించి ద్విపదలలో సుమారు 1/10 వ భాగమునకు కథను సంక్షిప్తము చేసెను. ఈ సంక్షిప్తీకరణము పాఠకులకు ఉపయోగమునకు హేతువైనది.

ఏకోజీ మహాకవికి సీతారాములు తల్లిదండ్రుల వంటి వారని హనుమంతుని చేత యెన్నియో మారులు చెప్పించెను. ఇక రామకథను, అధ్యాత్మిక మహాకావ్యముగా గాక, లౌకికమైన, పారమార్థికమైన మనోహర కథగా వర్ణించుటయే ధ్యేయము.

# సప్తమ ప్రకరణము

# రెండు రామాయణాల్లో పురాణ, కావ్య లక్ష

# సమన్వయము

## పురాణ వివరణ :

పురాణ శబ్దము ఋగ్వేదమున విశేషముగా వాడబడినది. అందు 'పురాతన ప్రయోగము కానరాదు. తదర్థమున పురాణ శబ్దముపయుక్తమైనది. ఆ ప విశేషముగ 'పూర్వగాథ' లేక 'ప్రాచీన కథ' యను నర్థము నిచ్చి విశేష్య వాడబడుచు నధ్వర వేదమున ప్రయోగింపబడినది. రుద్రుడు బృహద్దిశ నీశాన్యమునకు కదలిపోగా నతని వెంట నితిహాసము, పురాణము గాథలు, నారాశ కదలిపోయెనని నథర్వ వేదమున ప్రస్తావింపబడి యున్నది.[1] శతపథ బ్రాహ్మ నందును, ఉపనిషత్తులందును ప్రాచీన గాథలను వర్ణించు గ్రంథములుగా పురాణ పేర్కొనబడినవి.[2]

## పురాణ శబ్ద నిరుక్తి నిఘంటువుల యందు

1. పురాభవ మితి పురాణమ్ (శబ్ద కల్పద్రుమము)
2. పురాపూర్వస్మిన్ భూతమితి పురాణమ్ (అమరకోశము)
3. పూరానీయతే ఇతి పురాణమ్ (వాచస్పత్యము)
4. పురానవం భవతి పురాణమ్ (యాష్క నిరుక్తము)

పురాణములనగా చిరకాలమున బుట్టినవనియు, ప్రాచీన విషయము తమ యందిముడ్చుకొనినవనియు, ప్రాచీన కాలమున నవీనములుగా న వనియు, పురావిషయములందు జీవించెడి వనియు, ప్రాక్తన విషయాభిరతి క వనియు, పురాతన కల్ప వస్తుకములనియు నేర్పడుచున్నది[3]

---

1. అథర్వ వేదము 11 - 7 - 24
2. శతపథ బ్రాహ్మణ - 3 5 అధ్యాయము - 8 బ్రాహ్మ
3. ప్రథమాంధ్ర మహా పురాణము - పుట 6 - డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం 1973

'పురాపినవమ్ పురాణమ్' అను నిరుక్తి ప్రసిద్ధి గాంచినది. దీనిని బట్టి పురాణములందు వర్ణింపబడు వస్తు విశేషములు పురాతనములయ్యును. నిత్య నూతనములుగ భాసించునని తాత్పర్యము. పురాణము లందలి యీ నవ్యతయే వీనిక ఉత్తమ సాహిత్య గౌరవము నాపాదించుచున్నది.

ప్రాచీనులు ప్రజాదరణమునకు దగ్గరున్న పురాణముల నెన్నుకొని వాని యందు తమ సారస్వత ధనమును దాచుకొనిరి. ఇవి దాన, వ్రత, భక్తి యోగ విషయములను వేదాంతము, వైద్యము, సంగీతము, జ్యోతిష్యము, శిల్పము, గణితము, వ్యాకరణము, ఛందోలంకారములు, నాట్యము, రాజనీతి, సాంఘిక నీతి మొదలగు శాస్త్రములకు సంబంధించిన యంశములు పురాణ ఛత్రము క్రింద తలదాచుకొనినవి. ఈ శాస్త్రముల పరిచయమే పురాణముల పేర గ్రంథములుగా వెలసినవి.

ఈ పురాణముల కోవకు చెందినవే రంగనాథ, ఏకోజ రామాయణములు. వాల్మీకి రామాయణము ననుసరించి యితర రామాయణములు వ్యాపించినవి. కావున పురాణ శబ్ద భవము ప్రాచీన పురాణములుగా వాసి గాంచినవి.

హైందవ సంస్కృతికి వేదములే మూలము. ఇందలి పరమార్థ సులభ సాధనములు. అమూల్య శాస్త్ర నిధులచే పండిత పామర జనులను రంజింపచేయు వాహికలు పురాణేతిహాసములు. చతుర్విధ పురుషార్థములను మిత్ర సామ్యముగ ప్రబోధించి, విశ్వజనీన సంస్కారమును కలిగించును. పురాణములు సురాసురుల రణరంగములను వర్ణించు నితి హాసములు - కాలక్రమమున భక్తి, వ్రత, దాన, యోగాది విషయములు, వేద వేదాంగములలోని శాస్త్ర ద్యంశముల కల్పనా చాతుర్యమైన కథలు, గాథలు, ఉపాఖ్యానములు, స్తుతులు, మంత్రశాస్త్రములు, చారిత్రక, భౌగోళిక, పురాణ, సామాజిక, రాజకీయ, నైతిక, ధార్మిక, మత, ఆచార వ్యవహారములకు విశ్వ విజ్ఞాన కోశములుగా ఏర్పడినవే పురాణేతిహాసములు.

భారత, భాగవత, రామాయణాదులు మానవ జీవితమును పారమార్థిక మార్గమునకు మళ్ళించును. భారతము సామాజిక జీవితమును, భాగవతము పారమార్థిక మార్గమును, రామాయణము సాంసారిక జీవితమున గూర్చి బోధించుచున్నవి. ఇందలి పాత్రలు సజీవములై, మానవుల విభిన్న, మానసిక ప్రవృత్తులకు ప్రతీకలనవచ్చును.

పురాణ వాఙ్మయ మంతయు అనువాదమే. కావ్య పురాణ స్పృహలేని గ్రంథము రసిక జనామోదమును బడయ జాలదని గ్రహించియే అట్టి స్పృహను కల్పించిరి.

మార్కండేయ పురాణము, నృసింహ పురాణము, భీమేశ్వర పురాణము, నారద పురాణము, బసవ పురాణము మొదలగు పురాణ శబ్దములు ప్రాచీన సాహిత్యమునకు ప్రతీకలు. గీర్వాణ వాఙ్మయమున పురాణములు అతి ప్రాచీనమైనవి. అష్టాదశ పురాణములు వ్యాస ప్రోక్తములు. వీటిలో రామకథ యేదో విధముగా నెక్కడనో యొక చోట చోటు చేసికొని యుండుట సంభవించినది. కొన్ని పురాణములందు రామాయణము ప్రత్యేకముగా కొన్నింటిలో పాక్షికముగా ప్రస్తావింపబడినది.

పదునెనిమిది పురాణములలో ఆరు పురాణములందు అనగా మత్స్య, మార్కండేయ, వామన, శివ, గరుడ, కూర్మములందు రామాయణ కథ లేదు. మిగిలిన పన్నెండు పురాణములలో రామకథ గలదు.

అగ్నిపురాణము నందు రామాయణములోని సప్త కొండల గాథ విడిగా ఏడు అధ్యాయములలో గలదు. పద్మ పురాణము, స్కాంధ పురాణములందు రామకథ ప్రత్యేకముగా గలదు. విష్ణు పురాణము నందు రామోదంతము, వాల్మీకి విషయములు గలవు బ్రహ్మాండ పురాణము నందు రామాయణ మహాత్మ్యము ప్రత్యేకముగా నున్నది. ఆధ్యాత్మ రామాయణము గలదు. భాగవత పురాణము నందు ఒక వ్యాసమున రామకథ కలదు. దేవీ భాగవతము నందు శ్రీరాముడు దేవిని పూజించును. సీతకై విలపించును, నారదుడు వచ్చి సీతా రావణుని చెఱలో నున్నదని, నీ ధ్యానమే తప్ప వేఱు లేదని పూర్వ జన్మ వృత్తాంతమును తెలియచేయును. వరాహ పురాణము నందు దశరథుని వంశ వర్ణన గలదు (నంది మల్లయ, ఘంట సింగన)

లింగపురాణము నందు రామకథ స్వల్పముగ గలదు. విచార పరులగు రామలక్ష్మణుల వద్దకు శివుడు వచ్చుట. తరువాత పార్వతీ దేవి సీత రూపము దాల్చి రాముని జూడ వచ్చుట. రాముడు విషయమును గ్రహించి నమస్కరించి 'అమ్మా! ఎందులకిట్లు వచ్చితివి?' అని ప్రశ్నించుట. సిగ్గుతో పార్వతి వెనుదిరిగి పోవుట. ఈ

---

1. ఆంధ్ర వాఙ్మయము - రామాయణము - పుట - 65 - డా॥ మలయవాసిని 1989

విషయము తెలిసిన శివుడు, బ్రహ్మ విష్ణువులు నా సోదరులనుట, వారికి తల్లివైన నాకు కూడ తల్లివని చెప్పి శివుడు తపస్సునకు పోవుట గలదు.

భవిష్యత్పురాణము నందు రామకథ విపులముగా నున్నది. పద్మ పురాణము నందు రామకథ దీర్ఘముగా నున్నది. శివుడు పార్వతి దేవికి రామకథ చెప్పి ధన్యుడుగా భావించును. రావణుని వధించిన బ్రహ్మాస్త్రముతో పాతాళమునకు పోవును. సీత శివపూజకు పూలు అందించినది. శూర్పణఖ సీతాదేవిని జూచి 'వెన్నెలలో మీగడ' వలె నున్నదని భావించెనట. ఇది కల్పన (మడికి సింగన)

ఇట్లు పురాణములన్నియు ఒకేరీతిలో కథను నడిపించినట్లున్నవి. కవులు వారి కాల ప్రభావములకు స్పందించి వ్రాసి యుండవచ్చును. రంగనాథ రామాయణ కర్త గోనబుద్ధారెడ్డి మంత్రి, హిత, పురోహిత, శాస్త్ర వేత్తలచే నిండు సభలో 'సర్వ పురాణ విచార తత్పరుడుగా' పొగడబడినాడు. బుద్ధారెడ్డి తన కుమారుని పిలిచి యిట్లు కోరెను.

"రామాయణంబు పురాణ మార్గంబు - దప్పక నాపేర దగనంధ్ర బాష చెప్పి"[1]

అని ధరణిపై కీర్తిని నిల్పుకున్నాడు. తనయుడట్లే గావింపనెంచి యిట్లు పలికినాడు.

"ఆదికవీశ్వరుడై వాల్మీకి - యాదరంబున బుణ్యులందఱు మెచ్చ

చెప్పిన తెఱగున శ్రీరామ చరిత"[2] మును ఒప్పచెప్పి ప్రతిన బూనినాడు. ప్రతి కాండము నందును ఏదో ఒక అవాల్మీకాంశము కల్పించి కథ నడిపించెను.

రంగనాథ రామాయణ పీఠిక వలన పురాణ కథాంశములును జేర్చబడినవి. ప్రతి పురాణములో రామకథను, కొద్దిగానో, గొప్పగానో, సంగ్రహముగానో వివరించిరి. బుద్ధారెడ్డి కూడ సందర్భోచితమని భావించిన కథాంశములను మూలమునకు వ్యతిరేకము గాకుండగా తన రామాయణములో పొందుపఱచెను. అందువలననే ఈ రచనను 'సర్వ పురాణ విచార తత్పరుడు' 'పురాణ మార్గంబు దప్పక' అనునవి పురాణ పదమును దృఢముగా బలపఱచుచున్నవి.

---

1. రంగనాథ రామాయణము - బాలకాండ - పీఠిక ద్వి - 93 - 94
2. రంగనాథ రామాయణము - బాలకాండ - పీఠిక ద్వి - 103 - 104

లోకములో భృగు మహర్షి శాప వృత్తాంతమును, తత్కారణమును పురాణములు సూచించుచున్నవి. లోక మనింద్రముగా జేయ గోరుచున్న భృగు పత్నిని విష్ణువు సురహితార్థము సంహరించెను. అపుడు భృగు మహర్షి ' నీవును నా వలెనే భార్య వియోగ దుఃఖమును పొంది పెక్కు సంవత్సరములు అనుభవించుమని శపించెను[1] ఆ శాప కారణమున నారాయణుండు శ్రీరామావతారము నెత్తి రావణాసురుని వధించి లోకోపకారము చేసెను. నారదోపదేశమున రామకథను సంక్షిప్తముగా నెఱింగిన వాల్మీకి కారుణ్యమును పరీక్షింపగోరి తాను వ్యాధుడై క్రౌంచ రూపుడైన రాక్షసుని మహర్షి చూడగా సంహరించెను. వెంటనే వాల్మీకి శపించెను.ఈ శాపము భృగు శాపమున కనువాదమే[2] యగును.

బ్రహ్మ వచ్చి రామాయణమును రచింపుమని ఆజ్ఞాపించిన పిమ్మటనే వాల్మీకికిట్టి అభిప్రాయము కల్గినది. అంతకు పూర్వము ఆ తలంపు లేదు. వ్యాధుడు చేసిన అధర్మ కార్యమునకు శోకము, కోపమ్ము కలుగగా తన నోటికి వచ్చినట్లు దూషించెను. ఆ శోకమే శ్లోకముగా పరిణమించుట జరిగినది. కావున నిదే కావ్యార్థ సూచన.

రంగనాథ రామాయణములో గోనబుద్ధారెడ్డి గ్రహించిన విషయములు గమనింతము.

1. భృగు శాపోద్దిష్టమైన సీతా వియోగము
2. రామాయణము ఉత్తర కాండము
3. మంగళార్థమైన కావ్యార్థము
4. శోకోపహతుడైన కోపిష్టి యిట్లు శపింపవలెనని ఊహింపకుండుట నిజమే. కావున దాని నెటులైనను దూషించవచ్చును.[3]

---

1. బ్రహ్మ వైవర్తము - శ్రీ కృష్ణ ఖండము - అధ్యాయ - 132
"సర్గశ్చప్రతి సర్గశ్చ వంశోమన్వంత రాణిచ
వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణమ్"
2. రంగనాథ - వాల్మీకి రామాయణముల తులనాత్మక పరిశీలనము పుట - 304 డా॥ గుండి వేంకటాచార్యులు
3. రంగనాథ - వాల్మీకి రామాయణముల తులనాత్మక పరిశీలన - పుట - 305 - డా॥ గుండి వేంకటాచార్యులు

పై కారణములచే మూల శ్లోకమునకు వ్యాఖ్యాన రూపములైన ద్విపదలు వ్రాసినాడు. ఈ విధముగా కవి పౌరాణికార్థముతో ముడిపెట్టి తన రామాయణము నవగాహన చేసుకొనుటకును, సమన్వయించుటకును పురాణ జ్ఞానమెంతేని యవసరమని సూచింపబడినది.

రంగనాథ రామాయణమున శ్రీరాముని పాద స్పర్శచే శిలా రూపమున నున్న అహల్య పూర్వ రూపమును పొందుట గౌతముడు తిరిగి తన భార్యగా పొందుట పురాణ పద్ధతికి అనుబంధమైనదే. గోనబుద్ధారెడ్డి మూలములో లేని శ్రీ సీతారాముల వివాహ సందర్భములో శృంగార వర్ణనలను దేశీయానుగుణముగ వర్ణించుట ప్రబంధ పద్ధతి.

వాల్మీకి రామాయణములోలేని ముని బాలకుని పేరు అంధ తపస్వుల పుత్రుని తాను చంపినట్లును, వారు శాపమిచ్చినట్లును కౌసల్యతో దశరథుడు చెప్పెను. ఆ బాలుని పేరు మూలములో లేదు. బుద్ధారెడ్డి ఆ బాలుని పేరు యజ్ఞదత్తుడని పేర్కొన్నాడు. అంతేగాక 'వైశ్యునకు శూద్రవనితకు పుట్టిన బాలుడని చెప్పబడినది. ఈ పద్ధతి పురాణ సంబంధమే యగుచున్నది. రంగనాథ రామాయణము నందలి పాత్ర చిత్రణము నందు రాక్షసులందరు రామ భక్తులుగను గుణ పాటీణులుగను వర్ణింపబడినారు. కుంభ కర్ణుడు రావణుని కొరకు ప్రాణ త్యాగము చేసిన గుణవంతుడు. స్త్రీ పాత్రలను పవిత్రముగాను, వివేకవంతముగాను చిత్రించినాడు. మండోదరి, సులోచనల పతిభక్తి, ధీశక్తి రంగనాథ రామాయణములో కావ్యలక్షణములను కలిగియున్నది. రాక్షసుల యందును సాధ్వీమతల్లులు గలరని సులోచనాది పాత్రల ద్వార నిరూపితమైనది.

తండ్రి తనయులను రామాయణమును రచింపుమని కోరుట. అది పలువురు మెచ్చు రీతిన రామాయణమును పురాణ మార్గమున చెప్పమని కోరుటచే నిది పురాణ మార్గమునకు సంబంధమైనది. ఇంద్రుడు గౌత మాశ్రమము చేరుట, అహల్య సౌందర్యమును చూచి కోడియై కూసెనట. గౌతముని తపోభంగము చేయుటకు కాదట. రంగనాథ రామాయణమున మాత్రము తపోనిష్ఠను భంగము చేయుటకే యని కథా నిర్మాణము గావించుట, మార్పు చేర్పులకు మార్గమైనది. ఈ కల్పనము ఔచితీ

సౌందర్యమునకు నిదర్శనము. రామ లక్ష్మణులను అంతఃపురకాంతలు సోరణ గండ్ల నుండి వీక్షించి నట్లున్నది.

"జనకజ దగు రామ చంద్రుని కిరవు - ఒనరు సౌమిత్రికి నూర్మిళ యనుచు
దనరుగాక కని వారు దగ నెన్ని కొనుచు - .................."[1]

అని స్త్రీల ప్రభావ చిత్తములను పేర్కొనుట సందర్భోచిత కల్పనయే.

రంగనాథ రామాయణమున పురాణచ్ఛాయలు గల విషయములు

"ఓరి నిషాదుండ యోరి పాపాత్మ - ఓరి నీ కెగ్గేమి యొనరించి తొలి
కామించి క్రౌంచముల్ గవయుచో నొకటి - నేమిటికై చంపి తెబ్బంగి గడగి
ఈ పాతకమన కనేక దుఃఖముల్ - ప్రాప్తించె తిరుగుము బహువత్సరములు"[2]

అని శాప కారణమును చూపి పురాణ పద్ధతిని నడిపించెను.

2. రాహుకేతువులు : అమృతము పంపకము చేయునపుడు మోహినీ రూప విష్ణువు రాహుకేతువులను గమనింపక పంపిణీ చేసెను. సూర్య చంద్రులకను సైగలచే విష్ణువు చక్రముచే వారి తలలను ఖండించి ఆకాశమున గ్రహములుగా చేసెను. ఆ రెండు తలలు (రాహుకేతువులు) పర్వ సందర్భములలో సూర్య చంద్రులను, బట్టి పీడింతురు. [3] మూలములో ఒకరి తలను ఖండించి నట్లుండగా, రంగనాథ రామాయణములో లిద్దరిని చూపబడినది. ఈ మార్పునకు కారణములు పురాణ కథలు.

3. ముని పత్నులు గర్భము ధరించుట : వీరు ఆశ్రమములు చేరగానే మునులు " మీ గర్వము మిమ్మింత వారిని చేసినది. మిమ్ము మన్నింప నేల? పతి దూర లగుడని' వెడలగొట్టిరి. అంతట వారు గంగాదేవిని సమీపించి కరతాడనములచే గర్భములను బాదుకొనగా ఆ గర్భములు జారి ఆరు ఖండములై అవనిపై బడెను. అవియే షణ్ముఖములుగా అవతరించెను.[4] ఈ కథ మహాభారత మందలి కథను పోలి యున్నది. శివ పురాణమున అగ్నిహోత్రుని కథ గలదు[5]

---

1. రంగనాథ రామాయణము - బాలకాండ - పీఠిక - 147 - 149
2. రంగనాథ రామాయణము - బాలకాండ - పుట - 6
3. రంగనాథ రామాయణము - బాల కాండ ద్వి 1374 - 1381
4. రంగనాథ రామాయణము - బాలకాండ ద్వి 1073 - 1094
5. రంగనాథ - వాల్మీకి రామాయణముల తులనాత్మక పరిశీలను - డా. గుండి వేంకటాచర్యులు

కుంతి ధర్మరాజును కన్నది. ఈ వార్త గాంధారికి తెలిసి తన గర్భమును బాదుకొన్నది. అది జారి క్రిందపడగా, దానిని వ్యాసుడు 101 ఖండములుగా విభాగించి ఘృత కుంభములందు భద్రపరచెను. వీటిలో 100 గురు కుమారులు, 1 కుమార్తె జన్మించిరి. ఈ విషయము పురాణ సంబంధమైనది. రంగనాథ రామాయణ కర్త పౌరాణిక విషయమును గాంధారీ గర్భ వృత్తాంతము వోలె మలచి, రామ కథాంతర్గత కుమార స్వామి జన్మ వృత్తాంతమును జేర్చి తన పురాణ పరిజ్ఞానము నిట ప్రదర్శించినాడు.

4. యవనాశ్వుని వృత్తాంతము : ఇతని భార్యలు మూలములో నూర్గురని యుండగా, రంగనాథ రామాయణములో ఇరువురని యున్నది. మునుల రప్పించు కొనుట రాజలీవి. చివరి రాజు మాంధాత భార్య బిందుమతికి బదులుగా, రంగనాథ రామాయణములో విమలాంగి అనియు, పుత్రులు ముగ్గురి బదులుగా ఇద్దరనియు మార్పు చేసెను.

5. నారాయణుడే మాంధాతనవతారమనియు ఇతడే శ్రీ రామావతారమని వ్యంగ్యముగా రచించెను. ఈ మాంధాత కథ పురాణ యోగ్యమైనది. కావున రంగనాథ రామాయణములో ప్రవేశించినది. ఇక ఇంద్రుడు కోడియై కూయుట, అహల్య విషయములు అవాల్మీకములు.

6. వాలిసుగ్రీవులు తార రుమల చరిత్ర వానర సంబంధితమైనదిగా భావింపచేసినాడు.

7. కరుణావతి చరిత్రము : రాముని బలమును పరీక్షింపగోరి సుగ్రీవుడు సప్త తాళములను చూపి పడవేయుమనగా ఒక్కవేటున పడవేసెను. అందునుండి కరుణావతి యను కన్యక శాప విమోచనయై బయటకు వచ్చుట[1] పురాణ ప్రక్రియకు చెందినది.

8. త్రికూట పర్వతముల వర్ణన - సముద్రుడు, రాముడు నదులు - సహకార సంగతులు మిళితమయినవి.

9. రామేశ్వర ప్రతిష్ఠ : శివలింగ విశిష్టత ప్రస్తావింపబడినది.

---

1. రంగనాథ రామాయణము - కిష్కింధా కాండము, ద్వి. 384 - 388
2. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము - కావ్య ప్రకరణము - పుట - 46

ఇట్లు ఎన్నో రామాయణములు, పురాణములు పఠించి రచించిన గోనబుద్ధారెడ్డి సర్వ పురాణ విచార తత్పరుడు `పురాణ మార్గంబు దప్పక' అనెడి పదముల నాధారముగా గ్రహించినచో రంగనాథ రామాయణమునందు సందర్భోచితముగా వివిధ పురాణాంశములను జొప్పించినట్లు తెలియును. స్కాంధ పురాణాంతర్గత ప్రభావమున్నదని చెప్పదగును.

## రంగనాథ రామాయణము కావ్య విషయము :

కావ్యమనగా ప్రాచీనుల మతానుసారము దాని స్వరూప స్వభావము లిట్లుండును.

"వివిధ గుణము లలంకృతుల్వేలయగల్టి
యరయ దోసము లేని శబ్దార్థములను
గద్య పద్యాత్మకంబగు కావ్యమంచు
బల్కుదురు కావ్య విదులైన ప్రాజ్ఞులెల్ల"[1]

దోషములేని, అలంకారములతోను ఒప్పినట్టి శబ్దార్థములు గలది కావ్యము. ఇది సామాన్య లక్షణము. గద్య కావ్యమనియు, పద్య కావ్యమనియు, గద్యపద్యోభయ కావ్యమనియు మూడు విధములు. మహాకావ్య లక్షణములను గూర్చి

"లలినగరార్ణవములు నగఋతువు - లల విధు సూర్యుల యమలోదయములు
ఎలదోఁట నాటయుం దెలి నీటి యాట - కలమధుపాన సంగతి రతి కేళి
ఎడబాటు పెండిలి కొడుకు పుట్టుటయు - కడు ద్యూత మంత్రముల్ గదన యాత్రయును
అనియును నాయకు నభ్యుదయంబు - ననునవి వర్ణింపనగు మహాకావ్య
మిందునే కొన్నియో యేర్పడకున్న - డిందులే దొకయింత సుందర కృతికి"[2]

అని విద్యానాథకవి కావ్యా దర్శనమునసరించి ఈ మహా కావ్య లక్షణములు గలవు. కావ్యమునకు ప్రధానాంగములు మూడు

1. ఇతివృత్తము, 2. నాయకుడు, 3. రసము

---

1. ఆంధ్ర ప్రతాప రుద్ర యదోభూషణము - కావ్య ప్రకరణము - పుట - 46 - 158
2. ఆంధ్ర ప్రతాప రుద్ర యదోభూషణము - కావ్య ప్రకరణము - పుట - 157 - 158

అలంకార వర్ణనాదులు. వీనియొక్క సమ్మేళనమే మహా కావ్యము[1]

ఇందులో ఏ ఒక్కటి యద్భుతముగా నున్నను ఆ కావ్యమును లోకమాదరించును.

## 1. ఇతివృత్తము :

కావ్యమునం దితివృత్తము ప్రధానమైనది. ఇతివృత్తము ఇహపర సుఖహేతువైన భగవత్కథగా నుండవలయును. చరిత్రను, సంఘ చరిత్రను ప్రతిబింబించి, ఉపదేశాత్మక, నీతి బోధకముగా నుండవలెను.

ఉదా : రామాయణ, మహా భారతాదులు

రామాయణ కథ జగత్ప్రసిద్ధము, ముఖ్యముగా ఇతిహాసికము. రసాన్వితమైన ఉపదేశాత్మకము, ఆర్షేయము కూడ. సత్య సంధుడు, ధర్మాత్ముడు, పౌరుషమునందు ప్రతిద్వందుడు, మర్యాదా పురుషోత్తముడు, ఇహపరసుఖ హేతువైన భగవదవతార మూర్తియైన శ్రీరాముని చరిత్రమును వర్ణించునట్టిది. కావుననే గోనబుద్ధారెడ్డి రామకథా కావ్యమును కావ్య రచన కనుకూలమని యెంచి గ్రహించినాడు.[2]

## 2. నాయకుడు :

రామాయణము నందలి నాయకుడు శ్రీరాముడు అనంత కల్యాణ గుణాకరుడు, ధీరోదాత్తుడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ, ధర్మోద్ధరణకై అవతరించిన భగవంతుడు. ఇతనికి పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, సోదర ప్రేమ, ఏకపత్నీత్వము, ఆశ్రిత వాత్సల్యము, సత్య సంధత, ఇత్యాది ధర్మముల నాచరణ రూపమున ప్రతిపాదించిన ఆదర్శమూర్తి. త్యాగధనుడు, శైవ, వైష్ణవ, బౌద్ధ, జైన చార్వాకాది మతముల ప్రాబల్యమున ప్రజలు పరస్పర దూషణ భూషణ తిరస్కాదుల నొనర్చుకొనుచు, అస్తవ్యస్త జీవితమును గడుపుచుండు కాలమున, వారి మధ్య సామరస్యమును కుదుర్చుటకును, శాంతి నెలకొల్పుటకును, సమర్థుడైన నాయకుడు పరిపూర్ణ మానవుడైన శ్రీరాముడు దప్ప మరొక్కడు కాడు[3]. కావుననే సర్వమతస్థుల చేత సమాదరింపబడువాడు. అందువలన

---

1. రంగనాథ - వాల్మీకి రామాయణముల తులనాత్మక పరిశీలనము - పుట - 465 - 466.
- శ్రీ గుండి వేంకటాచార్యులు

2,3. రంగనాథ - వాల్మీకి రామాయణముల తులనాత్మక పరిశీలనము - శ్రీ గుండి వెంకటాచార్యులు పుట. 467

గోనబుద్ధారెడ్డి శ్రీరాముని తన కావ్య కథానాయకునిగా నెన్నుకొని, వాల్మీకి రామాయణమున లేని గణపతి, నమస్కార, లింగ ప్రతిష్టాదుల నొనరింపచేసి మత సహనము గల్గిన పురుషోత్తమునిగా తీర్చిదిద్దినాడు.

## 3. రసము :

'వాక్యంరసాత్మకం కావ్యమ్' అను విద్యానాధుని (సాహిత్య దర్పణ) అభిప్రాయము ననుసరించి రసాత్మకమైన వాక్యము కావ్యము. విభావనుభవ వ్యభిచారి భావములచే నస్వాదింప దగినది. స్థాయీ భావము రసమని దశరూపకము నందలి సారము. ప్రధానమైన కావ్య రచన ప్రయోజనము రసానందము కల్గించుటయే. కావున రసాత్మకమైనదే కావ్యము. రామాయణ మహా కావ్యము శృంగారాది రసములతో కూడి యున్నది. వాల్మీకి చెప్పిన శ్లోకముననుసరించి గోనబుద్ధారెడ్డి చూపిన ద్విపద పాదములు

"రసము(ల)లు కల్పనల్ ప్రాస సంగతులు - అసమానరీతుల నన్నియు గలుగ"[1]

శ్రీరామ చరిత మొప్ప జెప్పెద నని ప్రతిన బూని వ్రాసినాడు. ఆ విశ్వాసము వలననే ప్రతి కాండాంతము నందు రసికమై చెలువొందు రామాయణంబు[2] అనియు

అ॥ రసికానందమైయెల్లనాడు దివ్యసుమతి నొప్ప నీవు పుణ్యచరిత[3] అని గట్టిగా చెప్పగల్గినాడు.

## ఏకోజీ రామాయణము :

ఏకోజీ రామాయణము పురాణ ఫక్కీన నడచినదని చెప్పుటకు కొన్ని ద్విపాద పాదములు నిదర్శనమనవచ్చును.

"వ్యాస శుకాదుల వర్ణించి కాళి - దాసాది కవులకు దగ గేలు మోర్చి
కుల దైవతమ్ముల గొనియాడి మదిని - పాలు పొందు సత్యవి బుధుల సమ్మతిని"[4]

అని పురాణము రీతిలో రచన సాగింప తలపెట్టెను. ప్రారంభమున వాల్మీకి రామాయణానుసారముగ రచియింతునని చెప్పిన పాదములు.

---

1. రంగనాథ రామాయణము - బాలకాండ - 101
2. రంగనాథ రామాయణము - బాలకాండ - 2474
3. రంగనాథ రామాయణము - బాలకాండ - 2486
4. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 1 డా॥ ఎం. బాగయ్య 1993

"అరుదుగా వాల్మీకి యలరామ కథను - రచియించినట్లు సారముగాగ ద్విపద
రచియింప.................."[1] అని పేర్కొన్నాడు.

అంతేగాక నవరస భరితంబైన రామకథను వర్ణించెదనని చెప్పినాడు.

'యతుల ప్రాసంబుల నర్థ సంగతుల - ప్రతిలేని నవరస భావముల్ దనర
నిరుపమాలంకార నియతు లేర్పడగ - ............................"[2]

అని పురాణ కావ్య రచనా విధానమును వ్యక్తీకరించెను. సప్త సంతాపములలో నొకటగు సంతతి లేని జీవితము శూన్య మనెడి పౌరాణిక భావమును వ్యక్తీకరించెను.

"అపుత్రస్య గతిర్నాస్తి" అనెడి పురాణ వాక్యముచే దశరథుని మనస్సు పుత్రుల కొరకు యెంత తల్లడిల్లినదో ఏకోజీ తన రచనలో పొందుపరచెను. పుత్రుల బడసిన తరువాత దశరథుని మురిపమునకు అవధులు లేవు. ఆ ఘట్టము

"కల్లరి నగవుల ఘన విలాసముల - బళ్లారి నగవుల నేర్పు విద్దెముల
జిలిబిలి సుద్దుల చిన్న ముద్దులను - కళల సోయగముల గడు వేడుకలను
డోలల తల్లిదండ్రులకు నే ప్రొద్దు - ..................................."[4]

అని స్వభావోక్తిని రమ్యమగు వర్ణన లిందు పొందుపరచి, కావ్య గుణములను పేర్కొనెను. ప్రబంధముల తరువాత వెలువడిన దగుటచే ఏకోజీ రామాయణములో ప్రబంధ వర్ణనకు చోటు దొరికినది.

నెలకొన్న చిత్రమై (చట్రాయి) నెలతయై ముందు - తొలకరి మెరపునో తులకించుమేను

తుమ్మెద రెక్కల తొలకించు కురులు - కౌశిక మునికి

మ్రొక్కి రామునికిని మ్రొక్కి యిట్లనియె"[5]

---

1. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 2 డా॥ ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 2 డా॥ ఎం. బాగయ్య 1993
3. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 9 డా॥ ఎం. బాగయ్య 1993
4. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 16 డా॥ ఎం. బాగయ్య 1993
5. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 33 డా॥ ఎం. బాగయ్య 1993

ఈ వర్ణన ప్రబంధ రీతిగా నుండి, కావ్య గుణములను, పురాణ విధాన రచనను గుర్తించుచున్నది. పురాణ ప్రసిద్ధమగు బంధుత్వముతో రచించెను. కావ్యరీతికి తగిన చంద్ర వర్ణనకు తోడుగ నిర్మించిన ఘట్టము గమనించిన కావ్యవర్ణన గల్దు. గంగ రాజహంసవంటిదని ఏకోజీ వర్ణన.

"సార.నీర గభీర సారస క్రౌంచ - కారడవానేక ఘన రాజహంస
సురుచిర నినద భాసుర దళమూచు - సరస కల్హార విస్తార పరాగ
పరమ శీతల మంద పవమాన చరిత - పరిపూర్ణ జలచరోద్భాసి తోత్తుంగ
వీచివిరాజిత విమల జాహ్నవిని - ......................"[1]

సారసలక్షణ చక్రవర్తియగు ఏకోజీకి పద్మములు గోచరించినవి. ఆ పద్మముల చుట్టు సారసములు, క్రౌంచములు, రాజహంసలు కన్పించినవి. గంగ కల్హార పరాగ పరిమళములతో నొప్పారినది. ఇట్లు కావ్య వర్ణన ప్రబంధ రీతిలో గావింపబడినది.

పురాణ పరంపరముగా కన్యాదానము చేయుట, హోమము వ్రేల్చుట మున్నగు ఘట్టములు. జనక మహారాజు తన కూతుళ్ళ నిచ్చి పెండ్లి గావించు సందర్భము ననుసరించి వర్ణించిన తీరు

" ...................... - పరగ కన్నుల యందు భాష్పముల్ గ్రమ్మ
తప్పక కూతుండ్ల దశరథు చేతి - కొప్పించి మిథిలేశుడుచితోక్తి బలికె
నిన్నాళ్ళు నా యింట నీరజముఖులు -కన్నియల్ పెరిగిరి గారవంబునను
తప్పి తప్పిదములు దనర జేసినను - తప్పు మెప్పులు గాగ దయ సేయువయ్య "[2]

అని తన కూతుళ్ళను గారాబముగా పెంచుకొన్నననియు, తెలియక తప్పు చేసినను, ఒప్పులుగా మన్నించు మనియు లోకార్థ భావమును ప్రకటింపచేసిన కవి, తన కావ్యమున సహజత్వమును, సాంఘిక సంస్కృతులను గమనించినవాడు.

శ్రీరాముడు విల్లెక్కు పెట్టు సందర్భమును గోనబుద్ధారెడ్డి - ఏకోజీలు మూలమును మరిపించిరి. అది కౌశికుడు రామునితో పలికినవి:

---

1. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 22 డా॥ ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 50, 51 డా॥ ఎం. బాగయ్య 1993

"వీరాధి వీర యీ విల్లెక్కుపెట్టి - కరమర్థి సీతను గైకొనుమనిన
చిరునవ్వు తళుకొత్త చెలగి రాఘవుడు - కరిరాజు చెరకును ఖండించు మాడ్కి"[1]

మదపు టేనుగు చెరకు గడను విరిచినట్లు శ్రీరాముడు శివుని ధనస్సును విరిచెనట. ఇట వీరత్వము నాయక లక్షణములు. కావ్య గుణములు ఆపాదించబడినవి.

ఋష్యశృంగుని వేశ్యలు అపహాస్యము చేసిరి. ఏకోజీ రామాయణములో ఈ సన్నివేశము నందు హాస్యముగాని, అసభ్య శృంగారముగాని లేదు. మాయ మానినులు చేసి మునివర్యుగొని అయోధ్యకు వచ్చిరట. ఇచట చక్కని సన్నివేశమును కల్పింపబడెను. కావ్య ప్రక్రియలకు నిదర్శనమిది. శూర్పణఖ వృత్తాంతమున బుద్ధరాజు లలితమైన హాస్యమును పోషింపగా, ఏకోజీ రామాయణమున ఈ ఘట్టము హాస్యాయుతమైనది. శూర్పణఖ రాముని యందు జాచినది. రాముడు పంపగా లక్ష్మణుడు వదినగా భావింపచేసి, చివరకు ముక్కు చెవులు తెగటార్చినాడు.

తారా విలాపమున రంగనాథ రామాయణము, ఏకోజీ రామాయణములలో ఒకే తీరుగా వర్ణించిన కావ్య ఘట్టమును ఇద్దరు కవులు చూపిన కరుణ రస పోషణ స్ఫూర్తిని సాదించిరని చెప్పుటకు సందేహింప పనిలేదు. శ్రీరామునిచే వాలి నేల గూలినాడు. అపుడు తార రాముని గాంచి

"జననాథ! యీ వాలి జంప నేమిటికి - మొనసి నిన్నిటు సేయ మీ తండ్రి తోడ
గరసెనే రఘురామ గణుతింప వాలి - వెరవొప్ప నీ రాజ్య విభవంబు గొన్న
భరతుడే రఘురామ పరికింప వాలి - ..........................
చెనటియై నీదేవి జెరగొని చన్న- దనుజుడే రఘురామ తల పోయువాలి
వాలిన కారణ వైరంబు బూని - తెగటార్చి తిబ్బంగి పేర్చి
నీయట్టి సుకృతికి నీయట్టి పతికి - నీయట్టి కారుణ్య నిధికిట్లు తగునే
జనకజతో గూడ జనియెనో యెరుక - ఘనమైన విరహాగ్ని క్రాగెనే యెరుక
భూమీశనేడు నా పుణ్య మిట్లయ్యె - నేమి సేయుదు నింక నేమందు విధికి
నీ వాలి నెడబాసి యేనుండ జాల - దేవ నన్నునుబట్టి తెగటార్చవయ్య
అని యురంబును మోమో నందంద ముది"[2]

1. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 37 డా॥ ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - కిష్కింధాకాండము - పుట - 219 - డా॥ ఎం. బాగయ్య 1993

అని రంగనాథ రామాయణమున యుండగా ఏకోజీ తన రామాయణమునను ఈ సన్నివేశము కరుణ రసాత్మకముగా చిత్రింపబడినది. తార వాలి శరీరమును తడవుచు ఏడ్చుచున్నది. అవసాన దశలో నున్న వాలి భార్య దుఃఖమును ఆపలేక ఏమియు మాట్లాడలేక కన్నులు మూయుచు అంగదుని (కొడుకును) గాంచి కనుగొలకుల నుండి అశ్రుబిందువులు రాల్చినాడు.

ఈ ఇద్దరు రాజకవులు వీర రసమును మనోహరముగా పోషించిరి. రణరంగములలో వీర విహార మొనర్చియుండుట వలన, వీర రస స్ఫోరకములైన సన్నివేశములను రమ్యముగ మలచిరి.[1] భీభత్స సన్నివేశమును బుద్ధరాజు చిత్రించిన తీరు కళేబరములను కాకగృధ్రజంబుకములు పెరికి వేటాడు విధము, వాటి దృశ్యము నెంత రమ్యముగా తీర్చెనో గమనింతము.

"విరిగిన రథముల వికల భావమున - పరియలై పడిన కపాల కుంభములు
దునిసిన చేతులు తునియలై పడిన - తనువులు నురుమైన దంతి దంతములు
జిదిసిన తలలు విచ్చినంబులైన - గదలును పొడియైన ఘన కంకటములు
తెగిన గుండియలు నుద్ధృత మస్తకములు - పగిలిన గళములు భగ్నశస్త్రములు
ప్రేవులు ప్రోవులు పిశిత ఖండములు - జీవముల్ విడిచియు చెలువొందు కరులు
హయముల చిద్రువలు నరి శృంగములు - పయి పయి బడిన కబంధ బృందములు
నిలువక పారెడి నెత్తురు టేర్లు - ......................................."[2]

ఈ సన్నివేశమును ఏకోజీ తీర్చిన తీరు ఒకే పోలికలో గలవు.

'ఆ రక్తధారల నందంద గ్రోలి - శ్రీరాము సన్నుతి చేయు భూతములు
శిరములు మెడుదలు,చిగురు మాంసములు-పరువడి భక్షించు బ్రహ్మ రాక్షసులు '[3]

అని రాక్షస వృత్తిని యుద్ధరంగమున తేటపరచెను. రావణుడంతటి వాడు శ్రీరాముని కీర్తించినట్లు రంగనాథ రామాయణములో గలదు.

---

1. ఏకోజీ రామాయణము - కిష్కింధకాండము - పుట - 15 డా॥ ఎం. బాగయ్య 1993
2. ద్విపద రామాయణభారతి - జె.వి. సుబ్బారాయుడు - పుట - 306
3. రంగనాథ రామాయణము -యుద్ధకాండము పిపి 542, 543

"నల్లవో రఘురామ ! నయనాభిరామ - విలువిద్య గురువర వీరావతార!
...... బాపురే ! రామ ! భూపాల - లోకముల నీపాటి విలుకాడు నేర్చునే కలుగ"[1]

రంగనాథ - ఏకోజీ రామాయణ కర్తలు, రావణ కుంభ కర్ణులిరువురిని ఆత్మజ్ఞాన పరాయణులుగా తీర్చిదిద్దినారు. వీరిద్దరు శ్రీరాముని విష్ణువు అవతారముగా గ్రహించిరి. ఇట్టి పాత్రలను పోషించుటలో ఈ కవులు ఘనతను చాటుకొనిరి. సీతను లక్ష్మీదేవి అవతారముగను ముందే తెలుసుకొన్నట్లును విశదపరచిరి. ఇట్లు రెండు రామాయణములలో కావ్య, పురాణ లక్షణములు గ్రహింపబడినవి.

---

1. ఏకోజీ రామాయణము - యుద్ధకాండము - పుట - 142 డా॥ ఎం. బాగయ్య 1993

# అష్టమ ప్రకరణము

# పాత్ర చిత్రణ - తులనాత్మకత

పాత్ర చిత్రణము (పోషణము) నందు గోనబుద్ధారెడ్డికి, ఏకోజీకి పోలికలు గలవు. ఇద్దరు రామాయణ కర్తలు కూడ శ్రీరాముని విష్ణ్వంశ సంభూతునిగ, పరాత్పరునిగ సంభావించుకున్నారు. రంగనాథ రామాయణము వలన ద్రష్టలైన విశ్వామిత్రాది మహాఋషులేగాక ప్రత్యర్థులైన రాక్షస వీరుల పక్షములోని వారలైన కైకేశి, మండోదరి, విభీషణుడు, కుంభకర్ణుడు మొదలయినవారి మనోభిప్రాయములు రాముడు సాక్షాద్విష్ణువు తప్ప మరొకరు కాదని భక్తి శ్రద్ధలతో కీర్తించి యున్నారు. శివాంశసంభూతుడైన హనుమంతుడు శ్రీరాముని నమ్మినబంటుగా నిరంతరము రామనామ స్మరణతో రాముని పాదాలనే నమ్మి యున్న పరమభక్తాగ్రేసరుడు.

ఇట్లు దేవతలు, మహర్షులు, వానరులు, మానవులు, రాక్షసులు కీర్తించినారు. వీరందరే కాకుండా తిర్యగ్జాతికి చెందిన ఉడుత, జడపదార్థమైన శిల (అహల్య శాప విమోచనము) శ్రీరామునికి ప్రణమిల్లినవి. సేతు బంధనము సమయమున వానరుల సహాయముగ చేతనైన సహాయము ఉడుత కూడా చేసి ఎన్నటికీ చెరగని శ్రీరామ హస్త ముద్రికలను వీపున ధరించగలిగినది. ఆది దేవుడైన రాముని భక్తి పారవశ్యమున మునిగిన తిర్యక్కులను గ్రహించుట అతిశయోక్తి గాదు. ఇట్లు ఈ విధముగా శ్రీరామ చంద్రుని పలుచోట్ల భగవంతుని స్పష్టపరపబడినది. రావణ వధానంతరము అయోధ్యకు సీతారామ లక్ష్మణ హనుమంతులు తిరిగి వచ్చినారు. లంక యందు రావణుని రాజ్యములో కొంత కాలము ఉండి వచ్చినది. కావున సీతను పరిగ్రహించుటకు అంగీకరింపడు. ఇచట రాముడు సీత భర్తయేగాక అయోధ్యానగర ప్రభువు కూడ. దేశాధినేతయగు వారి భార్య శీలవతియై యున్నచో ప్రజల నుండి నిందలు రావు. కావున సామ్రాజ్య చక్రవర్తి పట్టమహిషి కాబోయెడు సీత శీలము కళంక రహితముగా నుండవలెను. అందుచే శ్రీరాముడు రాజ ధర్మానురక్తుడై నిర్దాక్షిణ్యముగా సీతను అగ్ని ప్రవేశము గావించి పాతివ్రత్యమును నిరూపించెను.

అవనిజయగు సీతాదేవి లోకాపవాదు కంటె అగ్నిప్రవేశమే మేలని భావించినది. సత్యసంధుడగు అగ్నిదేవుడు సీతను స్పృశింప సాహసింపలేదు. సీత శీలవతియని

నిరూపింపబడినది. దేవతలు పూల వర్షము గురిపించిరి. అమరులు పతివ్రతయని చెప్పి సీతా పరిగ్రహణమును రామునకిప్పించిరి.

ఈ సీత అగ్ని పరీక్ష ఘట్టమున ఏకోజీ, గోన బుద్ధారెడ్డి సీతారాముల పాత్ర పోషణమునందు ఒకేరీతిని ప్రదర్శింపచేసిరి. రంగనాథ ఏకోజీ రామాయణములందు కైకను శ్రీరాముడెట్టి సందర్భముననను నిందించలేదు.

ఈ రెండు రామాయణముల లోను శ్రీరాముడు తనకు తానుగా తన శౌర్య పరాక్రమములను చెప్పుకొనడు. శ్రీరాముని గొప్పతనము చెప్పవలసి వచ్చిన సమయమున లక్ష్మణుడు తెల్పును. పురుషోత్తముని విశ్వ కల్యాణ మయ ప్రేమను సౌభ్రాతృత్వమును ఇద్దరు రాజకవులు పోషించిరి. రామావతార ప్రాముఖ్యత మెటువంటిది. శ్రీరాముడు పురుషోత్తముడను లోకోక్తి ఇచట తేట తెల్లమగును. సీతారాములను మాత్రమే కాకుండా ఇతర అన్ని పాత్రలను శ్రద్ధతో ఉచిత రీతినమలచినారు. గోనబుద్ధారెడ్డి ఏకోజీ కవులు రావణుడు గొప్ప కార్యదక్షుడు. పరాక్రమ వంతుడు, శివభక్తుడు. యోధుడు అయినను తనకంటె మిన్నయగు యోధుని పరాక్రమము చూచి మెచ్చుకొనగల సద్బుద్ధి గలవాడు. ఏకోజీ రామాయణములో ఆంజనేయుని పిడిగ్రుద్దు తాకగానే మూర్ఛిల్లి తేరుకొని నీ యంతటి యోధుడేడి? వీరుడెవడని? కీర్తించినాడు. శ్రీరాముని పొగడినాడు. ఇది ఏకోజీ కల్పితముగావచ్చును. అయినను పాత్ర విభీషణ విషయమున గొప్ప నీతిని ప్రదర్శింపచేసిరి. కుంభకర్ణుడు రాక్షస వీరుల తాకిడికి లేచి యుద్ధము విషయము తెలుసుకొని శ్రీరాముని చేతిలో ముక్తిని పొందెనని తృప్తి పడినాడు. విభీషణుడు చెప్పిన నీతులను లెక్కచేయని మూర్ఖుడైన రావణుని చెంత నుండనొల్లక శ్రీరాముని సన్నిధిని చేరుకొన్నాడు. ఈ పాత్రను బహుచాతుర్యముగాను, దూరాలోచనగల సత్ప్రవర్తనునిగా చక్కగా తీర్చి దిద్దినారు. రావణ, కుంభకర్ణ, విభీషణ, ఇంద్రజిత్తు, వాలి, సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు, తార (తార విలాసము) సులోచన (సులోచనా వృత్తాంతము) మండోదరి, త్రిజట, తాటక, ఖరదూషలు, మాల్యవంతుడు, శబరి వృత్తాంతము; గుహుడు, జాంబవంతుడు, జటాయువు, శూర్పణఖ, విద్యుజిహ్వుడు (శూర్పణఖ భర్త) మారీచుడు మొదలగు వానర, రాక్షస పాత్రలను, మహాభక్తురాలైన శబరి, రామ భక్తుడైన గుహుని వృత్తాంతముల యందు వారి వారి పాత్రలను యథోచితముగాను, సరళముగాను, సరియైన పద్ధతిలో, మనోహరముగా,

కరుణాత్మకముగా, అద్భుతముగా చిత్రించుట జరిగినది. ఎవరి పాత్ర పరముగా ఆలోచించినా వారి వారి పాత్రోచితముగానే అన్పించును గాని వేరుగా అన్పించదు.

స్త్రీ పాత్రను పోషించుటలో యిద్దరు కవులు ఉదాత్తముగను, మనోహరముగను చిత్రించినారు. ఎచటను ఆవేశ అసభ్య పద ప్రయోగములకెట్టి తావివ్వలేదు. ఇట్లు సర్వపాత్రలకు, సమదృష్టిలో సమ ప్రాధాన్యము నిచ్చినారు. రెండు రామాయణాలు సర్వాంగ శోభితమై సంపూర్ణమై, సమగ్రమైయొప్పారుచున్నవి. సీతవంటి మహాసాధ్వీమతల్లి పాత్రదే కాకుండ మండోదరి, సులోచన వంటి పతివ్రతామతల్లులకు కూడ స్థానము కల్పించిన మహా కవులిద్దరు. కుంభకర్ణుడు, తన అగ్రజుని కొరకు జీవితమును త్యాగము చేసిన త్యాగధనుడు. మండోదరి, సులోచనలు పతిభక్తి పరాయణురాలుగను, కరుణ రసార్ద్రముగా పోషింపబడిన రంగనాథ రామాయణము మెచ్చుకోదగిన రామాయణము. ఈ రామాయణమందలి రామభక్తి, ధీశక్తి యెంతయైనను కొనియాడదగినది.

ఇట్లు రాజకవులిద్దరు తమతమ రామాయణములలో అవాల్మీకాంశములను పోషించియు, లోకానుభవశక్తిని, సమకాలిక సాంఘిక పరిస్థితిని, భక్తిని, శక్తిని, అనురక్తిని ద్విపద సాహిత్య సముద్రములో లవణము వలె లోకములో ప్రాచుర్యమును పొందినవి. పండిత, పామర, బాల, వృద్ధ, స్త్రీ పురుష భేదము లేకుండా అందరిని అలరించి ఆకట్టుకొన్నవి. చక్కని సామ్యములతో వర్ణనలతో సముచిత భావములతో ఈ రెండు రామాయణాలు ఇలలో రామకథలుగా విలసిల్లుచున్నవి.

# నవమ ప్రకరణము

# కథా సంవిధానము

కవి లోకము నందలి లోతుపాతులు గ్రహించి తమ కనుకూలముగా మనుష్యుడు ప్రవర్తించుట, అనగా ఒక కార్యము జరుగుట మన కిష్టము లేదు. చెప్పుచున్నది పై అధికారి, తప్పించుకొనవలెను. అనగా ఆ అధికారి మనస్సుననుసరింపవలెను. అతని మనః ప్రవృత్తి, యతనికి గల కోరికలు, ఒక విషయము నందతని మనస్సెరిగి యుండుట వీనిని జాగ్రత్తగా పరిశీలించి వాని మనస్సు తన కనుకూలముగా త్రిప్పుకొనుట నేర్పుగలవాడు చేయుపని. ఆ అధికారి యవివేకియై యీ క్రింది వానిని కోపింపచేయును. అప్పుడు వీనికి కూడ కోపము వచ్చును. ఆ కోపము నెట్లు తీర్చుకొనవలయును? ఇది యంతయు గడుసరులైన మనుజుల మనః ప్రపంచము నందలి యొక విచిత్ర చాలనము.[1]

ఉత్తమ కవి యీ నిగూఢమైన మానవ ప్రవృత్తి నాధారముగా చేసికొని తన కావ్యము నందలి ఘట్టముల దీర్చిదిద్దును. లోకము నందలి కొన్ని యలవాట్లు దేశాచారములు, గృహమందలి కించిచ్చమత్కార జనకములైన సంసారిక పరిస్థితులు వీని చిత్రించు వాని కంటె ఇట్టి మనోలక్షణ మార్గము ననుసరించి కవి నిస్సందేహముతో గొప్పవాడట.[2]

ఉత్తర హరి వంశములో నాచన సోమన ఊర్వశి నరకాసురుల కథా సంభాషణ ఘట్టము నిజముగా నొక గొప్ప సంవిధాన చక్రవర్తిని జేయుచున్నది.[3]

సంవిధానమును గూర్చి క్రీ.శ. 11వ శతాబ్దములో

---

1. వ్యాసావళి - నాచన సోమనాథుడు - సంవిధాన చక్రవర్తి - వ్యాసకర్త : కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ సంకలనము : డా॥ కేశవరపు రామకోటి శాస్త్రి పుట - 2
2. వ్యాసావళి - నాచన సోమనాథుడు - సంవిధాన చక్రవర్తి - పుట 2
3. వ్యాసావళి - నాచన సోమనాథుడు - సంవిధాన చక్రవర్తి - పుట 3

శ్లో॥ ఆస్తాం వస్తుషు వైదగ్ధ్యం కావ్యే కామపి వక్రతాం
ప్రధాన సంవిధానాంక నామ్నాపి కురుతే కవిః
(వక్రోక్తి జీవితం)

అని దానికి శాస్త్ర పదవి నిచ్చాడు. కారికా వృత్తిలో సంవిధానం - కథా యోజనం అని ఆయన భావన చెప్పినారు. అనగా ఆయన ప్రాచీన సాహిత్య మథనములో బహిర్గతమైన అనర్ఘమణి అది.[1]

కావ్యములో వస్తు నిర్మాణ విచ్ఛిత్తి వక్రత ఒక అద్భుతాంశము. ఆ కావ్య ప్రాణ ప్రాయాంశాన్ని (సంవిధానకం) ధ్వనించేటట్లు పేరు పెట్టడమే చాలా అద్భుతము ఇది అయన వ్యాఖ్యాన సారాంశము. కనుక సంవిధానమంటే అద్భుతమైన కథా ప్రాణ భూతమైన సన్నివేశము.

సంస్కృత పురాణములను పండిత కవులు తెనిగింపక మున్నే, యందలి గాథలో విడివిడిగా పద కవిత్వ రూపమున తెలుగు దేశమున వ్యాపించెనని చెప్పుట సారస్వతమునకు ధర్మ విరుద్ధము గాదు.[2] అంతేగాక లోకములోని జాతీయములను, నానుడులను గ్రహించి తాను వ్రాస్తున్న కథలో మిళితము జేసెను. ఇది ఆనాటి విధానము కథాసంవిధానము, ప్రజల నాడిని బట్టి కథను అల్లుట, కల్పించుట, సామాన్యులను తనవైపు మళ్ళించుకొనుట అనునవే సంవిధానములు. ఉదాహరణమునకు ఒక కీర్తనను, అమూలకమైన విషయమును, మూలమా? కాదా? అనే అనుమానము రాకుండగా రచన గావించుట జరిగినది. ఇది కల్పనమే - సంవిధానమే.

కీర్తన

చరణము : "రాతి నాతిగ జేసె నీ పదరజమటంచును ఖ్యాతిగా విని
ప్రీతితో నెఱ నమ్మితిని నా పాతకము లెడబాపు తండ్రీ!

పల్లవి : సీతా మనోహరా ! రారా ! సేవకుడను బ్రోవవేరా!"

---

1. సంవిధానక చక్రవర్తి - ఆచార్య తమ్మపూడి కోటేశ్వరరావు, పుట - 1, జూన్ 1988

2. గౌతమ వ్యాసములు - పుట- 138 - పింగళి లక్ష్మీకాంతం ఎం.ఎస్.ఆర్. మూర్తి అండ్. కో. విశాఖ -2, 1964

ఈ కథా కల్పన సంవిధానము అహల్య రాయిగా పడియున్నదనెడి ఈ యర్థము గల కీర్తనలు ఏనాటి నుండి యున్నవో ఎవరికెరుక?

"అదరి గౌతము డహల్యాదేవి జూచి
పడతిపాషాణ రూపము దాల్చి యిచట
కరముగ్రమగునెండ గాలిఁబెంధూళిఁ
బొరలు చుండుము నీవు పొడగాన బడక"[1]

గోనబుద్ధారెడ్డి గ్రహించినది ఈ కీర్తనలోని పంక్తులను మాత్రమే. ఇక 'లక్ష్మణ దేవర నవ్వు', 'ఊర్మిళాదేవి నిద్ర', 'లక్ష్మణ మూర్ఛ' అనునవి ఆంధ్ర స్త్రీలు నిరంతరము పాడుకొను పాటలలో ప్రశస్తములై యున్నవి. ఈ రామాయణములోని 'సౌమిత్రి నవ్వు' , లక్ష్మణ దేవర నవ్వు' నకు ప్రకృతి మఱికొన్ని అంశములు కాక, కావ్య సౌందర్య సంపాదన దృష్టిచే ఆరణ్య యుద్ధ కాండములలో నీ కవి ప్రవేశపెట్టిన మూలక గాథలు ముఖ్యమైనవి మూడుగలవు.

1. జంబుమాలి వృత్తాంతము : రంగనాథ రామాయణములోని ఈ చిన్న కథ స్వయం సంపూర్ణమై వెలుగొందినది. ప్రధాన కథకు సైతము పోషకముగా నున్నది. ఈ కథ లేనిచో శూర్పణఖ ప్రవేశము సోప పత్తికమే గాదు. ప్రజలకు పరిహాస పాత్రమైన ఈ అవివేకురాలి చరిత్రము శోచనీయము దయనీయమును కలుగుచున్నది.

2. కాలనేమి వృత్తాంతము : మనల నాశ్చర్య చకితుల జేయు రాక్షసుల మిత్ర కథలు ప్రతి క్రియా కల్పనాచతురత. రావణుని శక్తిచే లక్ష్మణుడు మూర్ఛిల్లినపుడు పునరుజ్జీవితుడగు నాయని ప్రజలు తహతహ పడు పాఠకులకు, ఈ అవాంతర కథ వలన కలిగిన కాలయాపనము భరింపరాని యుత్కంఠను గల్గించి, దుర్భర సంశయాస్పదమైన పరిస్థితిని సృష్టించి, అంతమున చేకూరిన మేలును ఇనుమడింప చేయుట సంవిధానమే.

3. సులోచన వృత్తాంతము : మండోదరి కోడలైన సులోచన అత్తగారికిని. అత్తగారి అత్తగారికిని (కేకసి) ఏ మాత్రము దీసిపోదు. ఈ పతివ్రత యుద్ధ రంగము:

---

1. రంగనాథ రామాయణము - బాలకాండ - పుట 57 ఆంధ్ర విశ్వకళా పరిషత్తు - 1942

ప్రవేశించి, శత్రువుల మధ్యకు బోయి, వారిని మెప్పించి, రణములో మరణించిన పతి కళేబరమును సహగమనార్థమై తెచ్చినపుడు

> "యింతి తెగువకు నాయింతి తెలివి - కాయింతి సమబుద్ధి కా మహా మహిమ
> కాయింతి పతిభక్తి కాయింతి వేగఁ - గాయము ఁదెచ్చిన క్రమశక్తియుక్తి
> కేమన జాలక - ................................"[1]

అని ఆశ్చర్య చకితుడై రావణుడు కొడుకు చావుకు కారకుడయ్యెను. కథా కల్పనల సొంపులతో నింపి, ప్రజలను రంజింపచేయ గలిగిన నాటి విచిత్ర ప్రభావములు గలవు. ఇదే సంవిధానము.

లక్ష్మణ - శూర్పణఖ పాత్ర చిత్రణలో విరుద్ధ సన్నివేశము గలదు. తెలుపు నలుపులు రెండు ఒకదాని నొకటి నారసి ఒక విచిత్ర స్పర్ధలు పోషించబడినది. కనుక సంవిధానము - నాటకీయాలు - రసాత్మకము, విచిత్ర స్పర్ధాత్మకము.

వీర శృంగార సంఘర్షణ - స్పర్థ ఇంత విచిత్రముగా చెప్పుట కంటే కవితా తపస్విత ఏమున్నది? ఇది సంవిధానమునకు వైచిత్రి నాపాదించే కవి ప్రతిభా నిర్మిత వాక్యము పై లక్షణము వైచిత్రి కూడ గలదు. ఈ విషయములు రంగనాథ - ఏకోజీ రామాయణము కథా నిర్మాణములో కల్పనలో, అవాల్మీకాంశములో గలవు. కావున ఆ విషయమును ఎక్కువగా వ్రాసిన పునరుక్తి కాగలదు.

**కథా సంవిధానము :**

రంగనాథ రామాయణము నందు ప్రతి కాండము ప్రారంభాంతములు ఒకే తీరుగా లేవు. శుభముతో, సుఖముతో సమాప్తము గావలెను. నేటి రచయిత దృష్టి ఇవే బుద్ధారెడ్డి రచనకు హేతువైనది.

1. యథాజిత్తు భరత శత్రుఘ్నులను తీసికొని పోవుటకు వచ్చెను. వివాహానంతరము తండ్రి యనుమతితో వారు తాతగారింటికి పోయిరి. కావున వారి వారి రాజగృహలాంఛన నివాసముతో అయోధ్యలోని సీతారాముల విహారముతో బాలకాండము సమాప్తమగుట సుఖాంతము. శ్రీరాముడు అరణ్య వాసమునకు పోవుట, దశరథుని మరణ వార్త

---

1. గౌతమ వ్యాసములు - పింగళి లక్ష్మీకాంతం - పుట 145 - 1964

భరతాదుల విలాపములతో కూడియున్నది అయోధ్య కాండము. ఇందులో శ్రీరాము పాదుకా పట్టాభిషేకముతో ముగించుట శుభాంతము.

2. అరణ్య కాండము నందు సీతాపహరణము చేత విలపించు శ్రీరాముడు పంపానదిని చేరి, సౌమిత్రిని సమీపించుట, సౌమిత్రి సాంత్వనమున నూరడిల్లుటలోను, పుణ్య క్షేత్ర దర్శనముతోనూ శుభాంతమగుచున్నది.

3. సముద్ర తరణమునకు చింతిల్లు వానరులు భయమును తొలగించి, హనుమంతుడు సముద్రమును లంఘించి, లంకను హాయిగా చేరుటలో ఈ కిష్కింధా కాండము సుఖాంతమగుచున్నది.

4. సీతాదేవికై విలపించు శ్రీరామునికి సీతను దర్శించి యామె నోదార్చి ఉచితమైన శుభవార్తను తెచ్చిన ఆంజనేయుడు శ్రీరామునకు దుఃఖోపదేశమును కల్గించుట. సుందర కాండలోని విశేషము సుఖవంతమైనది.

5. సీతారాముల పట్టాభిషేక మహోత్సవమున భోజనాదులతో ముగించుట శుభముగానున్నది.

ఇట్లు గోనబుద్ధారెడ్డి ప్రతి కాండము నందును సుఖాంత, శుభాంతములుగా విభజించుకొనినాడు. "మంగళాదాని, మంగళ మధ్యాని, మంగళాంతాని, శాస్త్రాణి పథంతే అనెడి సంప్రదాయమును తు.చ తప్పకుండా పాటించినాడు.

పై నియమ నిబంధనములను పాటించుట కొరకే బుద్ధారెడ్డి ఇతర రామాయణ ప్రతులను తన దగ్గర పెట్టుకొని, పరిశీలించి రచియించినట్లు విదితమగుచున్నది.

ఇక రంగనాథ రామాయణములో కథాంశములు కల్పనలు ఔచిత్య విచారములు మూలానుసరణము కొన్ని, అమూలములు కొన్ని, భూత, వర్తమాన భవిష్యత్కాలములను మూడింటిని నిర్దేశించి వాల్మీకి చేత అడిగించినాడు. అది :

'ఎవ్వడు శ్రీమంతుడెవ్వడు శాంతుడు........అట్టి వాడిల బుట్టె మరిగెనో? యిప్డు పుట్టెనో? యిక మీద బుట్టనున్నాడా?[1] అనే ప్రశ్నలు యీ మహిశ్రీ విష్ణుడిపుడు జన్మించె

---

1. రంగనాథ రామాయణము - బాల కాండము - ద్వి - 103 - 111

2. రంగనాథ రామాయణము - బాలకాండము - ద్వి 112 - 113

రాముడే రాముడి దశరథ రాజునకతడు[2] అని సమాధానమును నారదుడు చెప్పుట కథా సంవిధానమగును.

ఇచట 'రాముడు విష్ణువనియు' నారదునిచే వక్కాణింపబడలేదు. ఇది మూలములో లేదు. రంగనాథ రామాయణములో గలదు. వర్తమానము రాముడనియు, అతడే దశరథ రాముడనియు మానవులతని నడవడినే ఆదర్శముగా గ్రహింపవలెననియు చెప్పబడినది. ఆది కవి ప్రతిపాదించిన అర్థము. రంగనాథ రామాయణము నందు వాల్మీకి స్నానాంతరము క్రౌంచ మిధున దర్శనాది ఘటన సంభవించినట్లున్నది.

"తమసానదికి బోయి తన్నది దాగి - తమయును స్థానముల్ దగ చేయుచుండి
యావేటి దరి గ్రౌంచి యమళంబు ప్రేమ - గాయజు కేళి మైగవయుచో"[1]

కావున సానానాంతరమే రామాయణ రచన సాగినదని చెప్పవచ్చును. సంప్రదాయమును, సదాచారమును పాటించి ప్రథమ శోకావిర్భావము జరిగినట్లు వ్రాసి యౌచిత్యమును పోషించినాడు.

## అయోధ్య నగర వైశాల్యము :

అయోధ్యా నగర పొడవు 12 యోజనములు

వెడల్పు 3, యోజనములని మూలములో నుండగా దానిని రంగనాథ రామాయణములో బుద్ధారెడ్డి 60 యోజనముల వైశాల్యమని తృప్తి తీర రచించెను. 5 యోజనముల నది వెడల్పును వ్రాసి గొప్పగా పేర్కొన్నాడు.

(యోజనము = 12 కోసులు = 24 మైళ్ళు)

దశరథుని భార్యలు : మూలములో ముగ్గురు భార్యలని హ్రి, శ్రీ, కీర్తులను వారలని పేర్కొన్నాడు వాల్మీకి. యింతకు తృప్తి పడని బుద్ధారెడ్డి 350 మంది భార్యలు అని వారిలో ముగ్గురు ముఖ్యమైన వారు కౌసల్య, కైక, సుమిత్రలని పేర్కొను ఘట్టము. ఇది రంగనాథ రామాయణమున కథా ప్రారంభముననే గలదు.

---

1. రంగనాథ రామాయణము - బాల కాండము - 103 - 111
2. రంగనాథ రామాయణము - బాలకాండము - 112 - 113

"అన్నర నాథు కులాంగనమణులు - మున్నూట యేబండ్రు ముఖ్యులై యందు
నచలిత సౌశీల్యమైన కౌసల్య - కుచకుంభ నిర్జిత కోక యా కైక
యనఘు చరిత్రయనో సుమిత్రయును - వినుత కెక్కిరిత్రయియా విద్యలో యనగ"[1]

దశరథుని మంత్రులు : దశరథుని ఎనమండుగురు మంత్రులని వారి నామములను సహితము పేర్కొను ద్విపద పాదములు రంగనాథ రామాయణము నందున్నవి.

"అనఘాత్మకుడు దృష్టియను వాడు విజయు - డనువాడు సిద్ధార్థుడను వాడు మఱియు
నర్థసాధకుడు, జయంతుడు నీతి - తీర్థుడ శోకుండు ధీమంతుడైన
మంత్రి పాలకుడు, సుమంత్రుడు ననగ - మంత్రులు గల రెనమండ్రు నాతనికి"[2]

యాగదక్షిణ : మూల రామాయణములో దశరథుడు హయమేథమును యథావిధిగా నిర్వహించి ప్రహ్లాదులకు నలుగురికి దక్షిణగా తన రాజ్యములోని నాలుగు దిశలను దానము చేసినట్లున్నది. అది 'హోతకు ప్రాగ్దశను. అధ్వర్యునకు పశ్చిమ దిశను, బ్రహ్మకు దక్షిణ దిశను, ఉద్గాతకు ఉత్తర దిశను, యజ్ఞ దక్షిణగా సమస్త భూమిని ఋత్విక్కులకు రాజు నొసంగెను.[3] రంగనాథ రామాయణము నందు

'అధ్వర దక్షిణకై పూర్వదేశ - మాధ్వర్యునకును బ్రహ్మకు దక్షిణంబు
పానరంగబశ్చిమ భూమి హోతకును - దనరునుత్తర ముద్గాతకు నిచ్చె
నిల నయోధ్యయు దక్కనెల్ల దేశముల -నలరి యిచ్చిన యుదమంది ఋత్విజులు'[4]

అని తనకు అయోధ్యను మాత్రము మినహాయించుకొని తక్కినవి దానము చేసినాడు.

పాయస విభాగము : మూల రామాయణమునకు భిన్నముగా రంగనాథ రామాయణమున గలదు. రాజకీయపుటాలోచన గలదు. పాలు పంపక విషయముల్లకు దశరథుడు ఆలోచించి చేసినాడు. 1. వీర్యతారతమ్యము, 2. ప్రాధాన్యము,

---

2. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 9, డా॥ ఎం. బాగయ్య 1993
3. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 10, డా॥ ఎం. బాగయ్య 1993
1. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 11, డా॥ ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 14, డా॥ ఎం. బాగయ్య 1993

3. రాజులలోని పెద్ద పిన్న క్రమములు పాటించుట, 4. దశరథుని రాజకీయపు ఆలోచన అనెడి అనేకమగు హేతువులచేత దాక్షినాత్య ప్రతిని గ్రహించి బుద్ధారెడ్డి అనువదించినాడు. భార్యలకు పాలు పంపకమువలె, పాయసము కూడ పంపిణి చేయించెను. 'అపుత్రస్య గతిర్నాస్తి' అనెడి మాటను పురస్కరించి పుత్ర కామేష్టి యాగమునకు సిద్ధం చేసెను. అంతేగాక అశ్వమేథ యాగము చేసినాడు. ఇదే పుత్ర కామేష్ఠి యనబడును. దశరథుడు తన భార్యల యందు సమానమైన ప్రేమ గలవాడుగ కన్పింపడు. కారణము కైకకు ఇచ్చిన వరముల ప్రభావమే.

అయితే కౌసల్య తన మనోభావమును బయటకు వ్యక్తీకరింపదు. వ్యథ చెందును. రామాయణముల ముక్తి కాసారములో మునిగిన రంగనాథ రామాయణ కర్త, ఏకోజీ కర్త లిద్దరు సవిస్తర, సంక్షిప్తములుగా తీర్చి దిద్దిరి. గోన బుద్ధారెడ్డి పుత్రులచే వ్రాయించినందున రామాయణములో కొంత వర్ణన అధికముగా గలదు.

భరతుడు తన తల్లి కైక అర్థకామనచే చేసిన చర్యకు దుఃఖించి, అపనిందకు భయపడినాడు.

"ఇంక నీపురమేల - యీ భోగమేల - శంకింపకడవియే శరణంబునాకు"[1]

అని వైరాగ్యమును ప్రకటించి, కులగురువగు వశిష్టుని పరీక్షలో నెగ్గి పెద్దల అనుమతితో చిత్రకూటము చేరి శ్రీరాముని పాదములనంటి

"నన్ను నీబంటు మన్నన చేసినాడు - విన్నపం బాలింపవే దయామూర్తి"[2]

అని ప్రార్థించి భక్తిని ప్రకటించుకొనెను. ఇచ్చట కవి భరతుని పాత్ర పోషణలో కథా విధానములో నేర్పును ప్రకటించెను.

"ముని నారదుని జూచి ముదమున బలికె - భువిలోన నిపుడతి పుణ్యనరుండు
ఎవడు సద్గుణ శీలుడెవడు కృతజ్ఞు - డెవడు వీర్యంబున నెలలేని వాడు"[3]

అను మాటలు వాల్మీకి రామాయణమునకు సన్నిహితముగా వ్రాసి తన మూల విధేయతను చాటుకొనెను.

---

1. రంగనాథ రామాయణము - అయోధ్యా కాండము - పుట - 146 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942
2. రంగనాథ రామాయణము - అయోధ్యా కాండము - పుట - 157 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942
3. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట -2, డా॥ ఎం. బాగయ్య - 1993

శ్రీరాముడు విష్ణువుగా భావించినపుడు

"పొలువైన లక్ష్మిని పొందిన వాడు - పలుమారు సుజనుల పాలించువాడు"[1]

అనియు ఇతడు దశరథ తనయుడు. దశ దిశలను కీర్తి దనరినవాడు, ఇనకుల తిలకుడు, దేవేంద్ర సన్నుతుడు, పురుషోత్తముడతడే, మానవులకు మార్గదర్శకుడనియు ప్రతిపాదించెను.

వాల్మీకి తమసానదిలో స్నానమాచరించి, శుద్ధాత్మకు రామాయణ రచనకు పూనుకొన్న విధము రంగనాథ రామాయణము, ఏకోజీలలో నొకేతీరుగా నున్నది.

"తమసానదికి బోయి తడయక స్నాన - మమరగావించి శుద్ధాత్ముడైరాగ"[2]

అని రచించి, సంప్రదాయమును సూచించెను. దశరథ మహారాజునకు మున్నూట యాబది ముదితలాతనికి, మున్నుగా వారిలో ముఖ్య కౌసల్య అని దశరథనకు మూడు వందల యేబది మంది భార్యలలో ముఖ్యురాలు కౌసల్యయని రంగనాథ రామాయణమును అనుసరించెను. 16, 17 శతాబ్దములలో బహు భార్యత్వము సమకాలీన పద్ధతిలో గలదు.

అయోధ్యా పురము ద్వాదశ యోజనాయతము పొడవు, పంచయోజనముల వెడల్పు అని రంగనాథ రామాయణమును అనుసరించిన తీరు గమనింతము.

"సాకేత పురమొప్పు సరయువు పొంత - వొనరంగ ద్వాదశ యోజనాయతము మునుపంచ యోజనముల వెడల్పగుచు - ....................."[3]

అని యథాతథముగా అనువదించి, రచనా సంవిధానమును పాటించెను. దశరథుని మంత్రులు ఏనమండుగురని రంగనాథ రామాయణములోని మాటను పాటించిన తీరు

"...........

మతి మంత్రు లెనమండ్రు మంత్రులాతనికి

సరసులైనట్టి యా సచివులతోన"[4]

---

1. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 4, డా॥ ఎం. బాగయ్యా - 1993
2. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 6, డా॥ ఎం. బాగయ్యా 1993
3. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 7, డా॥ ఎం. బాగయ్యా 1993
4. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 10, డా॥ ఎం. బాగయ్యా 1993

ఏకోజీ రామాయణములో మంత్రుల నామములు చూపలేదు. రంగనాథ రామాయణములో వారి నామములను కూడా సూచింపబడినవి. దాన ధర్మములను దశరథుడు అగణితముగా చేసినట్లు ఏకోజీలో పేర్కొనెను. రంగనాథ కవి పేరు పేరున పేర్కొనెను.

"తానుదేవ ఋణంబు తగ ఋషిఋణము -దానయాగములచే తగదీర్చుకొంటి." [1]

అని ఒక్క మాటలోనే సమస్త దానములను అన్వయింపచేసెను. ఋష్య శృంగుని కథను రంగనాథ రామాయణములోని విధముగా, వర్ణనాధిక్యములు లేకుండా వైదిక చింతనతో ఏకోజీ గావించెను. రామాయణములో ఋష్య శృంగుని పాత్ర చాలా పవిత్రమైనది. దానికి వేశ్యా సంబంధము చెప్పగా ఈ కవి ఆ పాత్రను స్వచ్ఛతను పవిత్రతను నిలిపినాడు.

"చేడలచే ఋష్యశృంగు దెప్పించి - తోడ ననావృష్టి దోషంబులనచి"[2]

అని అతిసాధారణ ధోరణిగా రెండు పాదములలో రంగనాథ రామాయణములో విపుల వర్ణనలు త్రోసిపుచ్చెను. రావణుని బాధకు తాళలేక దేవతలు బ్రహ్మను వేడుకొనిరి. బ్రహ్మ విష్ణువును వేడుకొన్నంతనే భూలోకంబున రామావతారమెత్తి, రావణుని వధింతునని చెప్పిన విషయమును గుర్తించిన మునీశ్వరులు

"మునివశిష్ఠాదులు ముదమొప్పగూడి - దనరంగ నశ్వమేధంబు గావించి"[3]

అని మునీశ్వరులు కలిసి అశ్వమేథము చేయించుచున్నారు. దశరథుడు పుత్రుల పొందగలడు. వారిలో రాముడు అవతరించుననెడి అంతరాత్మ ప్రబోధమును ఏకోజీ నివేదించెను. ఇది అతిచక్కని రచనా పద్ధతి. బ్రహ్మ దేవుడు దేవతలతో నిట్లు వక్కాణించెను. మన బాధలు బాపుటకు విష్ణువు రాముడుగను అవతరించును. మీరందరు వానరులై సహాయపడుమని చెప్పిన విషయము.

"అనవిని సురలు నిజాంశంబులందు - జనియింపజేసిరి సకల వానరుల"[4]

---

1. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 9, డా॥ ఎం. బాగయ్య - 1993
2. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 10, డా॥ ఎం. బాగయ్య 1993
3. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 11, డా॥ ఎం. బాగయ్య 1993
4. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 14, డా॥ ఎం. బాగయ్య 1993

అని దేవతలకు చెప్పెను. రాముడు జన్మించినపుడు రఘుకుల గురువు వశిష్ఠుడు జాతకర్మములు చేసినాడు. ఆ సంగతి

"ముని వశిష్ఠుని వేడ్క మొనయ రప్పించి - కనికరంబున జాత కర్మముల్ జేసి"[1]

అని వైదిక, క్షత్రియోచిత సంప్రదాయమును సూచించినాడు. అంతేగాక వేద మంత్రములు, సకల శాస్త్రములు పఠించిరని చూపెను. యాగ సమయమున సకల దిక్కుల దేశములను సమస్త సంపదను దానము చేసినట్లు రంగనాథ రామాయణములో నుండగా, ఆదాన ధర్మ విషయములు ఏకోజీలో కన్పించవు. దాన విశేషాలు యాగ సందర్భములో సహజమైనవి. కాబట్టి వాటికి ప్రాముఖ్యత లేదు.

వాలి సుగ్రీవుల వైరమునకు గల కారణము మాయావి అను రక్కసుడు వాలితో యుద్ధము చేసి ఓడిపోయెను. అపుడు వాలి వాని కళేబరమును తన్నెను అది పోయి పతంగు మహాముని కొండపై బడగా అతడు కోపించి, దీనికి కారణమైన వాడు ఈ కొండ నెక్కిన తల వ్రయ్యలై చావునని శపించెను. ఆకారణమున సుగ్రీవుడు ఆపై జరిగిన కథను రామునకు చెప్పి పశ్చాత్తాపము చెంది మన్నింపుమని వేడుకొనెను. ఈ విషయమును రమ్యముగా చెప్పి కథా సందర్భములో చక్కగా పొదిగినాడు.

"...................... - కరములు.మొగుడించి కాకుస్థు జూచి
వాలి ద్యావర (దేవర) కింక వధియించుటెంత - నీలావు శౌర్యంబు నేజూడనైతి
గైకొంటి రాజ్యంబు గైకొంటి తార - గైకొంటి రుమనను కారుణ్య మహిమ
నపరాధి నపరాధిన పరాధినైతి - కృపజేసి మన్నింపు కీశుండననిన"[2]

అని సుగ్రీవుడు పై మాటలు రామునితోచెప్పితాను అపరాధి - అపరాధి - అపరాధినైతినని చెప్పించెను. వాలి సుగ్రీవులుయుద్ధము జేసిరి. సుగ్రీవుడు గెలువలేదు. వారిని వేరు వేరుగా గుర్తింప శక్యము కాదు. ఏకరీతిగా నున్నారు. మెడలోని దండను గుర్తింప, ధరింపజేసి, చెట్టు మాటు నుండి రాముడు వాలిని జంపెను. అపుడు వాటి మాటలు కవిపలికించిన తీరు గమనింతము. రాజధర్మములు, నీతి, హితము కథా సంవిధానమునకు సరిపోయినవి. నాటి - నేటి అటవిక జాతి వారి ఆచార వ్యవహారములను స్మృతి పథమున త్రిప్పినాడీ కవి.

---

3. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట - 15, డా॥ ఎం. బాగయ్య 1993
1. ఏకోజీ రామాయణము - కిష్కింధా కాండము - పుట - 9, డా॥ ఎం. బాగయ్య 1993

"........................... - పాయక నావాలి పడియె భూస్థలిని
యవశుడై పడియున్న యావాలిడాయ - రవి వంశ మణియైన రాముడు రాగ
తెలిసి మెల్లన రాము దెస జూచి వాలి - పలికెను కోపసంభరితాత్ముడగుచు
ధరాత్ముడై యుండి తగునే నీకిట్టి - కర్మంబునకు నొడిగట్టి శ్రీరామ
అడవి మృగాదుల నణతురుగాని - పుడమి కోతులను చంపుదురే భూపతు
లన్న తమ్ములము మేమతరి పోట్లాడ - నన్ను జంపుట నీకు న్యాయమే రామ"[1]

అని ప్రశ్నించెను. ఈ పద్ధతి మూలములోను రంగనాథ రామాయణములోను కన్పింపదు. ఇచ్చట శత్రువును పొగుడుట, నా కర్మయని భావించుట, అడవి మృగముల చంపుదురు. అన్నదమ్ములము మేము పోట్లాడగ, "నన్ను జంపుట నీకు న్యాయమా? రామ" అని ప్రశ్నించుట లోకము నందలి కర్మ సిద్ధాంతమును, యోగ దృష్టిని, రఘు వంశ శ్రేష్ఠుడవై యుండి కిరాతకుని వలె నన్ను చంపధర్మమా? యని అధిక్షేపించి, పాఠకులను ఆలోచింపచేసెను. జనక మహారాజు బిడ్డల అందమును గూర్చి ఏకోజీ పల్కించిన తీరు జానపద ఫక్కిని, రంగనాథ రామాయణమును అనుసరించి రచించినాడు. సీతాది కన్యకా మణులిటగలరట.

"కైసేయ చెలగి రాజకన్యకామణులు - వాసించు మధుమాస వానరా రామ
సీమల తిరుగు రామ చిల్కలోయనగ - కోమలంబగులత కూనలోయనగ
మెరుగారు తొలకరి మెరుపులోయనగ - సరిలేని కంతుని శరములో యనగ
పలికెడి కాంచన ప్రతిమలో యనగ - యలరామ మద రాజహంసలో యనగ"[2]
ఒప్పియున్నారు.

ఇంత చక్కని తెలుగు పదముల కూర్పు చేత అంత్యప్రాసలను వేసి పాఠకులనలరింపజేసి, వారిచేత ఆహా .............. అనిపించుకొన్నాడు. భరతుడు తల్లి యగు కైకను నిందించునప్పటి విధము గమనింతము.

"పాపాత్మురాలవు ప్రాజ్ఞవా నీవు - నీ పొట్టనే పుట్టి నిందింతుడనైతి
సోదరియై నీ మోము చూడరాదనుచు- ........................"[3]

---

1. ఏకోజీ రామాయణము - కిష్కింధా కాండం - పుట 15, డా॥ ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట 47 - డా॥ ఎం. బాగయ్య 1993
3. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట 47 - డా॥ ఎం. బాగయ్య 1993

అని విలపించినాడు. ఈ శోక సన్నివేశము సవతి పోరుల నడుమ, నలిగిపోయెడి సంతానమును తలపింపచేయుచున్నది.

"పరమ తత్వము నీవె పరమంబు నీవె - పరమేష్ఠి నీవె యా బ్రహ్మంబు నీవె
క్షరములు నీవె యక్షరములు నీవె - క్షరమక్షరములకు సాక్షివి నీవె
నిన్ను సన్నుతి సేయ నేర్తునే రామ!- ............................[1]

అని యోజన బాహుని వధింపనతడు గంధర్వుడై నిలిచి శ్రీరాముని స్తుతించెను. ఇది కవి కల్పన చేసి, శ్రీరాముని భగవంతునిగా రూపొందించెను. నిన్ను మించిన వారెవ్వరు లేరు. సర్వము నీవేనని చెప్పిన భావము. వానర వీరులు కిష్కంధకు చేరినపుడు వారి వారి యునికి పట్టుదలను గూర్చి కవి.

"నీలాచలమునందు నిషిదాద్రి యందు - కైలాస గిరియందు కనకాద్రి యందు
శోణా చలము నందు సోమాద్రి యందు - ద్రోణాచలము నందు తుచనాద్రి యందు
ఋషభాచలము నందు ఋక్షాద్రియందు - వృషభా చలము నందు వింధ్యాద్రి యందు
నా రత్నగిరి యందు సప్తాద్రి యందు - పారియాత్రము నందు ప్రాగ్గిరి యందు
మలయా చలము నందు మందాద్రి యందు- ............................"[2]

నుండి వివిధ రూప సుందరులైన కవిపుంగవులు వచ్చి శ్రీరాముని దర్శించి, లంకపై యుద్ధమునకు సిద్ధపడినారు. వీరుకాక ఇంకెందరో కవివరులు వచ్చియున్నారు. వీరందరినీ జూచిన శ్రీరాముడు పొంగిపోయెను. ఈ సహజ సుందర వర్ణన చేసి కవి పాఠకులను కూడా సమానముగా నుప్పొంగజేసెను. లంకలో త్రిజట దుస్వప్న విచారమును తన చెలికత్తెలతో చెప్పిన విధము రంగనాథ రామాయణములో ఏకోజీలో కథా సంవిధానము నేకరీతిగా తీర్చిదిద్దిరి.

"కలగంటి నేను నిక్కముగ నీవేళ - తెలియజెప్పెద దాని తెరగొప్ప వినుడు
సామజంబును నెక్కి సౌమిత్రి గొలువ - రాముండు సీతతో రాజూడ గంటి
శ్రీకరంబైనట్టి సంహాసనమున - కాకుస్థ విభుడుండగా కనుగొంటి

1. ఏకోజీ రామాయణము - బాలకాండము - పుట 19 -కిష్కింధా కాండము- డా॥ ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - అరణ్యకాండము - పుట 140, డా॥ ఎం. బాగయ్య 1993

వదలక తన బంధు వర్గంబుతోన - మదమెల్ల సుక్కి సామజమందుండ విడిచి
తైల సిక్తాంగుడై దశకంధరుండు - నేలపై యూరకే నిద్రింపగంటి
వరుసతో నొక కపి కాలాగ్నిలోన - దరికొని లంక దగ్ధము గాగ కంటి"[1]

అని త్రిజటతో భవిష్యత్తు కథను పరమ రమణీయముగా ప్రదర్శించినాడు. లంకలో ఆంజనేయులు సీతాదేవిని జూచి అడవి భాషలు విడిచి, మనుజ భాషతో మాట్లాడినాడు. ఈ సన్నివేశమును ఏకోజీ.

"కనకాంగియుండ నొక్కతే వాయుజుండు - కని సమయంబిదిగా నిశ్చయించి
వనచర భాషలను వర్జించి యెల్ల- మనుజ భాషణముల మగువ కిట్లనియె"[2]

రావణుడు ఆంజనేయుని గుర్తించి, రాముని బంటువని చంపబోయెను. అంతలో విభీషణుడు అడ్డుకొని రాజనీతిని ప్రదర్శించిన తీరు.

"........................- దేవదూతలను వధించుట తగునే
మగుడ కోపము నీకు మనసున నుండ - తగిన దండన కొంత దండించి పంపు"[3]

అని విభీషణుడు చెప్పిన వాక్కులతో రావణుడు దైత్యుల రావించి, మర్కట వాలంబునకు కోకలు జుట్టి తైలదారలు బోసి, చిచ్చు బెట్టించి పంపెను. ఆంజనేయుడు లంకను దహనము చేసి, అబ్ధిలో వాలము ముంచి శ్రీరాముని చేరెను. విభీషణుడు శరణాగతుడై శ్రీరాముని కీర్తించుయెడల ఏకోజి భక్తిభావము వ్యక్తమగును.

"పరమాత్మ శ్రీ వక్షపద్మ పత్రాక్ష
కరుణించి నను ప్రేమగావవే రామః
శరణాగత త్రాణ చాపప్రవీణ
కరుణించి నను ప్రేమగావవే రామ!![4]

అంగదుడు - రావణునితో తన వంశ శూరత్వమును చాటించుకొనెను. ఆ ద్విపద పాదములు.

---

1. ఏకోజీ రామాయణము - సుందర కాండము -పుట 37, 38 - డా॥ ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - సుందర కాండము -పుట 39 - డా॥ ఎం. బాగయ్య 1993
3. ఏకోజీ రామాయణము - సుందర కాండము -పుట 51 - డా॥ ఎం. బాగయ్య 1993
4. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము -పుట 61 - డా॥ ఎం. బాగయ్య 1993

"ఓరి రావణ ! తోక నొగి నిన్ను గట్టి - వారిధి ముంచిన వాలి నందనుండ
నీ కొవ్వు పొలియించి నిను చెరగొన్న - యాకార్తవీర్యుని నణచె భార్గవుడు.
నట్టి భార్గవ రాము ననిలోన లీల - పట్టి గెల్చిన రామభద్రుని బంట
నంగదుండను.......- ..............."[1]

నాగపాశ బద్ధులయిన రామ లక్ష్మణుల సంగతిని రావణుని అంతఃపుర స్త్రీలు సీతకు నివేదించిరి. అప్పుడు సీత తన దీనగతిన విధిని నిందించిన తీరు.

"కట కటా! రామ నీకార్ముఖ విద్య - లెటబోయె ! నీ ధైర్యమెటు బోయెనేడు
సకల లక్షణ బల సంపన్నుడయ్యు - నొక దైత్యుచేనిట్లు నొండౌట తగవే
సౌభాగ్యవతి యంద్రు జనములు నన్ను - నాభాగ్యమిట్లయ్యె నాథయేమందు
హా నాథ ! హా వీర ! మా రామ యనుచు!........................."[2]

దీనిలో విషాదముతో పాటు శ్రీరాముని పరాక్రమము కూడా సూచితమైనది. సీత విలపించినది. ఈ దీనాలాపములు గ్రహించిన త్రిజట సీతాదేవికి ధైర్యము చెప్పి, "నీపతి వచ్చి గొని పోనున్నాడని" చెప్పెను.

లక్ష్మణుడు మూర్ఛిల్లినపుడు శ్రీరాముడు సుగ్రీవునితో తన బాధలు వినిపించి, విలపించి, ఏను నయోధ్యకు నెట్లు బోవువాడ ? నని చెప్పిన తీరు గమనింతము

"చూడు నా తమ్ముని సుగ్రీవ నేడు - పాడి దప్పిటువలె పడియున్నవాడు
నితని బాసిన వెన్క నీ జీవమేల - ప్రతిలేని జయమేల భామిని యేల
కటకటా్రదియ్యారు కాంతలు వత్తు - రిటువంటి తమ్ముని నేనెందుకందు
పురమునకే నొంటి బోవుదు నెట్లు - ..........................................."[3]

నేను అయోధ్యకు బోయినపుడు మా తల్లులు తమ్ముడేడని? అడిగితే నేమి చెప్పదును. తమ్ముడు లేని జీవమేల? కాంతలేల? దేశమెందులకు? అని వైరాగ్య భావమును ప్రదర్శించెను.

రావణుని విష్ణుభక్తి పరీక్షించిన తీరు అమూలాంశము - రంగనాథ రామాయణములో కూడ లేదు. లక్ష్మణుడు రావణునితో యుద్ధము చేసి మూర్ఛిల్లెను.

---

1. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము -పుట 69 - డా॥ ఎం. బాగయ్యా 1993
2. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము -పుట 75 - డా॥ ఎం. బాగయ్యా 1993
3. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము -పుట 76 - డా॥ ఎం. బాగయ్యా 1993

ప్రకటించుచు సౌమిత్రిని రాముని ముందర నుంచగ, రామభక్తిని ప్రకటించుకున్నట్లున్నదని కథాన్వయము - కథా సంవిధానమును ఏకోజీ గావించినాడు.

"పావనియును విష్ణుభక్తుడుగాన - రావణునకు నెత్తరాని లక్ష్మణుని
కొనకొని యవలీల కొనిదెచ్చి రామ - జననాథు ముందర సరగున నుంచె"[1]

కుంభకర్ణుడు నిద్రలేచుటకు చేసిన కృత్యములు ఘోరమైనవి. గదలు, ముసలములు, ఘనమైన ఉగ్గరములను పైన వేచిరి. కొండల బండలు ఉరముపై బెట్టిరి. వృక్షములు దెచ్చి శిరమున తాటించిరి. సింధురంబులు, పోతులు, మేకలు, పులులు, దుప్పులు దెచ్చి ఖరములచే గిట్టలచే దొక్కించిరి. నూనెకుండలు కాచి చెవులలో పోసిరి. గడ్డపారలు గాల్చి నాసికాబిలముల పోసిరి. ఇట్టివి ఏకోజీ కాలంనాటి సాంఘిక పరివర్తనములను బట్టి గ్రహించి యుండవచ్చును. ఆ పిమ్మట కుంభకర్ణుడు లేచినప్పుడు శ్రీరాముని చేతిలో ముక్తిని పొందటానికా? యన్నట్లు మేల్కొన్నాడట. అది అమూలకము.

"శ్రీరాముచే ముక్తి చేకొన కోరి - దూరంబుగా నిద్ర తోసిన మాడ్కి
ప్రళయ కాలాగ్ని బింబంబుల బోలు - కలయంగ నెఱ్ఱని కన్నులతోన
కనువిచ్చియసురులు కంపింపమేలు - కని..................................."[2]

పుణ్య శ్లోకుడైన శ్రీరాముని కథను వ్రాయుటకు పూనుకొన్న ఏకోజీ మహారాజు కథను ప్రసన్నముగా చెప్పుటకును, పాఠకుని మనస్సును ఆహ్లాదపరుచుటకును, కథా నాయకుడైన శ్రీరాముని మహోన్నతుడైన పరమాత్ముడుగా చూపించుటకును ప్రయత్నము చేయుటయే అయన చేసిన కథా సంవిధాన శిల్ప ప్రయోజనముగ కన్పించును. ఏకోజీ తన కావ్యమును సంక్షిప్తముగా వ్రాసినను, కథకు ఆయువు పట్టుగా ఉన్న సంఘటనలను పరమ సుందరముగా తీర్చిదిద్ది, తన కవితాశక్తిని నిరూపించుకున్నాడు. పైన నేను పేర్కొనిన కొన్ని సందర్భములే కాక, మరెన్నియో మెలకువలు మనకు ఈ కవి కథా సంవిధానములో స్పష్టముగా దర్శనమిచ్చును. ప్రక్రియ వలన మహా కావ్యమైన శ్రీ మద్రామాయణమునకు గౌరవము కల్గుటయే కాక ఏకోజీ కవికి కూడ కవి లోకమున సముచిత స్థానము లభించినది.

---

1. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము -పుట 92 - డా॥ ఎం. బాగయ్య 1993
2. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము -పుట 96 - డా॥ ఎం. బాగయ్య 1993

# దశమ ప్రకరణము

# వర్ణనా వైదగ్ధ్యము

కావ్యము (ప్రబంధము)లలో వర్ణనలు పద్దెనిమిది విధములు. వీటిని గూర్చి దండియను సంస్కృత కవి చెప్పిన శ్లోకము.

శ్లో॥నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిల క్రీఢామధుపానరతోత్సవైః
విప్రలంభైర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
మంత్ర దూత ప్రయాణాః నాయ కాభ్యుదయైరపి[1]

అని మహాకావ్య వర్ణన విషయములను గూర్చి వివరించినాడు. దండి పదలాలిత్యము భారవి అర్థ గౌరవము, కాళిదాస ఉపమలు విశ్వవిఖ్యాతి చెందినవి. దండియే కాక విశ్వనాధుడిట్లు వివరించెను.

శ్లో॥సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోష ధ్వాంత వానరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వన సాగరాః
సంభోగ విప్రలంబైశ్చముని స్వర్గ పురాధ్వరాః
రణ ప్రయాణోపయమ మంత్రపుత్రోదయాదయః[2]

మహాకావ్యమున యథాయోగ్యముగా, సాంగోపాంగముగా వర్ణింపదగిన విషయములను గూర్చి విశ్వనాథుడు పేర్కొనినాడు.

దండి వర్ణన విషయములలో చేర్చిన సలిల క్రీఢ, మధు పానములను విశ్వనాథుడు పేర్కొనలేదు. దండి పేర్కొనని కావ్య వర్ణనలు కొన్ని సంధ్య, రజనీ, ప్రదోష, ధ్వాంత, వానర, మృగయా, ముని, స్వర్గ, అధ్వరములను విశ్వనాథుడు కావ్య వర్ణనములలో చేర్చి యున్నాడు. సంస్కృత మహా కావ్యములు పేర్కొనిన వర్ణనములనే ప్రబంధ కవులు గ్రహించిరి. సంస్కృతాలంకారికులు చెప్పిన వర్ణనముల సంఖ్యను ఒకటి రెండు

---

**1. కావ్యాదర్శము : 1 - 16, 17 శ్లోకములు**

**2. సాహిత్య దర్పణము : 6 - 322, 323 శ్లోకములు**

వర్ణనలు అధికముగా చేర్చి తెలుగున పేర్కొనబడినవి. అంతేగాక అప్పకవి ప్రబంధమునకు ఇరువది రెండు వర్ణనలుండవలయుననియు, అందులో కొన్ని లేకున్నను ఆ కావ్యము ప్రబంధమనబడునని చూపెను.

సీ॥ పురమును, ఋతు షట్కమును, ప్రయాణంబును,
శైలంబు, వేటయు, సాగరంబు
మౌలీంద్ర, పుణ్యాశ్రమంబును, మంత్రంబు,
ధూత్యంబు పిదప నద్భుతరణంబు,
విజయంబు, మద్యపానజ వికారంబును
వన విహారంబును వారి కేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంబోచితంబు

తే॥ పద్మమిత్రోదయంబును పరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననగ నిరువది రెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయు ప్రబంధంబు శ్రీనివాస"[1]

అని కాకునూరి అప్పకవి, తన అప్ప కవీయమును ఛందోలంకార శాస్త్రమున పేర్కొనెను. దండి, విశ్వనాథులు పేర్కొనని కన్యాంగ సౌందర్య కథన దౌహృదవన విహారమున్యాశ్రమ వర్ణనలను అదనముగా అప్పకవి పేర్కొనినాడు. అప్పకవి సంస్కృత కావ్య వర్ణనలు చూచి తెలుగులో చేర్చినాడు. ప్రబంధములకు అనువైన వర్ణనలు యన్నియు కలవు.

రంగనాథ రామాయణములోని రచనా రామణీయకము మాయాలేడిని వర్ణించుటలో బుద్ధారెడ్డి తీరుగమనింపవచ్చును.

"అంతంత బొడసూపునట జేరవచ్చు - నంతలో బెదరి బిట్టదరి కుప్పించు
తరుల నీడల కేగు తగబర్ణశాలఁ - బొరబారు నంతంత స్రుక్కిక్రేళ్లురుకు
వసుధ మూర్కొని చూచు వాల మల్లార్చు - దెసలకు చెవి చేర్చి తెలియనాలించుఁ

1. అప్పకవీయము - ప్రథమాశ్వాసము - పుట - 16 - వావిళ్ల - 1970

గంచు మించై పారుఁగ్రమ్మర చేరు - కుంచితాకృతి చెవి కొనఁగదలించు
పచ్చిక పట్లపైఁబవళించులేచు - మచ్చికనచ్చోట మౌనుల ఁజేరు
ఖురములఁజెవిగోకు కొమ్ముల తుదల - విరుల తీగ కదల్చి విరులెల్ల రాల్చు"[1]

అని మాయలేడి చేసిన చేష్టలన్నియు తన ఘంటమున నింపి రామాయణము నందు రమణీయముగా రచించాడీ కవి. మాయలేడి ఆకృతిని మన కళ్ళకు కట్టినట్లు కవి రచించిన తీరు ఎంతో మనోహరముగా నున్నది. దిక్కులకు చెవులు రిక్కించి శబ్దమును వినును, శబ్దమును గ్రహించి బెదరుచుండును. పచ్చిక బయళ్ళలోని పూరి మేసి పడుకొనును. మునీశ్వరులను మచ్చిక చేసుకొని నిర్భయముగా వారితో ఆడుకొనును. తన గిట్టలతో చెవి గోకుకొనును. కొమ్ములతో తీగలను కదిలించి పూలను జలజల రాల్చును. ఇట్టి మనోహర రమణీయ వర్ణన కవి చేసిన కల్పన కొనియాడదగినది.

రామలక్ష్మణులను చూచిన శూర్పణఖ తనను, తన మనోభావమును హాస్య రసాత్మకముగా భావించినది. అది :

"తన మొద్దు మొగము నాతని ముద్దు మొగము - తన మహోదరము నాతని తనూదరము
తన కప్పు కన్ను లాతని గొప్ప కన్ను - లెనయంచు తన కితడే తగునంచు
మొగము చేటంతగ ముసిముసి నగవు - లిగురింప రఘురాము వీక్షించి పలికె"
"శర చాపములు పూసి చరియింపనేల - యరుదైన యడవుల నతివయు నీవు
నీ వేషమున నుండ నేమి గారణము? - నీవెవ్వడవు ? మఱి నీకు పేరేమి?"[2]

అని శూర్పణఖ వికృతాకారమును, లక్ష్మణుని ఆకారము మనోహరముగాను కవి వర్ణించు పై పద్యములందు హాస్య రసమును పోషించినాడు. దేవ దానవ విరుద్ధ లక్షణా కారములు తేట తెల్లమైనది. హేమంత ఋతువర్ణన చేయునపుడు

"వేకువ నొకనాడు వెలదియుఁదానుఁ - దేకువ గౌతమి ఁ దీర్ధ మాడంగఁ
జనుచోట రాముడు సౌమిత్రి ఁ జూచి - కనుగొంటివే శీత కాలంబు మహిమ
దెసలెల్ల ఁ జలికి భీతిలి వెలిపట్టు - ముసుగు పెట్టిన యట్లు ముంచె హిమంబు

1. రంగనాథ రామాయణము - అరణ్య కాండము పుట - 198, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు - 1942
2. రంగనాథ రామాయణము - అరణ్య కాండము పుట - 181, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు - 1942

హేమంత మను మేఘ మెల్లడఁబర్వి - వ్రామిగా వడగండ్లు వర్షించె ననఁగఁ
గురిసిన పెనుమంచు గుంభిని యెల్ల - నెరసి యొప్పారె ఘనీ భవించుచును
ఉర్విపై నామంచు నొక్కక్క చోట - దుర్వాంకురంబుల తుదల జొచ్చితివె?
పచ్చిమిన్నాసలాక తుదల జొచ్చితివె? - గ్రుచ్చిన ముత్యాల క్రోసలై యొప్పెఁ
గాము సమ్మోహన కాండంబుల నగ - హేమంత వాయువుల లవుమై సోక
వెఱపున వణఁకెడు విరహిణుల నగ - దెఱఁగొప్పఁగదులు పూదీగ లీక్షింపు
మంచునఁదారు తామరలు కన్నీరు - ముంచిన విరహుల మోములఁగేరు
బొదిగొన్న యకరువుల్ పొట్టుగా మీదఁ - గదలు తేటులు పొగల్ గాఁజలిగొన్న
కొలను దేవతలకుఁ గుంపట్లు బోలె - విలసిల్లు కెందమ్మి దిరులఁజొచ్చితివె[1]

అని రాముడు, సీత లక్ష్మణుడు అరణ్య వాసము చేయునపుడు చూచిన మంచును వింతగా చిత్రముగా వర్ణించినాడు, మంచు భూమిపైపడి చలికి వణుకు జనులు తెల్ల కంబళ్ళు ముసుకు పెట్టి కప్పుకొన్నట్లు వర్ణించుట, అవనిపై వడగండ్ల వానవలె మంచు కన్పించెను. హిమము పొగలు గ్రక్కెను. పచ్చలు రవ్వలు సలాక (ఇనుపకడ్డీ) కు వేడ్కతో గ్రుచ్చినట్లును, ముత్యాల దండలు కట్టినట్లును తోచెను. చలికి వణికెడు విరహులు కదలు పూలతీగలను ఁజూచి, మంచున నున్న తామరపూలు, కన్నీటిలో మునిగిన విరహుల ముఖమల వలె నుండెనట. అంతేగాక కొలను దేవతల (నాగ కన్యల) కుంపట్లువలె కప్పించు ఎఱ్ఱతామరలు జూచితివా! లక్ష్మణా! అని రాముని ముఖతా పల్కించిన కవి మాటలు వర్ణనీయములు. హేమంత ఋతు వర్ణన ప్రత్యేకముగా యుండి ఇతరులకు తీసికట్టుగా చాటుకొనెను.

అంతేగాక మనవలె నార చీరలు గట్టి వనవాసములో నున్నట్లు భరతుడు కూడ నెట్లున్నాడో? అని భావించి తమ్మునిపై ప్రేమానురాగముతో, పితృవాక్య పాలన చేయు భరతుని కొనియాడిన తీరును గమనింతము.

"నారచీరలు జడల్ నవయుచుఁదాల్చి - నారాకఁగోరుచున్న మహామహుండు
పరమ పావనుడు సౌభ్రాతృ భావనుడు - వరపితృవాక్యమద్వాక్య తత్పరుడు

---

1. రంగనాథ రామాయణము - ఆరణ్యకాండ - పుట - 175 ఆంధ్ర విశ్వ కళా పరిషత్ - 1942

చిరకీర్తి నిరతుడా శ్రితు డాభరతుడు - భరతుడు....... పరిచితి నెట్లు స్నానంబు సేయునో సరములోన !

మౌనియై యెట్లాకో మహిఁబవ్వళించు - ........................[1]

తన తమ్ముడగు భరతుడు చలికి సరయునదిలో స్నానమెట్లు చేస్తున్నాడో? మునివలె భరిస్తున్నాడు. అని సామాన్య మానవుని వలె రాముడు . పలుకుట యుచితముగానున్నది. ఏ తల్లి మాటలు నెల్ల లోకముల కంపించి నోయని, తండ్రి సత్య వాక్పాలన ఁ గడచి సంయమీంద్రుల చేత దీవనలు పొందితిమి. నేడు పట్టణము విడిచి తాపసినైతి నేను పట్టణంబు గలిగి తాపసియయ్యె తమ్ముడు అని రాముడు వాపోయెనట. ఇట్లు సాధారణ పలుకులుచ్చరింపబడినవి.

అన్నదమ్ముల పాడియానై పుణ్యనే జూచి - యెన్ననెవ్వరికైన నింక నేర్వవలయు
నట్టి యా భరతుని ననుగుఁదల్లులను - జుట్టాల నెన్నడు సూతుమోమనము![2]

అని రాముడు తన తల్లులను, చుట్టాలను యెప్పుడు చూడగలమోనని చెప్పిన సందర్భమున శ్రీరామచంద్రుడు లోకములోని జన సామాన్యుడివలె వర్ణించినాడు.

**వర్షాకాల వర్ణనము :**

"గైకొని యింక నిక్ష్వాకు వల్లభుడు - నా కారిపైదండు నడచు చున్నాడు
అని సురలకుఁజెప్ప నరిగెనో ధాత్రి - యన వాయువులతోడ నట ధూళి యెగసె
నాలంబులో దైత్యునడగింపు మనుచుఁ - నాలుండు దన చేతి కాలపాశంబుఁ
బొనర రాముని కయి పుత్తెంచననగ - దనరారి దివి నింద్రధను సొప్పెఁజూడ
సుమరులు రామునకయి దండు నడవఁ - కొమరార భేరులు ఘోషించు కరణి
నున్నత ధ్వనులతో నొంటొంటబర్వ - మిన్నెల్ల భేదిల్ల మేఘంబు లుఱిమె"[3]

అని వర్షాకాలగమనమును కవి వర్ణించిన తీరు శ్రీరామునకు స్వాగతము పలికి నట్లున్నది. రాముడు రావణాసురునిపై యుద్ధానికి పోవుచున్నాడా యనునట్లు దేవతలకు

---

1. రంగనాథ రామాయణము - అరణ్యకాండ - పుట 175 ఆంధ్ర విశ్వ కళా పరిషత్ - 1942
2. రంగనాథ రామాయణము - అరణ్య కాండము పుట - 175, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు - 1942
3. రంగనాథ రామాయణము - కిష్కింద కాండము పుట 251, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942

భూదేవి చెప్ప పోయినట్లును, ఆకాశములో ఇంద్రధనస్సు రాముడు గెలుచుటకై యముడిచ్చిన బాణముగా పోల్చబడినది. ఆకాశము నుండి మంచి ముత్యాల దండలు తెగిపడుచున్నవా? అనునట్లు చినుకులు పడెనట. సీతను ( తన బిడ్డను) తలచుకొని భూదేవి ఉదగ్రము గావించెనట.

**శరత్కాల వర్ణన :**

తెలివొంది కిరణముల్ దిశలెల్ల నిండఁ - జెలువొంది రవి ప్రకాశించె లోకముల
ధరణి నిష్పంకమై తనరె నెంతయునుఁ - గరమొప్పగాకులఁగమలంబు లలరె
గూలముల్ మదకరుల్ఁగోరాడె - రేలు నక్షత్ర చంద్రికలుంబెంపారె
వచ్చి నంచలు సరోవనికి ‹ గాపురము - మెచ్చెఁదామర తూండ్లు మెనగి యుల్లమునఁ
జెఱకు రాజనముల చేనుల పంట - తఱచయ్యె వృషభ యోధము అంకెవైచె
కలకమంతయు ‹బాసి కనుపట్టె జలము - ......................................[1]

అని వర్షాకాలముపోయిన పిదప శరత్కాలమున గల విశేషములు నిర్మలమైన నీటని, రాయంచల కోలాహలమును, చెఱకు చేనుల పంటలను, ఏనుగుల ‹గోరాటములను, ఎద్దుల అంకెలను వర్ణించుట చేత ప్రకృతి వర్ణన మనోహరముగా నున్నది. రాముని సైన్యము మాల్యవంతమున నున్న కాలమున ఈ ఋతువు వచ్చినది. అనగా ఇక మన కష్టాలు తొలగిపోయినవి. సుఖములే వచ్చిన వని స్వాగతము పలుకుటకై శరత్కాలగమనము వచ్చినదట. ఇక యుద్ధము చేసినను విజయము మనదేనని భావించిన విధము సహజము.

**సాయం సంధ్యా వివర్ణన :**

రాముడు శోకాంబుధిలో నుండగ, అతని తోడనే అతి వేగమున నినుడపరాబ్ధి గ్రుంకెను. చెఱవొంద నపరాబ్ధి చెంగావి చీర నెలమి దెచ్చిన క్రియ నెఱసంజ యొప్పెను. శ్రీరాముని నిశిత బాణములు సముద్రముతో మునిగి, తారావళిలో చేరెను. విరహము చే రాముడు చిక్కిపోగ చక్రవాకములు విడిపోయెను. అంతేగాక చందురుడట్టి హాసము

1. రంగనాథ రామాయణము - కిష్కింధా కాండము పుట - 253, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు

చేసెననగ - నందంజ చంద్రికలతిశయంబందె. అని వర్ణించుట చేత వెన్నెల వర్ణన గోచరమగుచున్నది. వెన్నెలలో చందనపు వీచికలు - దిక్కులనే కాంతుల మరి వెన్నెల యొప్పెనట. వెన్నెల కాంతుల్లో వానరులు పాడియాడిరట్ల అప్పుడే శ్రీహరి కథలను (అవతారములను) గానము చేసి వినిపించిరట. అట్టి శాస్త్రోక్తమగు వర్ణనలను గోన బుద్ధారెడ్డి వర్ణించినాడు. ఇక ఏకోజీ తన రామాయణము నందు వర్ణించిన విధము గమనింతము.

## ఏకోజీ రామాయణము - వర్షాకాల వర్ణనము :

"వానకాలము వచ్చె వైరుల మీద - పోనర మికనీవు బోయి కిష్కింధ
ననుపొంద వసియింపు మా మాల్యవంత - మున నుందు నేను నిమ్మల "శరత్కాల
మరుదేర రమ్మ"ని యర్కజుఁబనిచి - తరుణి వంశజుడంత తమ్ముని తోన
నామాల్యవంతంబు నందు వసించి - కోమలి గుణములు గొనియాడుచుండె"[1]

శత్రువుల మీదకు దాడి చేయుట అనువుకాదు. అనునట్లు వర్షాకాలమరుదెంచెను. శ్రీరాముడు సుగ్రీవునితో ఇట్లు చెప్పెను. "సుగ్రీవా! నీవు పోయి మాల్యవంతమున యుండుము. నేను శరత్కాలమున తిరిగి వచ్చెదను" అని పల్కి తన తమ్మునితో సీత గుణములను కొనియాడినాడు. ఇంత చిన్న మాటల్లో వానకాలమును ముగించి శరత్కాల ప్రవేశము చేసినాడు ఏకోజీ.

## శరత్కాల వర్ణన:

"అంత శరత్కాల మరుదేరజూచి - చింతించి రాముడు సీతను తలచి
సౌమిత్రి జూచితే జలజాప్త సుతుడు - కామాంధుడై యుపకారంబు మరచి
మగువలతో పానమత్తుడై రాడు - తెగడి సుగ్రీవుని తెమ్ము పొమ్మనిన
కరములు మోడ్చి లక్ష్మణుడట్టె వెడలి - వరుసతో కిష్కంధ వాకిట నిలువ
యాశూలిఁబోలు రామానుజు జూచి - కీశులెల్లరు పార కిచకొట్టుకొనుచు
నా లక్ష్మణుని రాయ యంగదుచేత - నాలోన విని కమలాప్త నందనుండు
తారాది సతులతో తగు నేగు దెంచి - కోరి యా సౌమిత్రి కోపంబు మాన్చి
వివిధ పూజలొనర్చి వివిధ ప్లవంగ - నివహంబు తెమ్మని నీలునిబనిచి

1.ఏకోజీ రామాయణము - కిష్కింధా కాండము పుట - 18, డా॥ ఎం. బాగయ్య, 1993

నలు వొప్పనున్న వానరులతోగూడ - జలజ బాంధవ తనూజాతుడా పొద్దె?
సౌమిత్రి వెంబడి చనుదెంచె గిరిని - రాముని పొడగని రయమున మ్రొక్కి[1]

శరత్కాల వర్ణన రంగనాథ రామాయణము నందు కంటె ఏకోజీ రామాయణము నందు భిన్నముగా నున్నది. ఇచట మాల్యవంతము పైకి వచ్చిన రాముడు సుగ్రీవుని పిలువ లక్ష్మణుని పంపిన తీరు గమనింపదగినది. వానరజాతి సుగ్రీవుడు మనల మరచి, మత్తుత్రాగి, మగువలతో నుండుననియు మరువక పోయి మరీ రమ్మని చెప్ప నా రామానుజుడు కిష్కింధకు పోయి సుగ్రీవుని వాకిట నిలిచెనట. అప్పుడు అంగదుడువార్త నందింపగా నతడు నీలుని పిలిచి పూలు తెమ్మని చెప్పి పూజించి లక్ష్మణుని శాంతపరచి వెంటనే మాల్యవంతమునకు బయలు దేరి వెళ్ళినారట. తారల, చంద్రుల వర్ణన, కాంతి, కాంతల నాట్యము, సముద్రుని రాయబారము కన్పించవు. అవిరంగనాథ రామాయణములోనే గలవు. ఏకోజీ రామాయణములో సాధారణమైన శైలిలో ఏకోజీ వార్తనంపి సమాధానము తెప్పించుకున్నాడు. ఏకోజీలో సామాన్యమైన వర్ణన గలదు. రంగనాథుని రామాయణములో వర్ష, శరత్కాల వర్ణనలు అధికముగా పోషింపబడినవి.

ఇట్లు రంగనాథ ఏకోజీ రామాయణములలోని వర్షా, శరత్కాల సంధ్యాది వర్ణనలు సహజ సుందరములై వీనుల విందై పసందుగా నలరారినవి. వీరిద్దరు విభిన్న కాలమనాచారులయినప్పటికి వానరుల పాత్రను కాలానుగుణముగా తీర్చినారు. రంగనాథ రామాయణములోని మనోజ్ఞమైన ఒక ఉత్ప్రేక్షను గమనింతము.

"కుదియని కడకతోఁగోరియాకాశ - నది నాడుఁబోయిన నాగ కన్యకలు
చని చని మగుడ రసాతలంబునకుఁ - జనుదెంచు గతి వర్ష జలధార లొప్పె"[2]

వర్షాకాలము నందలి వాన ఆకాశము నుండి అవనిపై పడుచున్న ధారలు ఆకాశ గంగానదిలో స్నానము చేసి రసాతలానికి తరలిపోవుచున్న నాగకన్యలవలె కన్పించెనట. ఇచట ఎంతటి సహజ వర్ణన గలదో విశదమయినది. [3]రంగనాథ రామాయణము నందు రాముని ధనుర్విద్యా కౌశలమును రావణుడు కొనియాడుట:

---

1. ఏకోజీ రామాయణము - కిష్కింధా కాండము పుట - 18-19, డా॥ఎం. బాగయ్య 1993
2. రంగనాథ రామాయణము - కిష్కింధా కాండము పుట - 252
3. రామాయణ సుధాలహరి - పుట - 130 - తి. తి. దేవస్థానము 1984 జంధ్యాల పాపయ్య శాస్త్రి వ్యాసము

"నల్లోవో రఘురామ, నయ నాభి రామ - విలు విద్య గురువర, వీరావతార
కరశర లాఘవ క్రమ కళా నిపుణ - స్ఫుర దురుచాప సంశోభిత కృపణ
భుజసార దృఢముష్టి భువన విఖ్యాత - విజిత రిపు పాత్ర విజయ సమేత
మానవ రాజకుమార కంఠీర - వా! నవ్య దివ్య శస్త్రాస్త్ర సంపన్న
స్సార ఘోరాక్షయ బాణ తూణీర - వీరాగ్రగణ్య యో విశ్వ శరణ్య
బాపురే ! రామ భూపాల, లోకముల - నీపాటి విలుకాడు నేర్చునే కలుగ"[1]

అని రావణుడు శ్రీరాముని బాణ పరంపరలకు తట్టుకొన లేక ప్రశంసించినాడు. అనగా వీరుడు వీరుణ్ణి పొగడుట నేరము గాదు. ప్రశంసించుట వీరుల ధర్మము. "మానవ వీరుడయ్యు నవ్య దివ్య శస్త్ర, అస్త్ర, సంపన్నుడవు. వీరాగ్రగణ్యుడవు, ఓ విశ్వ శరణ్య బాపురే ! రామ భూపాల!" అని కీర్తించెను.

"లోకముల నీపాటి విలుకాడు నేర్చునే కలుగ" అని నీకు సాటియగు విలుకాడు విశ్వమందు లేడని పదినోళ్ల కీర్తించినాడు. రావణుని ప్రశంసలు వినిన అతని మంత్రులిట్లు అడిగిరి.

పగవాని నీరీతిఁబంతంబు విడిచి - పొగడుదురే దైత్య పుంగవ? యిట్లు
పొగడిన భయమందబోలు, నటంచుఁ - బగవారుఁదన వారుఁబలుచగాఁ జూతు
రది గాక రాచ కార్యముగా దటన్న - ............................[1]

అని మంత్రులడిగిన మాటలకు రావణుడు చెప్పిన జవాబు సత్యమైనది

"విలువిద్య పెంపును విక్రమ క్రమముఁ - గలితనంబును బాహు గర్వరేఖయును
నాది యాగుణముల నధికుడైనట్టి - కోదండ దీక్షాది గురునితో రాజ
వరునితో రామ భూవరునితో సురలు - హరిహర బ్రహ్మాదులైన నెంతయును
సాటియే యీ మూడు జగముల యందు - మేటి శూరుల పెంపు మెచ్చంగ వలదె?[2]

అని రావణుడు తన సాటి - తోటి - ఎదుటి వీరుని పరాక్రమ క్రమమును పదినోళ్ల పొగడ, తన మంత్రులకు రామునికి హరిహర బ్రహ్మాదులైన సాటి రారని తానే (రావణుడు) చెప్పిన సందర్భము సహజసిద్ధముగా నున్నది. ప్రతినాయకుడు అయిన

---

1. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము పుట - 396, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు - 1942
2. రంగనాథ రామాయణము - పుట - 395 - ఆంధ్ర విశ్వకళాపరిషత్తు - 1942

రావణుణ్ణి అతిలోక శూరునిగానే గాకుండ మహోదారునిగా గుణగ్రహణ పారీణునిగా బుద్ధారెడ్డి చిత్రించినాడు. [1 మరియు 2]

సుగ్రీవుడు సీతమ్మ సొమ్ములను శ్రీరామునకు చూపినప్పుడు : సీతాదేవి తన ఎదకొంగు చింపి తన సొమ్ములను మూటగట్టి మాల్యవంతముపై పడవేసినది. అవి సుగ్రీవుడు చూచి శ్రీరామునితో చెప్పిన సందర్భము. ఆమె ఎందుకొరకు పడవేసినదో కారణము తెలియదు అని పలికి

"మున్నుగా వగలను మున్నీట మునిగి - కన్నీట నా సొమ్ము కసపెల్ల గడిగి
యందంద యురమున నా భూషణములు - పొందించి పొందించి భూమిజదలచి
.................................... - ....................................
"గంటె లక్ష్మణ సీతకై సేతలెల్ల - మంటి పాలయ్యె నీ మాడ్కి నేమందు"[3]

అని పేర్కొనుట చేత కన్నీటితో కడిగిన సొమ్ములు నేడు మంటి పాలయ్యె మన చేత లెల్ల - అని పేర్కొనుట వలన సీత ఇక నాకు దక్కదని రాముడు భావించిన తీరు రంగనాథ రామాయణములో గలదు.

ఏకోజీ రామాయణములో సీతాదేవి సొమ్ములను గురించి

సుగ్రీవుడు సీతాదేవి సొమ్ములు తెచ్చి శ్రీరామునకు చూపగా నతడు మూర్ఛిల్లెనంత

"సొమ్ములు దెచ్చియ్య చూచి రాఘవుడు - నెమ్మ గైకొని చేర్చి నేత్రాంబుజముల
తలచి మూర్ఛిలి కాంత తడవుకు నట్టె - తెలిసి సుగ్రీవుని దెసఁజూచి పలికె
ధరణిజ ఁజెఱగొన్నదాన వాధముని - పురము దేశంబు నొప్పుగఁ దెల్పుమనిన
ఇనజుఁడిట్లనె రామయేవాని పురము - కనివిని యెఱగనుఁగనకున్న వాని
నెరుగు తెఱంగెల్ల నెఱింగింతు నీవు - పరితపింపకు నేను బలి వాలి చేత
హృత కళత్రుడనయ్యు మిత శోకింప - ధృతిలేని పురుషుడు తృణ సమానుండు"[4]

---

1. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము పుట - 396, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు - 1942
2. రామాయణ సుధాలహరి - తిరుమల తిరుపతి దేవస్థానము - 1984
3. రంగనాథ రామాయణము - కిష్కింధా - పుట - 233- ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు - 1942
4. ఏకోజీ రామాయణము - కిష్కింధా కాండము - పుట 4, డా॥ ఎం. బాగయ్య 1993

అని ధృతిలేని వీరుడు కూడ తృణముతో సమానుడు. నేను కూడ భార్యను పోగుట్టుకొన్నవాడనే నీవేమి చింతిల్లతగదు. ఇద్దరు మహావీరులు వారి కళత్రములకు చేటు వాటిల్లినపుడు సంభాషించుకొనిన మాటలు, ధైర్యము కూడగట్టుకొన్నవి. ఏకోజీలో సహజత్వము, రంగనాథ రామాయణములో వర్ణనాధిక్యము కల్గియున్నది.

శ్రీరాముని శోకము పఠితల హృదయాన్ని కదిలించి వేయును. అపరాధము చేసిన, కైకను, భరతుణ్ణి, రావణాసురుణ్ణి ఏమి చేయకుండ నిరపరాధుడైన నాభర్తను (వాలిని) యెందుకు చంపావని తార విలపించి శ్రీరామునితో కఠినముగా పలుకుటలో సహజత్వమును కానవగును.

"...................... - జననాథ! యీ వాలిఁజంపనేమిటికి?
మెఱసి నిన్నిటు సేయమీ తండ్రి తోడఁ - గఱపెనే రఘురామ, గణుతింప వాలి
వెఱపున నీ రాజ్య విభవంబు గొన్న - భరతుడే రఘురామ, పరికింపవాలి?
చెనటియైనీ దేవిజెఱగొని చనిన - దనుజుడే రఘురామ, దలపోయువాలి?
వాలి నకారణ వైరంబు పూని - యేలయ్యా తెటూర్చితి విబ్బంగి చేర్చి?
నీయట్టి సుకృతికి నీయట్టి పతికి - నీయట్టి కారుణ్య నిధికిట్లు దగునె?[1]

"ఓ రామా మీ తండ్రి వలెను, రాజ్యము గొన్న భరతుని వలెను, నీ దేవియగు సీతను యెత్తుకొనిపోయిన రావణుని వలెను, ఈ వాలి యే పాపము చేసెనయ్యా! ఎందుకని చంపితివి? అకారణముగా నీ వంటి సుకృతికి రాజునకు, కరుణా సముద్రునుకి ఇట్టి పని తగునా? నీ ధర్మమంతయు సీతతోటే పోయెనా? ఇది రాజధర్మమేనా? నేడు నా పుణ్యమిట్లయ్యెను. ఏమి సేయుదునింక? ఈ విధినేమందును? ఈ వాలిని (నాభర్తను) విడిచి యేనుండ జాల? ఓ దేవా! నన్నుకూడ వాలి వలె తెగటార్చవయ్యా!

శ్రీరామునికి వాలి చెప్పిన వాదములోని మాటలు :

'ధర్మాత్ముడై యుండి తగునేనీకిట్టి - కర్మంబునకు నొడిగట్ట శ్రీరామ
అడవి మృగాదుల నణతురు గాని - పుడమి కోతులను చంపు దురె భూపాతు
లన్న దమ్ములము మేమతరి పోట్లాడ -నన్ను జంపుట నీకు న్యాయమే రామ!"[2]

1. రంగనాథ రామాయణము - కిష్కిందా కాండ పుట 242, ఆంధ్ర విశ్వ కళా పరిషత్ - 1942
2. ఏకోజీ రామాయణము - కిష్కింధాకాండ - పుట - 14, డా॥ ఎం. బాగయ్య 1993

అని వాలి రామునితో నీవిట్టి అధర్మపు పని చేయదగునా? అని పైమాటలు పలుకగా, శ్రీరాముడు వాలితో చెప్పిన సమాధానము :

"కటకటా! వాలి! మర్కట బుద్ధి వలన - నిటులాడెదవు దీని నెంతురె బుధులు
నీ సహోదరుని మానిని పుచ్చుకొన్నని - దో సరివౌ నిన్ను ద్రుంచుట తగదె
మీటి పాజెడి దుష్ట మృగముల చెట్టు - చాటున కడుపొంచి చంపరె నృపులు
తన మిత్రుశత్రువు తన శత్రువగుట - నిను జంపితిని యిదినీతి యన్నంత"[1]

అని శ్రీరాముడు వాలికి సమాధానము పలికెను. ఇచట ఏకోజీ - గోనబుద్ధారెడ్డి ఇద్దరు సమాన రచన గావించి సామ్యముగా చేసిరి.

విభీషణుడు రావణునకు హితోపదేశము నొనర్చుటను గురించి - రంగనాథ రామాయణములో నిట్లున్నది.

"అవధరింపుము దేవ। యసురాధినాథ - యవనిజ దెచ్చిన యంత నుండియును
దుర్నిమిత్తంబులు దోచుచున్నవియు - నిర్ణయం బట్టిది నిక్కువంబరయ
హోమ కుండంబుల నున్న త్రేతాగ్ను - లేమియు వెలుగవు యీ దివసముల

..........................................

శ్రీరామునకు నిమ్ము సీతఁగొంపోయి - నేరమివట్టఁడా నృపకుంజరుండు"[2]అని గోనబుద్ధారెడ్డి పేర్కొన్నాడు. ఇదే సందర్భములోన ఏకోజీ చూపిన విధము యిది : ఏకోజీ రామాయణములో విభీషణుడు రావణునకు బుద్ధి చెప్పుటకు ప్రయత్నించుటలో చక్కని నీతి గ్రహింపబడినది.

"వినురాక్షసేశ్వర విక్రమోదార - చనటి మంత్రుల మాట చెవిబెట్టవలదు
............................................... - తలపుము నా బుద్ధి తలపున నన్ను"[3]

అని తాను నశించినను వంశనాశనమునకు కారణమైనటువంటి సీతా దేవిని తిరిగి శ్రీరామునకప్పగించి శరణు వేడుమని పల్కిన సందర్భమునందలి మాటలుచితముగా నున్నవి. ఈ పై మాటలు విభీషణుని శరణాగతి యందున్నవి.

---

1. ఏకోజీ రామాయణము - కిష్కింధా కాండము - పుట - 14 డా॥ ఎం. బాగయ్య 1993
2. రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - పుట - 332 ఆంధ్ర విశ్వకళా పరిషత్ 1942
3. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము - పుట 59 డా॥ ఎం. బాగయ్య 1993

శ్రీరాముడు బ్రహ్మాస్త్రము చేత రావణుని వధించిన తరువాత ఆ అస్త్రము భూమిలోనికి పోయి తిరిగి రాముని అమ్ముల పాదిలో చేరినదట. ఈ విషయమును గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణములో నిట్లు ప్రకటించినాడు.

"నీ కూతు జెఱపట్టి నీచ భావమున - గైకొనదలచిన ఖలుని ప్రాణములు
గైకొంటినే"నని కనిసి భూస్థలికిఁ - బ్రాకటంబుగ ఁ జెప్పఁబఱచెనో యనగ" [1]

బ్రహ్మదేవుని మనుమడడు రావణుడు శ్రీరాముని బ్రహ్మాస్త్రమునకు నేల కూలగ, ఆ యస్త్రము రావణుని వధించి, భూదేవి బిడ్డయగు సీత చెరను విడిపించినట్లు వార్తను తల్లితో చెప్పి వచ్చుటకై పోయి చెప్పి, తిరిగి ఆ యస్త్రము రాముని అమ్ముల పాదిలో చేరినదట. ఇంతటి వర్ణన గావించిన గోనబుద్ధారెడ్డి ఘనుడని చెప్పవచ్చును.

అల్లుని ధైర్య సాహసాలను చూచి, అత్తగారిని శాంతపర్చుటకై యరిగినోయనునట్లు పోయి వచ్చెనట. ఇంత చక్కటి వర్ణన ఇతర రామాయణములలో కన్పించదు. ఇక ఏకోజీ రామాయణములో నెట్లున్నదో గమనింతము. రావణవధ:

'అక్షయబల శౌర్యుడగు రామ చంద్రుఁ - డక్షయ బ్రహ్మాస్త్రమపుడు సంధించి
దేవారి యురముపై దృష్టించి యేయ - నావేళ బ్రహ్మాండమగల దిక్పతులు
భీతిల్లి లోకముల్ చెదరి కంపింప - పాతాళ వాసులు భయమంది యుఱుక
వచ్చి యా రావణు వక్షస్థలంబు - చొచ్చి పాతాళంబు చొచ్చి వేగమునఁ
గ్రమ్మరఁజనుదెంచి కాకుత్థకులుని - యమ్ముల పాది జొచ్చి నద్భుతంబుగను
పరమేష్టియనుమని పంక్తి కంధరునిఁ - దురమునఁజొరిగొన్న దోషంబు తొలగ
పాతాళ గంగ లోపల గ్రుంకి వచ్చి - సీతాధిపతి మాటు చేరెనో యనగ
తలకుచు కూలె నద్దశకంఠుడపుడు - కూలిశాపహతి బడ్డ కొండ చందమున [2]

బ్రహ్మదేవుని పౌత్రుడు నేలకూలిన తీరులో రెండింటను సమానముగా నున్నది. రాముని బ్రహ్మాస్త్రము రావణుని వధించి పాతాళ లోకము పోయి గంగతో మునిగి వచ్చెనట. పాపిని చంపిన రక్తమంటు కొనగ ప్రక్షాళనకై పోయి వచ్చినదట. అంతే కాక శ్రీరాముని ప్రతాపమును (భూదేవి అల్లుని) తెలియచెప్పుటకై పోయి వచ్చి శ్రీరాముని పాదిలో చేరినదట. ఈ యథానువాదము రంగనాథ - ఏకోజీ రామాయణములోనూ సమానముగా నున్నవి. ఇట్టి రచనలచేత రెండు రామాయణములోగల రామణీయకము

---

1. రంగనాథ రామాయణము - యుద్ధ కాండ - పుట 613, ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942
2. ఏకోజీ రామాయణము - యుద్ధకాండము - పుట - 141 - డా॥ ఎం. బాగయ్య 1993

గమనింపదగియున్నది. రావణుని నాభి యందు అమృతమింకించిన తీరు రంగనాథ రామాయణములో శ్రీరామునితో విభీషణుడిట్లులనియె.

'వనజాత జాతుని వరమున (జేసి - యిన కులాధీశ్వర యీతని నాభి.
నమృతమున్నది కుండలాకృతా గలిగి - యమృతత్వమూలమై యది చంపనీదు'[1]

అంతేగాక :

"దానవుతలలు నుద్దండ బాహువులు - మానక నీవెన్ని మాఱు లేసినను
మొలతెంచు చుండు నున్మూలముల్ గావు - తలకడు దీన నద్దనుజ వల్లభుడు
తఱిమి యిమ్మెయి నీవు తలలు బాహువులు - నఱకు చున్నాడవు నరనాథ, కడగి
తుద యేది దీనికి దొరకని నీవు - చదురొప్ప నాగ్నేయశర యేయుమింక
నానాభి వివరములామృతం (బింకు) - దానవపతి దాను దానలో దారు
నిగిడెడు భవదీయ నిష్ఠరాస్త్రముల - దిగి మఱి చేతులు త్రిదశారితలలు
దురములోపల నూట తొమ్మిది మాఱు-లరుదుగా మొలతెంచు నంతట పొలియు'[2]

అని విభీషణుడు రావణుని మరణ రహస్యమును తెలుపగ, రాముడు ఆగ్నేయాస్త్రము చేత బ్రహ్మమనుమని నాభి యందలి యమృతమింకించెను. ఇక ఏకోజీ రామాయణములో శ్రీరామునకు అగస్త్యుడు ఆదిత్య హృదయమంత్రోపదేశము చేసిన తరువాత, రావణునకు నాభి యందు గల అమృత రహస్యమును విభీషణుడు రామునకు తెలుపుటలో నిట్లున్నది. రావణుని తలలు త్రుంచి త్రుంచి అలసి యుండగా

'..............- అలసి రాఘవుడుండ నవ్విభీషణుడు
దేవ ! రాఘవ ! వీడు తెగడెందుచేత - వావిరి సుధ నాభి పడి నుండ(జేసి
అనల బాణం బేసి యమృత మింకించి - మునుకొని బ్రహ్మాస్త్రమున వీని (జంపు .
మనవుండు రఘు రాముండాగ్నేయ బాణ - మనువంద నేయ నయ్యమృతంబు గ్రోలె"[3]

అని ఏకోజీ, రంగనాథ రామాయణములలో యథానువాదమునున్నది. ఇట్టి రామణీయకముగా నున్న వర్ణన మనోహరముగా నున్నది.

---

1. రంగనాథ రామాయణము యుద్ధకాండము - పుట - 610 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు 1942
2. రంగనాథ రామాయణము - యుద్ధ కాండ - పుట 610, 611 - ఆంధ్ర విశ్వ కళా పరిషత్ 1942
3. ఏకోజీ రామాయణము - యుద్ధ కాండము - పుట - 140, 141 - డా॥ ఎం. బాగయ్య, 1993

# ఏకాదశ ప్రకరణము

# ప్రాచీనాంధ్ర సాహిత్యములో రెండు రామాయణముల స్థానము

## I. రంగనాథ రామాయణము :

తెలుగులో వాఙ్మయములో వెలసిన రామాయణములన్నింటిలో రంగనాథ రామాయణము మొట్టమొదటిదని చెప్పవచ్చును. కాలక్రమమునే గాకుండా గుణముల చేత కూడ అది గణ్యము. దేశి కవిత్వమును మెచ్చని మార్గాభిమానులు ఈ ద్విపద రామాయణ కావ్యమును త్రోసి పుచ్చి భాస్కర రామాయణమునకు పెద్దపీట వేసినను దీని ప్రశస్తికి ఎట్టి విఘాతము వాటిల్ల లేదు. అంతేగాక భాస్కర రామాయణము బహుకర్తృత్వకమగుట చేతను, రచన దృష్ట్యా సర్వత్ర సమముగా లేక కొన్ని యెడల బాగుగా, కొన్ని యెడల కూర్పుగా పరిణమించినది.

రంగనాథ రామాయణము ఒక్క చేతి మీదుగానే ధారావాహినిగా నడచిన రచన యగుటచేత నట్టి లోటు లేక ప్రతి ప్రకరణము కూడ తన ప్రత్యేకతను సంతరించుకున్నది. వాల్మీకి రామాయణము వలెనిదియు 'పాఠ్యేగేయుచ మధురమై' పాటగా పాడుకొనుట కనువైనదిగా నున్నది. చదువరులకు కావ్యముగను సమాదర పాత్రమైనది. పండితులకే కాక, పామరులకు కూడ వినియోగపడి సార్వజనీనమైన పేరును పొందినది. ఇందలి కొన్ని ఘట్టములు పాటలుగ పాడుకొనుటకు అనువుగనున్నవి. స్త్రీల రామాయణపు పాటలలో కొన్ని గలవు. తోలు బొమ్మ లాటల వారు ప్రదర్శనము వేళ గానము చేయు రామాయణ గ్రంథమిదియే.

దేశికవిత్వమనగా మౌలికముగ గేయ కవిత్వమనియే చెప్పవచ్చును. పూర్వము ద్విపద కావ్యములు గేయ భావమును సంరక్షించునవి యగుట చేత సామాన్య ప్రజాలోకమున వీనికున్న వ్యాప్తి పద్య కావ్యమునకు లేకుండెను. ఈ రహస్యమును తెలుసుకున్న వారగుట చేత శివకవులు తమతమ మత సారస్వత ప్రచారమును ద్విపద కావ్యముల ద్వారానే సాగించినారు. వీనిని అరికట్టుట 'ఇతరులకు సాధ్యము కాదయ్యెను.

ఈ ద్విపద రామాయణ వ్యాప్తి యున్నట్లే యప్రతిహతముగా నేటికిని ఆంధ్ర లోకమున సాగుచున్నది. రంగనాథ రామాయణమును చదువని అక్షరాస్యుడు లేడు. వినని నిరక్షరాస్యుడు లేడని చెప్పవచ్చును.

ప్రాక్పశ్చిమాంధ్రులకు సారస్వత సృష్టిలోను, సేవలోను కొంత భేదమున్నది. వాఙ్మయమున గల మార్గదేశి శాఖలలో పూర్వ కాలమున మార్గశాఖ ప్రాక్సీమలోను, దేశీ శాఖ పశ్చిమ సీమలోను యెక్కువగా అభివృద్ధి చెందినదని చెప్పవచ్చును. అంతియే కాక పశ్చిమమున మార్గ కవిత్వము పుట్టలేదని, తూర్పున దేశికవిత రచనలు లేవని చెప్పలేము. నైసర్గిక, చారిత్రక, సాంస్కృతిక స్వరూప స్వభావముల చేత ఔత్తరాయులకు సంస్కృతము పట్ల యెక్కువ మక్కువగలదని చెప్పవచ్చును.

ఇతర ప్రాంతముల వారి వలె యాంధ్రులు యంత అదృష్టవంతులు కారు. నిరంతరము ప్రకృతితో పోరుచూ, ఆడుచూ, పాడుచూ కష్టపడి జీవించువారు. శ్రమ జీవనమే వీరి పరమావధి. దృఢకాయులు, వీరులు, నీతిమంతులు, సాహిత్య ప్రియులు, స్వాతంత్ర్యప్రియులు, తాతలనాటి తల్లి భాషయే వీరికి చాలును. పరభాషల యావశ్యకతా, వ్యామోహములు వానిని నేర్చవలెననెడు కుతూహలము అవకాశము వీరికి లేవు. పర సంప్రదాయ సంస్కృతులకు తలవొగ్గి హత్తుకు పోవు మెత్తదనము వీరిది కాదు. తమ సంఘములో మహోదాత్తమైన జీవితమును గడపి తరలిపోయిన వీరుల చరిత్రలే వీరి కావ్యములకు యితివృత్తములు.

ధర్మము అర్వాచీన కాలమున కొంత సడలినను, ఆ పుణ్య జనుల సారస్వతాభిరుచి మాత్రము పూర్వ సంప్రదాయము వైపునకే మొగ్గు చూపును. దేశీయతా భావమును యభిరుచిని తృప్తి పరుపగల కవులే మహా కవులుగాను పూజింపబడిరి. ఇట్టి కోవకు చెందిన కవియే గోనబుద్ధారెడ్డి. ఇతడు సంస్కృత కావ్యమును తెనిగించినను, ఆంధ్రీకరణమును దేశీయ చిహ్నములతో విలక్షణా శోభత మొనర్చి తన స్వతంత్రతా భావమును ప్రకటించెను. ఈ కావ్యము ఖ్యాతి పొందుటకు నిదియే తార్కాణము.

అనుకరణ వాఙ్మయము ప్రబలి ప్రౌఢ సాహిత్యమనిపించుకొని, దేశి కవితను వెనుకకు నెట్టినది. అయినను దానిని సృష్టించువారును సేవించు వారును పామరులుగా తిరస్కరింపబడిరి. తుదకు అనుకరుణశీలమైన వాఙ్మయమే పట్టము కట్టుకొనెను. దీని

తాకిడికి తాళలేక మృదుల దేశి కవిత, నగరములు, రాచబాటలు దాటి, పల్లె పట్టులు ప్రవేశించి, సందు. గొందులు తొంగి చూచి యా ముగ్ధ శారదా దేవికిని ఏదో కొంత ప్రౌఢ వేషము వేసి, నాగరక మర్యాదలు నేర్చి సభా ప్రవేశార్హత కలిగింపవలెనని పాటుపడిన వారే ద్విపద కావ్యకర్తలు. ఒకవైపు దేశికవితాభిమానము, ఇంకొకవైపు విద్వత్కవి కీర్తి కాంక్షను అణచుకొనలేక యుభయ తారకమైన మార్గము త్రొక్కి కొంతవరకు చరితార్థులైరి.

ద్విపద కావ్యములు వ్యాకరణ ఛ్చందో లక్షణములలో నిర్దుష్టము కాక పోవుట చేత పండిత కవులకును, శైవ మత విషయకములే యగుట చేత శైవేతరులైన బహుళాంధ్ర జనమునకును యెక్కువ యాదర పాత్రము కాలేకపోయినవి. ఇక బుద్ధారెడ్డి ద్విపద కావ్యము, లక్షణ యుక్తమును సర్వ పూజార్హమగు రామ చరిత్రమును అగుట చేత వారు వీరనక యెల్లరకును శిరోధార్యమయ్యెను. అందువలన రామాయణము అగ్రగణ్యమైనది. పాటలుగా, కీర్తనలుగా సంఘమున వేళ్ళూనుకొని పోయినవి. వాటి పద కవిత్వ ఖని నుండియే యీ కవీశ్వరుడా జాతి రత్నములను దీసి సానలు బట్టి తన రామాయణ మహామాలలో పొదిగించినాడు. కావ్యోన్ముఖుడైన కవి

'అది కవీశ్వరుడైన వాల్మీకి - యాదరంబున బుణ్యులందఱు మెచ్చ
జెప్పిన తెఱుంగున శ్రీరామ చరిత - మొప్ప జెప్పెద కథాభ్యుదయ మెట్లనిన'[1]

అని కావ్య ప్రారంభమున కవి ప్రతిన బూనెను. అవాల్మీకాంశములను కల్పించుచునే కథ నడుపుచూ, కావ్యమునకు గుణ సంపదను కల్పించెను.

ఋష్య మూకము చేర వచ్చిన రామ లక్ష్మణులతో హనుమంతుడనిన ఈ ద్విపద పంక్తులు నేటికిని బొమ్మలు లాటలో ఆలపించెడి పంక్తులు రంగనాథ రామాయణము లోనివే.

"ఎగు భుజముల తోడ నిందు బింబంబు - నగు మొగంబుల తోడ నళిన పత్రముల
దెగడు కన్నుల తోడ దివిజులు మెచ్చి - పొగడు విక్రమ కళాభుజశక్తి తోడు
అరుదైన రాజ చిహ్నములతో మీరు - శరచాప హస్తులై చను దెంచినారు
భూరితపో వేషములు మీకు నేల? - మీరెమరిచ్చుటకి మీదు[illegible]రేల?"[2]

---

1. రంగనాథ రామాయణము - బాలకాండ -పుట - 4 తెలుగు విశ్వ విద్యాలయం.
1. రంగనాథ రామాయణము - కిష్కింధా కాండము - తెలుగు విశ్వ విద్యాలయం

అని సాధారణమైన భాషా శైలిలో కవి జనసామాన్యమైన వచనములుగా తోలుబొమ్మలు ద్వారా కథాగమనమును గావించెను. అంతేగాక రంగనాథ రామాయణమున సీతా కళ్యాణ గాథను హరికథకుడు చెప్పిన తీరు ద్విపద పంక్తులలో గాననగును. శ్రీరాముడు శివుని విల్లు విఱచుట యందును ఈ ద్విపద పాదములు గ్రహింపవచ్చును.

"హరుని చాపము రాముడతి సత్త్వయుక్తి - బెరిగె వేడిదె యొక్కు పెట్టుచున్నాడు
అదరకు భూదేవి యాత్మలో నీవు - చెదరి చలింపకు శేషాహి నీవు
కడకు ధరింపుము కమలేంద్ర నీవు - కడు నేమరకుడు దిక్కరులార మీరు"[1]

అని పేర్కొనుట యధిక భావ సంపద, ద్విపదలోని పలుకుబడి, రచనా రీతి, వైష్ణవ భావన, అవతార ప్రశంస మొదలగు అంశములు అన్నమాచార్యుని రామాయణము నందలి సంకీర్తనల యందు పుష్కలముగా నుండుటచే అన్నమయ్య పంక్తులని కొందరు భావించిన వారును గలరు.

క్రీ.శ. 1400 సంవత్సరముల నాటి అనంతామాత్యుడు తన భోజరాజీయము నందు రంగనాథుని పేర్కొనిన పద్యము.

"నన్నయ భట్టు దిక్కకవి నాయకు భాస్కరు రంగనాధుచేరి
రెన్నిక కెక్కినట్టి యమరేశ్వరు నెఱ్ఱయ మంత్రి నాదిగా
జెన్న కవీంద్రులున్న వరస స్ఫుట వాణుల గంగ ధాత్రితో
నున్న కవీంద్రులం దలతు మల్ల మెలర్పగ వాగ్విభూతికిన్"[2]

క్రీ.శ. 1500 - 1530 నడుమ గల కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో కూడ భాస్కర - రంగనాథ కవులను పేర్కొన్న పద్యము.

"అనఘు హుళక్కి భాస్కరు, మహా మంత్రి పిల్లల మఱ్ఱి వీర రా
జును, ఘను నాగరాజు గవి సోముని, దిక్కన సోమయాజికే
తన కవి, రంగనాథ, నుచితజ్ఞుని నెఱ్ఱన, నాచి రాజ సో
మన నమరేశ్వరుం దలతు మత్కుల చంద్రుల సత్కవీంద్రులన్"[3]

---

1. రంగనాథ రామాయణము - బాల కాండము - పుట 57 తెలుగు విశ్వ విద్యాలయం
2. భోజరాజీయము - అనంతామాత్యుడు -1 అశ్వా 9 పద్యం
3. సింహాసన ద్వాత్రింశిక - కొఱవి గోపరాజు 1 అశ్వా 12వ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

వేదము లక్ష్మీనారాయణ శాస్త్రి - పీఠిక - రంగనాథ రామాయణము - వావిళ్ళ వారి ముద్రణము నందు గల పద్యము.

"అలఘుని శబ్ద శాసన పదాంకితు దిక్కన సోమయాజిని
శ్చల మతి శంభుదాసు, బుధ సన్నుతు నాచన సోమనార్యుజె
వ్వల రిన చిమ్మ పూడి యమరాధిపు, భాస్కరు, రంగనాయనిం
దలతు నపూర్వ చిత్ర కవితామహనీయ సమగ్ర చిత్తులన్"[1]

క్రీ.శ. 1650 కాలము నందలి నూతన కవి సూరన తన 'ధనాభిరామము' నందును రంగనాథుని పేర్కొన్నాడు. "స్తుతగుణోద్దాము నాచన సోము, భీము, నవ్యమంజుల వాగ్దుర్యునన్నపారమ్య, రసికుడైనట్టి శ్రీనాథు, రంగనాథు దిక్కకవిరాజు, భోజను తించిమించి"[2]అని రంగనాథుని పేర్కొన్నాడు. ఇక వేటూరి వారి సింహావలోకనము నందు

"రంగ ద్విశాలాంత రంగంబు నందు - రంగనాథుని గవి రానమ్మదలచి[3]

లింగమ గుంట తిమ్మన క్రీ.శ. 1560లో తన 'బాల భోద ఛందస్సులో రంగ నాథుని గూర్చి ఈ తోటక వృత్తాన్ని పేర్కొన్నాడు.

"ఉపవాసము లెల్లను నుండుట నీ - కృప వచ్చుట కాయది రిత్తసుమీ।
యపవిత్రని(బుల్లని యంబలికై - సుపవి త్రుని జేయుట సుద్ది గదే"[4]

పెదపాటి జగన్నాథ కవి ప్రబంధ రత్నాకరమను గ్రంథములో రంగనాథు గూర్చి పేర్కొన్న మూడు పద్యములు

"అదలని తేరు, తేరునకు నాదరు వై తను విల్లు వింటికిం
గుదురగు నారి, నారిపయి గూర్కు శరంబు, శరంబు బొడ్డు నం
బొదలిన యంత యంతముఖముల్ నిజ వాసములైన గుజ్జముల్
చెదరక నీకు నెట్టి పనిసేయు సుమా గిరిజాధి నాయకా"[5]

---

1. రంగనాథ రామాయణము పీఠిక వావిళ్ళ వేదము లక్ష్మీనారాయణ శాస్త్రి పుట 14
2. మొల్ల రామాయణము - అవతారిక - 9వ పద్యం
3. సింహావలోకనము - వేటూరి ప్రభాకరశాస్త్రి
4. బాల భోద చంధస్సు - 1 లింగమగుంట తిమ్మన
5. పెదపాటి జగన్నాథ కవి - ప్రబంధ రత్నాకరము 407, 408, 409 పద్యములు

ఓజు చే ముట్టక యొగ్గాన బట్టక - చక్కగా మీరి బాఋ చక్రములను
లయాన గట్టకలలిమేత పెట్టక - వర్ణహీనంబైన వారువములు
సవన మెట్టర్ జీవితము కాసు ముట్టక - సత్యసంపద జూపు సారదిమును
కడచీల దట్టరీ ఘనముగా మెట్టక - గంభీర సంపద గలుగు నిరును
గలిగి తన రారు నరవంబు గడక నెక్కి - త్రిపుర విజయంబు చేకొన్న దేవదేవు
డిందు శేఖరుడానంద మందిరుండు - మనల గరుణావిధేయుడై మనుచు గాత[1]

'గోశత పంచవార్దులుకు గోయగ వార్దులు, గోత్ర వార్దులున్
గోశర వార్దులున్ ఎదిత గోశర (వార్దులు) పంచ వార్దులో
కేశవ తల్ప, పద్మభవ కెక్కిన వాహన దాన వేళ, దే
వేశుల కిచ్చునట్టి పరమేశ్వరుడీవుత మాకభీష్టముల్''[2]

అచ్చవెల్లి రంగన్న కవి గారు తన రామాయణము (ద్విపద) ఒకటవ పాదార్థమున సహజ స్వరయతి లక్షణమును పేర్కొన్నాడు.

ద్విపద : 'ఎసగు దివ్యుల బెంప ఋషు రక్షింప
నసురుల శిక్షింప నవని పాలింప'[3]

రంగనాథ రామాయణము ముఖ్యముగ రెండు విధములర్థము చేయవచ్చును.

1. పావనులందరు మెచ్చుకొను తీరుగా వాల్మీకి రామాయణమును శ్రీరామ చరితమును వ్రాసెదను.

2. వాల్మీకి కృపచే వసిష్టాది ఋషులు మెచ్చిన రామకథ వ్రాసెదను.

అని యథానువాదము, కథానువాదము అను రెండు విధములు కన్పించును. కావున ఈ కవి చేసినది భారతాంధ్రీకరణము బోలె వాల్మీకి రామాయణమునకు స్వేచ్ఛానువాదము. యధానువాదము, మాతృకానువాదము కానేరదు.[4] రంగనాథ

---

1,2. పెదపాటి జగన్నాథ కవి - ప్రబంధ రత్నాకరము 407, 408, 409 పద్యములు
3. ద్విపద రామాయణము - అచ్చవెల్లి రంగన్న - యుద్ధ కాండ 519 పద్యం
4. వేమూరి వెంకట రామయ్య ఆంధ్ర సారస్వతము - రాజకవులు - పుట 51

రామాయణములో ద్విపదలను అప్పకవి చూపిన ఉదాహరణలు : నిత్య సమాస విశ్రాంతులు : విశ్వామిత్ర శబ్దమునకు రంగనాథుని రామాయణము నందు

'ఎక్కడా గురుడని యెఱుగని నీకు
నక్కటా గురుడు విశ్వామిత్రుడయ్యె'[1]

కాకుస్వరవళులు

అట్టి నామీద నీ వాయలి గెదవు
పట్టి చెట్పులు వాపి పాఱ వైచెదను[2]

ఖండాఖండ ప్రాసములు : రంగనాథ రామాయణము నందు

॥ సీ ॥ "యూగి చరించున మ్మొకరి తుమ్మెదలు
బాగొప్ప గొప్పన బరిగి దాని"[3]

తృతీయ సరళము అను నాసికముగ పలుక బడుటలో

"పోడిమియు నురవడియు నా దెమునను
బలుకుల తృతీయ సరళముల్ వలసినపుడు
భువి స్వకీయాను నాసికంబులును గాక
బలుక బడు నాది కవుల కబ్బముల కలమి"[4]

రాణి వాస ద్రోహి రావణుబట్టి
పోఱిమి చెఱుపవా బుధులు నుతింప'[5]

క్రీ.శ. 1530-42 ప్రాంతమున భద్రకవి లింగకవి 'సానందోపాఖ్యానము' నందును, రంగనాథుడను కవిస్తుతింపబడినాడు. ఇట్లే కొలని గణపతి దేవుడు (1400) పోతన (15వ శతాబ్దం) భానుకవి (పంచ తంత్రకర్త) 1510 - 30 వెన్నెలకంటి సూరన (16వ శతాబ్దం) తురగా రాజకవి, అయ్యంకి బాల సరస్వతులు (16వ శతాబ్ది) లింగమగుంట

1,2,3,4. రంగనాథ రామాయణము యుద్ధ కాండ - 4323, 4348, 6674, 4348 పుటలు, తెలుగు విశ్వ విద్యాలయము

5. అప్పకవీయము ద్వి.ఆ. 162 ప. పుట 70 వావిళ్ల 1970

తిమ్మన (1560) ఆంధ్రకవి రామయ్య (15వ ) టేకుమళ్ళ రంగశాయి (18వ శతాబ్దం) అప్పకవి (17వ శతాబ్ది) మొదలగు[1] వారు తమ గ్రంథములందు రంగనాథుని పేర్కొని స్తుతించిరి.

ఇట్లు రంగనాథుడు పూర్వ కవులచే స్తుతింబడిన, లాక్షణికులచే ఉదాహరింపబడిన కవిగా అంగీకరింపక తప్పదు. రంగనాథ రామాయణము ప్రతి కాండాంతము నందును ఈ క్రింది ద్విపదలలో బుద్ధ భూవిభునికి చేయబడిన విశేషములు రంగనాథునిచే కర్తగా సమర్థించుచున్నవి.

'అని యాంధ్ర భాష భాషాధీశ విభుడు - వినుత కావ్యాగమ విమల మానసుడు
పాలితాచారుడ పారు ధీశరథి - భూలోక నిధి గోనబుద్ధ భూవిభుడు
తమ తండ్రి పిట్టల ధరనీనుపేర - రసికమై చెలుదొందు రామాయణంబు[2]

రంగనాథ రామాయణ కవికి యిందులో అయిదు విశేషములున్నవి. 1. భాషాదీశ విభుడు, 2. వినుత కావ్యాగమ విమల మానసుడు, 3. పాలితాచారుడు, 4. అపారధీశరథి, 5. భూలోక నిధి అనునవి నిజమునకు కవులు ఆత్మస్తుతి చేసుకొనరు. ఒకవేళ చేసికొన్నను ఇట్లు వ్రాసుకొనరు. బుద్ధారెడ్డి స్వయముగా ఈ పదములు చేర్చుకొని యుండుట ఉచితముగా కానరాదు. నన్నయాదులు వ్రాసుకొన్నను అవి ప్రథమ పురుషలో ఉన్నవి.

## ఏకోజి రామాయణమునకు గల స్థానము :

ఈ ద్విపద రామాయణమును గూర్చి ఏకోజీ రచనల గురించి కావ్యారంభమును చివరకు గల అన్ని పాదములను సూచించిరి. ఇతర వివరము లేమియు ఇవ్వలేదు.[3] కొక్కొండ సత్యవతి గారి గ్రంథములో ఇతడు తుళుజరాజు కుమారుడు రెండవ ఏకోజీ క్రీ.శ. 1737 - 1739 వరకు తంజావూరును పాలించెను. రామాయణ కథను తెనుగున ద్విపదలో నారు కాండములు రచించెను.

---

1. డా॥ జి. నాగయ్య తెలుగు కావ్యావతారికలు - పుట 77
2. రంగనాథ రామాయణము - వాల్మీకి రామాయణము తులనాత్మక పరిశీలన డా॥ గుండి వేంకటాచార్యులు
3. రంగనాథ రామాయణము బాలకాండాంతములోని పాదములు

భారత రచనకు ముందుగానే వ్యాసమహర్షి ప్రార్థనను ఆలకించి విఘ్నేశ్వరుడును, సరస్వతీ దేవియును సిద్ధి, బుద్ధియను కన్నియలను వెంట నిడుకొని భూలోకమునకు వచ్చెదరు. ఆ కన్నెలను జూచిన విఘ్నేశ్వరుడు వలపు గొనును. వ్యాసుడు భారత రచనారంభమునకు లేఖకునిగా నుండు మని విఘ్నేశ్వరుని కోరగా, నతడు తాను వలచిన కన్నెలను పెండ్లి గావించిన లేఖకునిగా నుందునని పలికెను. వ్యాసుడు ఆలోచించి ఆ కన్నెలతో విఘ్నేశ్వరునకు వివాహము గావించెను. ఆ తరువాత భారత రచన సాగినది. ఇది 'విఘ్నేశ్వర పరిణయమను' యక్షగాన రచన యందలి గాథ[1] డా॥ పండా శమంతకమణి గారు తన కావ్యములో ఏకోజీ బాబా సాహెబు అను నామమున ప్రసిద్ధుడనియు ఇతడు ఒక సంవత్సరము 1735 - 36 రాజ్య పాలన చేసినట్లును పేర్కొనిరి.[2]

దక్షిణాంధ్ర సాహిత్యము దక్షిణాంధ్ర వాఙ్మయ చరిత్రలో శ్రీ నేలటూరి వేంకట రమణయ్య గారు ఏకోజీని గురించి అసలు పేర్కొనలేదు.[3] డా॥ నాగయ్య గారు భోసల ఏకోజీ (క్రీ.శ. 1735) ద్విపద రామాయణమును రచించినట్లు మాత్రమే పేర్కొన్నారు[4] డా॥ చల్లా రాధాకృష్ణ శర్మగారును పేర్కొనలేదు. [5]

ఈ రామాయణ కర్త ఏకోజీ క్రీ.శ. 1737లో తంజావూరు రాజుగారు తుక్కోజీ తనయుడు. ఈతడు విఘ్నేశ్వర కల్యాణము అను నాటకమును కూడ రచించెను. ఇవి శాహాజి కృతికి అనుసరణమనియు, ఇందులో తన తల్లి 'రాజహంసాంబిక' అని తెలిపెను. రామాయణము యధావాల్మీకముగ రచించినట్లును అవతారికలోని అంశాన్ని బట్టి తెలియుచున్నది. ఈ కవి మహా రాష్ట్రుడైనను చక్కటి తేట తెలుగు పలుకుబడులతో రచించెను. డా॥ నిడుదవోలు వేంకటరావు గారు ఏకోజీ మహారాజు - విఘ్నేశ్వర కల్యాణమును రచించెను. అని అందలి రెండు పాదములు సూచించిరి.

---

1. తంజావూరు సరస్వతీ మహలు డిస్క్రిప్టివ్ కేటలాగు
2. విజ్ఞాన సరస్వతి పరిష్కర్త డా॥ ఎం. బాగయ్య
3. తంజాపురాంధ్ర సాహిత్య చరిత్ర - కొక్కొండ సత్యవతి 1965 పుట 228, 229 ఎ.పి.ఎస్. అకాడమీ బహుకృత గ్రంథము
4. దక్షిణాత్య సాహిత్యము (నాయక రాజుల నాటి) నేలటూరి వేంకట రమణయ్య గారు 1981 వేదం వేంకట రాయశాస్త్రి ప్రచురణ
5. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష నవ్య పరిశోధన ప్రచురణ 1975, తిరుపతి

"ఏక మహారాజు ప్రణీతమీ - విఘ్నేశ్వర
పరిణయమ్ నామమ్ నాటకమ్"[1]

ఏకోజీ 'ద్విపద రామాయణమును రచించెను ఇతనికి 'బాబాసాహెబు' అను నామాంతరము కలదు. అని అవతారిక ద్విపద పాదాలు సూచించినవి.

"శ్రీ గణనాథు నాశ్రిత పారిజాతు

.......................................

ముని నారదుని జూచి ముదమున బలికె"[2] ఏకోజీ రామాయణము నుండి ఈ క్రింది భాగముద్ధృతముః - అని పేర్కొన్న పూర్తి పాదములు.

"ఓ రాక్షసులారా! యుర్విపై నేను - శూరత విలసిల్లు సుగ్రీవు బంట
శ్రీరాము దూతను క్షితిని వాయుజుడ - శ్రీరామ సేమంబు సీతతో చెప్పి
పోవుచున్నాడ నీ పురి రాక్షసులకు - మువిరి మృత్యువై వచ్చి యున్నాడు
నని పల్కి దైత్యుల నందఱ గూల్చి - దనరుచు దోరణ స్తంబంబు నుండె
హత దౌష ముఖమున నా వార్త దెలిసి - ధృతి బూని కోపించి దేవతా రాతి
గురుగొని పింగళాక్షుని దీర్ఘజిహ్వ - వరవక్ర నాసాత్మ వక్ష శార్దూల
ముఖుల నేపురంబున మొనని వారప్పు - డఖిలాస్త్రముల నొప్పు హనుమంతుడలిగి
ధనవులు విఱిచి కేతనములు కూల్చి - పనువడి రథముల భగ్నంబు జేసి"[3]
అని సూచించిరి.

ఇతడు విఘ్నేశ్వర పరిణయమును కూడ రచించెను. ఇది శాహాజీ నాటకాన్ని అనుసరించి వ్రాయబడినది. సంస్కృతాంధ్ర భాషామయము. ముందు 'చూర్ణిక' యందు రామాయణము నందు వర్ణించి నట్లే తన వంశ క్రమమును ఏకోజీ వర్ణించినాడు. ఇందులో సంస్కృతాంధ్ర గద్యములు రెండు గలవు.

---

1. ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర - డా॥ టి. సుశీల 1979 ఢిల్లీ
2. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - 1978 మద్రాసు విశ్వ విద్యాలయం పుట 254
3. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము - మద్రాసు విశ్వ విద్యాలయము పుట 255

తెలుగు :

రాజేంద్ర శరబోజ రాజ నందనుడు - రాజ హంసాంబికా రమ్య సుతుండు
శ్రీకర గుణముల జెలు వొందునట్టి - యేకేంద్ర విరచిత మీ చరిత్రంబు
ఎలమితో తుళ జేంద్ర యే కెందునికిని - బలములు సంతాన భాగ్య సంపదలు
ప్రణవ స్వరూపుడు భక్త పాలికుడు - గణనాయకుండిచ్చు గణన మీఱగను - అని.తల్లి రాజ హంసాంబికను పేర్కొన్నాడు.

సంస్కృతము

"ఇతి శ్రీమద్భోసలకుల కలశాంబుధి ...కర
తుళజ మహారాజ తనూజ ఏక మహారాజ
ప్రణీతంవిఘ్నేశ్వర పరిణయ నాయకం
సాంబశివప్రీతయే విఘ్నేశ్వర ప్రీతమే
............."అని అతని వంశావళిని రచనలు కూడ పేర్కొన్నారు[1]

తంజావూరు సంస్థానమయు ఆంధ్ర సాహిత్య సరస్వతికి కంఠ హారమున దగినది. కవులకు, నాయకులకు రఘునాథ భూపాలుడు స్వర్ణాభిషేకము చేసిన చోటు ఇదే. ఆంధ్ర పాణిని బిరుదాంకితుడగు శేషాచలపతి సంగీత సాహిత్య విద్యా విశారదుడగు శివాజీ చేత కనకాభిషేక గౌరవము పొందినాడు. ఇతడు భోసల వంశీయుడు. ఈతని తండ్రి తులజేంద్రుడు, తన రామాయణమును తండ్రికే యంకిత మిచ్చియున్నాడు. తండ్రి తులజేంద్రునకు 'మకరంద' బిరుదు గలదని పేర్కొన్నాడు.[2]

ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహమున ఆచార్య ఖండవల్లి లక్ష్మీ రంజనము గారు ఏకోజీని గూర్చి అసలు పేర్కొనలేదు. రామాయణ సుధాలహరి (ఉపన్యాస మంజరి) 1984 తిరుపతి తిరుమల దేవస్థానము వారు ముద్రించిన గ్రంథములో ఏకోజీ ప్రసక్తి లేదు. డా॥ గుండి వేంకటాచార్యులు గారు చేసిన పరిశోధన గ్రంథములో (రంగనాథ - వాల్మీకి రామాయణములు తులనాత్మక పరిశీలన) ఏకోజీ విషయము లేదు.

1. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - పుట - 256 - మద్రాసు 1978
2. ఏకోజీ రామాయణము - ప్రథమ సంపుటము పీఠిక - పరిష్కర్త డా॥ఎం. బాగయ్య గారు, 1993

తంజావూరు డిస్ట్రిక్టివ్ కేటలాగులో ఏకోజీ రామాయణము గురించి అధ్యంత్యములు పేర్కొనబడినవి. కొంత శిధిలము గానున్నను సమగ్రమని పేర్కొన్నారు.

ఇట్లు రంగనాథ రామాయణమున సమగ్రమై, సరళమై విలసిల్లుచున్నది. ఏకోజీ రామాయణము సంక్షిప్తమునైనను సమగ్ర గ్రంథముగాను సులభశైలు విరాజిల్లుచున్నది. రంగనాథ రామాయణమును అనాదిగా పేర్కొనుట ఆనవాయితీగా నున్నది. నన్నయ, తిక్కన, భాస్కరులు తుదుపరి రంగనాథ రామాయణమును పేర్కొనుటను గమనింపవచ్చును. అనంతామాత్యుడు భోజరాజీయము నందును, కొఱవి గోపరాజు 'సింహాసన ద్వాత్రింశిక యందును, కవయిత్రి మొల్ల పెదపాటి జగన్నాధకవి 'ప్రబంధ రత్నాకరముననను, లింగమగుంట తిమ్మన 'బాలభోద ఛంధస్సు' నందును రంగనాథుని గురించి తద్వార రంగనాథ రామాయణమును గురించి తెలియవచ్చుచున్నది.

రంగనాథ రామాయణము గూర్చి కవిత్రయానంతరము వెలుగులోనికి వచ్చినను కర్తృత్వ విషయమున వివాదమేర్పడుటచే అది కర్త పేరుతో కాకుండా రంగనాథ రామాయణమను పేరనే బహుళ ప్రాచుర్యమును పొందినది. రామాయణము నెవరు రచించినను కర్తపేరు మొదటగా ప్రస్తావించుట వాల్మీకి నుండియు ఆచారముగాను, సాంప్రదాయముగాను వచ్చుచున్నది. 'రామా' అని ఉచ్చరించి నంతనే పాపములు పటా పంచలై పోవునని పెద్దలు చెప్పిన మాట. అట్టి రామాయణమును మరింత భక్తితో, మరింత మనోహర నామముతో పేర్కొనుటకై గోనబుద్ధారెడ్డి తను రచియించిన రామాయణమునకు 'రంగనాథ రామాయణము' అను ముక్తి నామకమైన పేరును పెట్టి యుండవచ్చును. విష్ణ్వంశ సంభూతుడైన శ్రీరాముని చరితమునకు 'రంగనాథ' నామమును కూడా చేర్చి 'రంగనాథ రామాయణము' అనునంతనే వారి, వినిన వారి, వ్రాసిన, చదివిన వ్రాయించిన, చదివించిన వారియొక్క పుణ్యము ద్విగుణీకృతమగుట తథ్యము.

మూల రామాయణములో లేని రంగనాథ దేవాలయ ప్రసక్తి రంగనాథ రామాయణములోనే గలదు. కావేరీ నదీ గర్భమున శ్రీరాముని అంశ చేతను, ఆశీర్వాదము చేతను వెలసిన రంగనాథుని ఇతివృత్తము. గోనబుద్ధారెడ్డి రచియించిన రామాయణము నందు సవివరముగా వున్నది. త్రేతాయుగము నాటి దేవ దానవ మానవులే కాకుండా కలియుగములోని నేటి మానవులు కూడ పూజించుటకై వెలసియున్న

రంగనాథస్వామి పుట్టు పూర్వోత్తరములు, ప్రాశస్త్యములను సవిస్తరముగా వర్ణించుటచే రంగనాథ రామాయణము అను పేరూ విన్నంతనే మనస్సులు తేలికయి అలౌకికానందమును పొందుచున్నవి. రంగనాథ రామాయణము సాహిత్యములోనే గాక మానవ జన్మమెత్తిన ప్రతి యొక్కరి మదిలో స్థిరమైన స్థానమును కలిగియున్నది. అందుకే జన్మలన్నింటిలోను మానవ జన్మయే ఉత్కృష్ట జన్మయని తెలుసుకొనుట వివేకము.

డా. ఎం. పద్మకుమారి

# సింహావలోకనము

ప్రథమ ప్రకరణము నందు తెలుగు సాహిత్యములోని వివిధ ప్రక్రియల రామాయణములను పేర్కొని ఇతర సోదర భాషలలోని కన్నడ, ద్రావిడ రామాయణములను కూడా వివరించితిని. ఆచార్య కొలవెన్ను మలయవాసిని గారి పరిశోధన గ్రంథము నాకెంతయో యుపయోగించినది. వివిధ రామాయణముల రచనల నాటి సామాజిక, రాజకీయ పరిస్థితులను వివరించితిని. పురాతన, ఇతిహాస కావ్య, చంపూ, గద్య, పద్య, యక్షగాన, జానపదములు మొదలైన వాటనన్నింటి గూర్చి వివరించుటకు ప్రయత్నించితిని. అది కేవలము సమీక్ష మాత్ర రామాయణముల యందలి సారమంతయు యొక్కటియే. రచించి తరిం ప్రజలకు సుఖశాంతులు కల్గించు, మోక్షము నాపాదించు కావ్యము రామాయణము గనుకనే, ఈ రచనకు పలువురు కవులు, పండితులు వారి వారి కాల ప్రభావములకు లోనై రామాయణ రచనకు ఉపక్రమించిరి.

ద్వితీయ ప్రకరణములో ద్విపద ప్రక్రియను గూర్చి కవిత్వము, ఛందస్సు, జాతులు, రగడలు, కందములు, లాక్షణికుల మత సంప్రదాయములు అప్పకవి వంటి వారి ప్రామాణిక ఛందోవిశేషములు పేర్కొంటిని. ద్విపదకు దక్షిణాంధ్ర దేశములో సాగిన రచనలు, అందులో రామాయణములు, అసంఖ్యాకములుగా బయలు దేరినవి. స్త్రీల, బాలల గేయ రూపకములు యక్షగానములు, దేశికవితకు చేయూత నిచ్చినవి. ప్రాచీన సంప్రదాయములు, ప్రామాణిక విశేషములు సోదర భాషలలో గల కాశ్మీర, అస్సామి వంటి భాషలలోని రామాయణముల వివరములు పొందుపరచితిని. సంగీతమునకు సన్నిహిత సంబంధ ద్విపద విశేషములు వివరించితిని. ద్విపద కవిత్వ లక్షణములు, శైవమత ప్రచారమే ద్విపదకు, పామర జన, రంజకమునకు పండిత జనామోదమునకు ఆధారమైనవి. అన్నమాచార్యులు చిన్నన్న వంటి ఆరాధ్య గురువుల ద్విపద రచనలను వివరించితిని. రంగనాథ - ఏకోజీ రామాయణ కవుల నాటి ద్విపద రచనలను గూడ పేర్కొంటిని.

తృతీయ ప్రకరణమున ఈ రెండు రామాయణముల కాలము నాటి సాంఘిక, మత, రాజకీయ పరిణామములు, మధుర, తంజావూరు, పుదుక్కోటలలో విజయనగర

సామ్రాజ్య పతనానంతరము వివిధ రాజుల స్వతంత్ర రాజ్యములు, కవులు, పండితుల ఆదరాభిమానముల పోషణ. నృత్య సంగీత కళా పోషణ, భాషా సంస్కృతులు, శాసనములు. జాతీయ సమైక్యత, భాషా సమైక్యత, విషయ వివరణ, సర్వమత సమాదరణ. ఏకోజీ మహారాజు వంటి రాజకవుల ప్రజ్ఞాపాటవములు దక్షిణ దేశీయాంధ్రుల శైవ, వైష్ణవ మత సిద్ధాంతములు రంగనాథ ఏకోజీ రామాయణములు - ఆనాటి రాజకీయ పరిస్థితులను నాశక్తి కొలదీ వ్యక్తపరచితిని.

రామాయణములలో రాజులు ఏలిన సంవత్సరములను వివిధ కవుల ప్రకటనలను, అభిప్రాయములను బుద్ధారెడ్డి, ఏకోజీ కవుల ద్విపద రచనలను సవిస్తరముగా వివరించితిని. ఈ కవుల నాటి కాలములో యక్షగానాదులు, ప్రజల యోగక్షేమములు సాంఘిక పరిస్థితులు, వివరింపబడినవి.

చతుర్థ ప్రకరణము నందు రంగనాథ, ఏకోజీ రామాయణములలోని అవాల్మీకాంశములను ఆనాటి సమన్వయ దృష్టిని, ప్రజల, పండిత, పామర జనులను, రంజింపచేసిన ఘట్టములు గలవు. గౌతముడు, అహల్య, వాలి, సుగ్రీవుడు, ఆంజనేయుడు, రావణుడు, విభీషణుడు, ఇంద్రజిత్తుల వంటి వారి పాత్రల సంభాషణములలో గల చిత్రములు సులోచన వంటి, మండోదరి, కేకసి వంటి వీర వనితల వివరములు కాలనేమి, జంబుకుమారి, ఉడుతాభక్తి, రామేశ్వర స్థాపన భక్తి, సౌమిత్రి హాసము. రామలక్ష్మణుల జన్మదినవార నక్షత్రములు, అహల్య శాపము, తారా విలాపముల వివరించితిని.

పంచమ ప్రకరణములో రెండు రామాయణములు సమకాలికాంశముల ప్రతిఫలనము కవికీర్తి, కావ్యము, కీర్తియే ధనము, అమంగళక్షతి, లోకము శాస్త్ర వినోదములతోడను. మూర్ఖులు నిద్ర తోడను, కాలము గడుపుదురు. కవులు, కావ్య రచనతో ఆనందించి. రసానందమును పొంది, ముక్తి సోపానములు గాంతురు. ఇహ పరములను వివరింతురు. రామాయణ రచనచే ఫలితము, సాంఘిక జీవన ప్రమాణము, శక్తి, యుక్తి, ముక్తి మార్గములు, వర్ణనలు వివరించితిని. ధాన్యమాలి, శబరి వంటి భక్తుల ఫల వివరములు గలవు.

షష్ఠ ప్రకరణములో రెండు రామాయణముల రచనా ధ్యేయములు వివరించి, దశావతారములు. శ్రీరామావతార విశిష్టత, ఆది కావ్యము రామాయణము తెలుగు.

తమిళ, కన్నడ భాషలలో వెలసిన రామాయణములు వారి వారి రచనా ఉద్దేశ్యములు, ఆదర్శములు, ఆచార వ్యవహారములు, మార్గదర్శకములు, సంప్రదాయములు పారమార్థిక దృష్టి బుద్ధారెడ్డి రచన ధ్యేయము, ఏకోజీ రచనా ధ్యేయములు. శ్రీరాముని కథను వ్రాసి పుణ్యమును సంపాదించుటయే. ఆ కవులిద్దరు వారి వారి తండ్రులపైగల అభిమానముతో రామాయణములు రచించి, అంకితములిచ్చుట జరిగినది. దేశిశాఖ సుసంపన్నమగుట చేత గోనబుద్ధారెడ్డి, కట్టా వరద రాజు, ఏకోజీ ముగ్గురు ద్విపద రాజకవులు గావున రచనలో విశిష్టత గలదు. ఏకోజీ, గోనబుద్ధారెడ్డి రచనను ఆదర్శముగా గ్రహించి, పండిత, పామర జనరంజకముగా రచించెను. సరళమైన ఛందస్సు గలదు. అవాల్మీకాంశములు రంగనాథలో వలె నున్నవి. ఇతడు మూల రామాయణమునకు 1/10 వంతు సంక్షిప్తము గావించినాడు. ఈ కార్యములు లౌకిక పరముగా. పారమార్థికముగ. మనోహరముగా తీర్చిదిద్దెను.

సప్తమ ప్రకరణములో రెండు రామాయణములలో గల పురాణ. కావ్య లక్షణములు, వాటి సమన్వయములు, శబ్ద ప్రయోగము[illegible] పూర్వ గాథలు, రంగనాథ, ఏకోజీ రామాయణములు పురాణ కావ్యములకు సంబంధితమని నిరూపింపబడినవి. అష్టాదశ పురాణముల వివరములు, రామకథ, పురాణ. కావ్యములలో గల విశిష్టము, జనశ్రుతులు, రచనారీతి, అవతారముల ప్రశంస, రాహు కేతువులు, మునిపత్నులు గర్భము దాల్చుట, యవనాశ్వుని వృత్తాంతము, నారాయణుడే మాంధాత నవతారమనుట, వాలి సుగ్రీవులు, తార రుమల వృత్తాంతములు, కరుణావతి చరిత్ర, త్రికూట పర్వత వర్ణన, రామేశ్వర ప్రతిష్టలు ప్రాచీన సంప్రదాయమునకు పురాణ, కావ్య రచనా రీతులను పోషించినవి. ఇతివృత్త, నాయక, ప్రతి నాయక, రస విశేషములు గలవు.

అష్టమ ప్రకరణము నందు పాత్ర చిత్రణలలో దేవతలు, మహర్షులు, వానరులు, మానవులు, రాక్షసులు కీర్తించినారు. ఉడుత వంటి ప్రాణి చేత సేతు బంధనమునకు సహాయము పడినట్లు శ్రీరామ ముద్రికలు చూపబడినవి. పాణి గ్రహణము, లోకాపవాద, అగ్ని ప్రవేశము, భ్రాతృప్రేమ, మాతృ-ఆవేదన, రాక్షస, దేవతల గుణ ప్రభావములు, వానర భక్తి, కరుణ రసములు అద్భుతముగా పోషించబడినవి. త్యాగము, పతిభక్తి, రామభక్తి ధీశక్తులున్నవి.

నవమ ప్రకరణము నందు కథా సంవిధానము, లోకములోని లోతు పాతులు. మనుష్య విధి, ఉత్తమ కవి, మానవ ప్రవృత్తి, కావ్య ఘట్టములు, దేశాచారములు. సాంసారిక పరిస్థితులు చిత్రములు, సంభాషణములు. సంవిధానమనగా ప్రజల నాడిని బట్టి కథనల్లుట, కల్పించుట, చిత్రించుట, సామాన్యులకు సహితము తమవైపు మళ్ళించుకొనుట, తాతల వద్దకు మనుమలు విద్య నేర్చుటకై వెళ్ళుట, అత్త మామలు లాంచనములిచ్చుట, శుభ, సుఖాంతములుగా కథ జరుగుట సంవిధానము. విష్ణువు రాముడుగను, లక్ష్మీదేవి సీతగను, జన్మించినట్లు గోచరింపచేయుట, స్నాన, అన్నపానాదులు విధిగా నిర్వహించు సంప్రదాయమును వ్రాయుట సంవిధానము. జాత కర్మలు, కళ్యాణము, నక్షత్రము, యోగదృష్టి, పాపపు దృష్టి, గొడ్రాలి విషయము, అనేకములగు, పర్వతముల పేర్లు వివరింపబడినవి. దుస్వప్నములు, ఫలితములు విధి వక్రతలు వివరింపబడినవి. పుణ్య శ్లోకుడైన శ్రీరాముని కథ వ్రాయుటకు గోనబుద్ధారెడ్డి, ఏకోజీలు, ప్రసన్నముగా కథలు చెప్పుట పాఠకుడి మనసును ఆహ్లాదపరుచుట. పరమాత్ముని నిరూపించుట కథా సంవిధాన రచనములు.

దశమ ప్రకరణములో వర్ణనా వైరుధ్యము కావ్యము, ప్రబంధము వాటి వర్ణములు, మహా కావ్యము, సంధ్య, రజని, ప్రదోష, ధ్వాంత, వానర, మృగయా, ముని, స్వర్గ ఆధ్వరములను కావ్య వర్ణములకు వర్తింపచేయుట అష్టాదశ వర్ణనలు కాక ఇరువది రెండు అని అప్పకవి వంటి వారి సూచనలున్నవి.

ఏకాదశ ప్రకరణము నందు ఈ రెండు రామాయణములకు గల స్థానము దేశీ కవిత్వము చేత గుణముల చేత, పాత్రల చేత ప్రదర్శితమై వాటి స్థానములను గ్రహింపబడినవి. ధర్మము, అర్వాచీనము, సారస్వతము, సంప్రదాయము, అనుకరణ, కీర్తికాంక్ష, కీర్తనలు పాటలుగా వ్యాప్తి నొందినవి. పురుషోత్తముని వర్ణించుట, భాషా శైలికి గల స్థానములు, ఉపవాసములు, యధానువాదము కధానువాదములు రెండు వాటి స్థానమును పొందుట.

ఆత్మస్తుతి, విఘ్నేశ్వర పరిణయము వంటి రచనలు, గణపతికి ఇద్దరు భార్యలు, ఇద్దరు పుత్రులని, దక్షిణాంధ్ర వాఙ్మయములో పేర్కొనుట వలన ఆనాటి సంస్కృతి విధితమగును. ఇవి ముక్తి దాయకములు.

# ఉపయుక్త గ్రంథ సూచిక


1. అచ్చతెనుగు రామాయణము : కూచిమంచి తిమ్మకవి, వావిళ్ళ రామస్వామి - 1954
2. అనర్ఘ రాఘవము : బిజ్జల తిమ్మ భూపాలుడు - కేశవ పంతుల నరసింహ శాస్త్రి, పరిష్కర్త, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - 1977
3. అన్నమాచార్య చరిత్ర : తాళ్లపాక చిన తిరుమలా చార్యుడు (చిన్నన్న)
4. అప్పకవీయము : కాకుమారి అప్పకవి - వావిళ్ళ రామస్వామి - 1975
5. అష్టమహిషీ కళ్యాణము : తాళ్లపాక చిన్న తిరుమలా చార్యుడు (చిన్నన్న)
6. ఆంధ్ర కవి తరంగిణి : శ్రీ చాగంటి శేషయ్య
7. ఆంధ్ర కవుల చరిత్ర : వీరేశలింగం పంతులు
8. ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర : డా॥ టి. సుశీల - ఢిల్లీ - 1979
9. ఆంధ్ర పురాణము - సమగ్ర పరిశీలనము : డా॥ బండికాడి నాగిరెడ్డి - 1997
10. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము : విద్యానాథుడు, శిరోమణి విద్వాన్ చెలమ చెర్ల రంగాచార్యులు
11. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర : ఆచార్య యస్వీ. జోగారావు, ఆంధ్ర విశ్వ విద్యాలయము
12. ఆంధ్ర రచయిత్రులు : మోచర్ల రామకృష్ణకవి
13. ఆంధ్ర వచన వాఙ్మయము ఉత్పత్తి వికాసములు : ఆచార్య ఎం. కులశేఖరరావు

14. ఆంధ్ర వచన వాఙ్మయము : కళాప్రపూర్ణ నిడుదవోలు వెంకటరావు, 1977

15. ఆంధ్ర వచన రచనా పరిణామము : గొబ్బూరి వెంకటానంద రాఘవరావు

16. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర : కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

17. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర : ఆచార్య దివాకర్ల వెంకటావధాని

18. ఆంధ్ర వాఙ్మయము - రామాయణము : ఆచార్య కోలవెన్ను మలయవాసిని, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

19. ఆంధ్ర వాల్మీకి రామాయణము : వావిల కొలను సుబ్బారావు

20. ఆంధ్ర సారస్వతము రాజకవులు : వేమూరి వేంకట రామయ్య

21. ఆంధ్ర సాహిత్య చరిత్ర : పింగళి లక్ష్మీకాంతం

22. ఆంధ్ర సాహిత్య వికాసము : డా॥ పి. యశోధారెడ్డి

23. ఆంధ్రుల చరిత్ర : డా॥ బి.యన్.యల్. హనుమంతరావు, 1989

24. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి : ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం

25. ఉత్తర రామ చరిత్ర (పీఠిక) : వేదం వేంకట రామశాస్త్రి

26. ఉత్తర రామాయణము : కంకంటి పాపరాజు, వావిళ్ళ రామస్వామి

27. ఉత్తర రామాయణము : విఠల నాథుడు, కాచవిభుడు

28. ఉత్తర హరిశ్చంద్రీయము : గార్ల దిన్నె సుబ్బారావు - ఆదోని - 193

29. ఋగ్వేద సంహిత : వడ్లమూడి గోపాల కృష్ణయ్య, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

30. ఏకోజీ రామాయణము : డా॥ ఎం. బాగయ్య (పరిష్కర్త) 1993 ఉస్మానియా విశ్వవిద్యాలయము

31. కంబరామాయణము : పూతల పట్టు శ్రీరాములు రెడ్డి (తెలుగు

32. కవిజనాశ్రయము : మల్లియరేచన

33. కావ్య దర్పనము : భూపతి లక్ష్మీనారాయణ

34. కావ్యాదర్శము : దండి మహాకవి

35. కావ్యాలంకార చూడామణి : విన్నకోట పెద్దన

36. కావ్యాలంకార సంగ్రహము : బులుసు వేంకట రమణయ్య (పరిష్కర్త) 1969

37. కావ్యావతారికలు : డా॥ జి. నాగయ్య

38. గౌతమ వ్యాసములు : పింగళి లక్ష్మీకాంతం - విశాఖ, 1964

39. ఛందోదర్పణము : అనంతుడు - వావిళ్ళ రామస్వామి

40. జానపద కళాదర్శనం : డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి, 1997

41. తంజాపురాంధ్ర సాహిత్య చరిత్ర : కొక్కొండ సత్యవతి - 1965

42. తంజావూరు సరస్వతీ మహలు : వివరాణాత్మక కేటలాగు

43. తాళ్లపాక కవుల కృతులు వివిధ సాహితీ ప్రక్రియలు : డా॥ వేటూరి ఆనందమూర్తి - 1974

44. తాళ్లపాక కవుల పదకవితలు భాషా ప్రయోగ విశేషాలు : డా॥ వేటూరి ఆనందమూర్తి - 1976

45. తాళ్ళపాక చిన్నన్న సాహిత్యము పరిశీలనము : డా॥ వేటూరి ఆనందమూర్తి

46. తిరుమల తిరుపతి దేవస్థానము ప్రాచ్య పరిశోధన సంస్థ : పత్రిక, వాల్యూమ్ - 8, పార్టు - 1, 1947

47. తెలుగు దాక్షిణాత్య సాహిత్యములు : ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి - 1975

48. తెలుగు సాహిత్యములో రామకథ : డా॥పండా శమంతకమణి - 1972

49. తెలుగులో సాహిత్య విమర్శ : ఆచార్య ఎస్వీ. రామారావు, 1974
50. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము : డా॥ నిడదవోలు వేంకటరావు, 1978
51. దక్షిణాత్య సాహిత్య సమీక్ష : డా॥ జి. నాగయ్య, తిరుపతి, 1976
52. దక్షిణాంధ్ర సాహిత్యము : నేలటూరి వేంకట రమణయ్య, 1981
53. ద్విపద రామాయణ భారతి : డా॥ జంగా వెంకట సుబ్బారాయుడు, 1981
54. ద్విపద రామాయణము : అచ్చవెల్లి. రంగన్న
55. ద్విపద వాఙ్మయము : డా॥ జి.నాగయ్య, తిరుపతి - 1967
56. నాట్య శాస్త్రము : డా॥కోనంగి శ్రీరామ అప్పారావు
57. నిర్వచనోత్తర రామాయణము : తిక్కన
58. పండితారాధ్య చరిత్రము : పాలకుర్తి సోమనాథుడు
59. ప్రథమాంధ్ర మహా పురాణము : డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం, 1973
60. ప్రబంధ రత్నాకరము : పెద్దపాటి జగన్నాథ కవి
61. పరశురామాయణము : ఉలిచి భావజ్ఞుడు, ఓ.యం.ఎల్, మద్రాస్, గ్రంథము నెం. 1111
62. పారిజాతాపహరణము : మాతృభూతన
63. బసవ పురాణము : పాల్కురికి సోమన, 1966
64. బాలబోధ ఛందస్సు : లింగమగుంట తిమ్మన
65. భాస్కర రామాయణము : పరిష్కర్త భారతుల మార్కండేయ శర్మ, 1969
66. భోజరాజీయము : అనంతామాత్యుడు - వావిళ్ళ, 1958
67. బ్రహ్మవైవర్త పురాణము : తిరుమల తిరుపతి దేవస్థానములు

68. మను, వసు చరిత్రల తులనాత్మక పరిశీలనము : డా॥ ముదిగంటి సుజాతారెడ్డి, 1981

69. మాత్రా ఛందస్సులు వ్యాస సంగ్రహము : డా॥ చిలుకూరి నారాయణరావు

70. మొల్ల రామాయణము : కవయిత్రి మొల్ల, బాలసరస్వతీ బుక్ డిపో, 1987

71. మైరావణ చరిత్ర : పోలుమంచి బసవన, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, నెం. 2610

72. రంగనాథ రామాయణము : గోనబుద్ధారెడ్డి - వావిళ్ల

73. రంగనాథ రామాయణము : గోనబుద్ధారెడ్డి - రాయల్ అండ్ కో, 1949

74. రంగనాథ రామాయణము : గోనబుద్ధారెడ్డి - ఆంధ్ర విశ్వకళా పరిషత్, 1942

75. రంగనాథ రామాయణము : గోనబుద్ధారెడ్డి, తెలుగు విశ్వ విద్యాలయము, 1989

76. రంగనాథ-వాల్మీకి రామాయణము : డా॥ గుండి వెంకటాచార్యులు 1981

77. రాఘవ పాండవీయము : పింగళి సూరన

78. రామాభ్యుదయము : అయ్యల రాజు రామభద్రుడు

79. రామాయణ సుధాలహరి : జంధ్యాల పాపయ్య శాస్త్రి, తిరుమల తిరుపతి దేవస్థానములు, 1984

80. రామాయణము : పడాల రామారావు - రాజమండ్రి, 1974

81. రామాయణ ఉపన్యాసములు : అనువాద కర్త వేలంపాటి లక్ష్మీనరసయ్య, 1981

82. రామాయణ - విశేషములు : సురవరం ప్రతాప రెడ్డి, ఆంధ్ర సారస్వత పరిషత్, 1987

83. లక్షణ దీపిక : వార్తక కవి రాఘవయ్య

84. లక్షణ సార సంగ్రహము : కూచిమంచి వెంకట కవి

85. వాల్మీకి రామాయణము : జయశ్రీ పబ్లికేషన్స్, హైద్రాబాద్

86. వాచస్పత్య నిఘంటువు : వాచస్పతి

87. విఘ్నేశ్వర పరిణయము : డా॥ ఎం. బాగయ్య (పరిష్కర్త) విజ్ఞాన సరస్వతి, ఎ.పి.జి.ఓ.యం.ఎల్, వాల్యూమ్ 4, జూన్ - 1987

88. వ్యాసావళి : (నాచన సోమనాథుడు - సంవిధాన చక్రవర్తి) వ్యాసకర్త కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

89. శతకంఠ రామాయణము : ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ

90. శబ్దార్థ చింతామణి : ..................

91. శ్రీకృష్ణ రామాయణము : శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

92. శ్రీమద్రామాయణము : శ్రీ జయశ్రీ పబ్లికేషన్స్, హైద్రాబాద్

93. శ్రీమద్యోగానందాంధ్ర రామాయణము : యోగానంద కవి

94. శ్రీరామ చరిత మానసము : కేశవ తీర్థ స్వామి

95. శ్రీరామాయణము : కట్టా వరద రాజకవి, తంజావూరు శరభోజ, మహారాజ సరస్వతీ మహల్

96. శ్రీ మద్రామాయణ కల్పవృక్షము : విశ్వనాథ సత్యనారాయణ, 1992

97. శ్రీరామానుజ రామాయణము : శ్రీ మ.న.చ.రా. చార్యులు, 1984

98. సంగ్రహ రామాయణము : చిలకమర్తి లక్ష్మీనరసింహం

99. సంవిధాన చక్రవర్తి : ఆచార్య, తుమ్మపూడి కోటేశ్వరరావు, అనంతపురం

100. సమగ్రాంధ్ర సాహిత్యము : ఆరుద్ర యం. శేషాచలం అండ్ కో 1965

101. సింహాసన. ద్వాత్రింశిక : కొరవి గోపరాజు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - 1992

## ఆంగ్లము

1. The Kashmiri Ramayana : A. Grierson - Asiatic Society of Bengal

2. The Bengali Ramayana : Dr. C. Sen

3. The Maratha Rajahs of Tangore : Dr. K. R. Subrahmanyam, 1929

4. The Southern School in Telugu Literature : Dr. K. Venkata Rao, Madras University - Madras, 1978

